# తెలుగు ప్రచురణ రంగం

మువ్వల సుబ్బరామయ్య

జ్యోతి పబ్లికేషన్స్

కార్ల్ మార్క్స్ రోడ్,
విజయవాడ-520 002.

స్థిరవాణి : 0866-2577828
సంచారవాణి : 8978261496

# TELUGU PRACHURANA RANGAM –1

By :
**MUVVALA SUBBA RAMAIAH**



**JAYANTHI PUBLICATIONS**
ESTD : 1955
KARL MARX ROAD
VIJAYAWADA - 520 002.
Ph : 0866-2577828
Mobile : 8978261496

First Edition : 2015

Price : ₹ 100-00

DTP :
**SRI SRINIVASA GRAPHICS**
Ph : 9440397989

Printers :
**NAGENDRA ENTERPRISES**
VIJAYAWADA - 3.

పెద్దన్న  కె. కుదీరాం బోస్
చిన్నన్న  ఎ. గోపాలం
సోదరుడు జి. సుభాష్ లకు
అంకితం.

ఈ రచనకు తోడ్పడిన ఎన్నో గ్రంథాలు, పత్రికలు, రచయితలు, ప్రచురణకర్తలు, సాహితీ మిత్రులకు కృతజ్ఞతలు.



# సాహితీ చతురస్రంలో ప్రచురణ పార్శ్వం

జయంతి ప్రచురణల వజ్రోత్సవ వత్సరమిది. తెలుగునాట పుస్తక ప్రచురణ అనేది ఒక మహాయజ్ఞం లాంటిది. సృజనకారులైన కథకులు, కవులు, రచయితలు తమ కృషిని, కృతిని అశేష పాఠకులకి అక్షర (అచ్చు) రూపంలో అందించే క్రమంలో ప్రచురణకర్తల ప్రాధాన్యం ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. రచయిత–పాఠకుడు మధ్య ముద్రాపకుడు, ప్రచురణకర్త... ఈ నలుగురితో కూడిన సాహితీ చతురస్రమిది.

తెలుగులో, ఆ మాటకొస్తే భారతీయ భాషల్లో ప్రచురణల యుగానికి 'ప్రచార' లక్ష్యంతోనే ఆవిష్కరణ జరిగింది. ముద్రణయంత్రం రూపొందడంతో సిరాంపూర్ (శ్రీరాంపూర్)లో క్రైస్తవ మిషనరీలతో ప్రారంభమైన ప్రచురణరంగం మూడు శతాబ్దాలుగా మతప్రచారవ్యాప్తికి సాగిన దశ మొదటి మజిలీ. ఆ మార్గంలోనే అన్ని భాషల్లోనూ ప్రచురణరంగం ప్రారంభమై, పరిఢవిల్లి ఈనాటికి మానవజీవితంలో, సంస్కృతిలో అవిభాజ్యమైన పార్శ్వంగా మారింది.

విద్యావ్యాప్తికీ, చైతన్య వికాసాలకీ ప్రచురణరంగం అనేక ప్రక్రియల ద్వారా చేసిన కృషికి ఈనాటి ఉదాహరణ మాధ్యమరంగం... ముఖ్యంగా పత్రికలు. తెలుగులో ప్రచుణరంగానికి 150 ఏళ్లకి పైగా చరిత్ర ఉంది. ఈ చారిత్రక ప్రస్థానాన్ని పాఠకులకు అందించే ప్రయత్నంలో 'జయంతి' పెరుమాళ్లు సిసలైన వారసుడు మువ్వల సుబ్బరామయ్య రూపొందించిన ఈ పుస్తకం ఆసక్తికరమైనది...అవశ్యం పఠనీయమైనది.

ప్రచురణ అనగానే మనకి వావిళ్లవారు, కొండపల్లి వీరవెంకయ్య, వేంకట్రామ అండ్ కో .... ఇలాంటి ప్రతిష్ఠాత్మకమైన సంస్థలు తెలుగుజాతికి సాక్షరతాసాధన క్రమంలో నిర్వహించిన పాత్ర అనన్య సామాన్యం. ప్రాచీన, ఆధునిక సాహిత్యాలే కాకుండా సామాజిక, శాస్త్ర విజ్ఞాన రంగాల్లో వినోదాన్ని, విజ్ఞానాన్ని సామాన్య పాఠకులకు అందుబాటులో ఉండే విధంగా ఏర్పాట్లు చేసిన ప్రచురణకర్తను మనం ఎప్పటికీ మరచిపోలేం. ఈనాటి పుస్తక ప్రదర్శన మహోత్సవాల్లో ఆముష్మిక విషయాల నుండి ఐహిక విషయాల వరకు అందుబాటులో ఉన్న సకల సమస్త విజ్ఞానానికి మూలకారకుడు ప్రచురణకర్త. అనేక అద్భుతమైన రచనలు ఎంతో అందంగా వెలుగులోకి తెచ్చేది ప్రచురణకర్తలే.

ఈ రంగం సేవాభావంతో మొదలై, వృత్తిగా రూపుదిద్దుకొని ప్రస్తుతం వ్యాపార పరిశ్రమల స్థాయికి ఎదిగింది. ఈ క్రమంలో గతంలో ఉద్యమస్ఫూర్తితో పనిచేసిన, అంకితభావంతో మెలిగిన ప్రచురణసంస్థలెన్నో కాలగర్భంలో కలిసిపోయాయి. ఇందుకు అనేక కారణాలున్నాయి. ఈ కథనంతా వివరిస్తూ ప్రచురణరంగానికి సంబంధించిన సమాచరం సేకరించి నిక్షిప్తపరచిన భాండాగారమిది.

ఈనాడు ప్రభుత్వ సహాయ సహకారాలతో వేలకొలది గ్రంథాలు ప్రచురిస్తూ సేవలందిస్తున్న నేషనల్ బుక్‌ట్రస్ట్ (దాదాపు 20 వేల పుస్తకాలు ప్రచురించిన సంస్థ), కేంద్ర సాహిత్య అకాదమి (5 వేల టైటిల్స్ వరకు ప్రచురించారు) తో పాటు మన రాష్ట్రంలో ఆంధ్ర సారస్వత పరిషత్, విశ్వవిద్యాలయాల ప్రచురణ విభాగాలు వేలాది పుస్తకాలను వివిధ రంగాల్లో ఉపయుక్తమయ్యే విధంగా వెలుగులోకి తెచ్చాయి.. తెస్తున్నాయి.

ఇప్పుడు మార్కెట్ ఒత్తిళ్ల ప్రభావంతో ప్రచురణ రంగంలో ఆదర్శాలు, ఆశయాల స్థానంలో లాభాపేక్ష సహజంగానే పైచేయి అయింది. ఉద్యమ అవసరాలకోసం పనిచేసే సంస్థలు (విశాలాంధ్ర బుక్ హౌస్, ప్రజాశక్తి...) మినహా ప్రచురణరంగంలో తిమింగలాల బారినపడి, వ్యక్తిగతంగా బాధ్యతలు నిర్వహిస్తున్న ప్రచురణకర్తలు, వారితోపాటు పాఠకులు నానా అవస్థలు పడుతున్నారు. దానికి తోడు ప్రభుత్వాల విధానాలు కూడా ఇలాంటివారికి ఊరట చేకూర్చలేకపోతున్నాయి.

ఈ నేపథ్యంలో ప్రభుత్వ సహాయ సహకారాలతో ప్రమేయం లేకుండా ప్రచురణకర్తలు గతంలో నిర్వహించిన భూమిక నుండి స్ఫూర్తి పొందడానికి విచక్షణకల పాఠకులకు ఈ పుస్తకం ఎంతైనా ఉపకరిస్తుంది. ఇది మొదటిభాగమే అయినందున తరువాత పుస్తకంలో మరింత ఉపయోగకరమైన సమాచారం లభ్యమవుతుందని ఆశించవచ్చు. ఈ ఆదర్శమైన కృషి ద్వారా సాహితీసేవ కొనసాగిస్తూ 'జయంతి' సంస్కృతిని పరిపుష్ఠం చేస్తూన్న సుబ్బరామయ్యకు అభినందనలు.

9-1-2015, **- సి. రాఘవాచారి**

విజయవాడ. పూర్వ సంపాదకులు - విశాలాంధ్ర దినపత్రిక

# విషయసూచిక

# మనవి మాటలు

"జనని సంస్కృతంబు సకల భాషలకును
దేశ భాష లందుఁ దెనుఁగు లెస్స
జగతిఁ దల్లికంటె సౌభాగ్య సంపద
మెచ్చు టాఁడుబిడ్డ మేలు గాదె"

అన్నాడు వినుకొండ వల్లభరాయుడు 1400 సంవత్సరంలో. ఆ తరువాత వందేళ్ళకు

"తెలుగదేల యన్న దేశంబు తెలుగేను
తెలుగు వల్లభుండ తెలుగొ కండ
యెల్ల నృపులు గొలువ నెరుగవే బాసాడి
దేశభాష లందు తెలుగు లెస్స"

అన్నాడు సాహితీ సమరాంగణ సార్వభౌమ శ్రీకృష్ణ దేవరాయలు.

"దేశమేదన్నచో తెలుగుదేశ మనుము
జాతి యేదన్నచో తెలుగు జాతి యనుము
వంశమేదన్నచో తెలగువాడననుము
తెలుగు కీర్తిని చాటుము తెలుగు బిడ్డ"

అన్నాడు నార్ల చిరంజీవి.

"పూలతో నిండి కమ్మదనాలు చిమ్ము
పుస్తక నికుంజ పుంజాళిపొంత బిలిచి,
'నా జనము, నాదు దేశ' మనంగ జాలు
ఇంత జ్ఞానభిక్ష దాన మిమ్ము తల్లి!"

అన్నాడు రాయప్రోలు సుబ్బారావు.

తెలుగు భాషా, తెలుగు జాతి జయహో!
"తల్లీ నిన్ను దలంచి పుస్తకము చేతన్ బూనితిన్"

తెలుగు భాషా సారస్వతాన్ని, తెలుగు వాఙ్మయాన్ని తెలుగు పాఠకులకు అందుబాటులోకి తెచ్చిన తెలుగు ప్రచురణ రంగం గురించి తెలుగుజాతికి తెలియజేయ వలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. తెలుగు పత్రికారంగాన్ని గురించి అనేకమంది లబ్ధప్రతిష్ఠులు అనేక గ్రంథాలు వెలువరించి తెలుగుజాతికి చాటి చెప్పారు. కాని తెలుగు ప్రచురణ రంగాన్ని గురించి తెలుగుజాతికి ఓ చిన్న సిద్ధాంత గ్రంథం, నాలుగైదు వ్యాసాలు తప్ప వెలువడలేదు. ప్రస్తుతం శ్రీ గ్రంథాలయ (వెలగా) వెంకటప్పయ్య గారు, శ్రీ పేరేప పూర్ణచంద్రజోషి (ప్రాచీ పబ్లికేషన్స్) గారు పూనుకుని తెలుగు ప్రచురణ రంగం గురించి తెలుగుజాతికి తెలియజెప్ప సంకల్పించారు. నేను సైతం వారి దారిలో అడుగులు వేస్తూ, నాకు తోచిన కృషి చేయ సంకల్పించాను. మా ముగ్గురి పరిశీలనలు వేరు వేరు దృక్పథం నుంచి ఎన్నుకున్నాం. ఇంకా పలువురు

తెలుగు ప్రచురణ రంగం గురించి పరిశీలన చేయవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. శ్రీ మహీధర రామమోహనరావు గారు, శ్రీ నిడమర్తి ఉమా రాజేశ్వరరావు గారు ఈ విషయమై ఎంతగానో పరితపించారు. వారి చిరకాలవాంఛ తీర్చవలసిన బాధ్యత తెలుగు పరిశోధకులపై ఉన్నదని నేను నమ్ముతున్నాను.

ఆనాడు శ్రీ సామినేని ముద్దుకృష్ణ "పుస్తకం అచ్చువేయడం మాటలు కాదు. ఎంతో జాగ్రత్త పడాలి. ప్రెస్‌లోనే కాపురం పెట్టాలి. ప్రతి 'గ్యాలీ' ఒక శిశువు. రచయిత 'మంత్రసాని' అని ఛలోక్తిగా అనేవారు.

శ్రీ తల్లావఝుల శివశంకరశాస్త్రి పుస్తక ప్రచురణ గురించి మాట్లాడుతూ - పుస్తకానికి అట్ట అందం. అది చూచి పుస్తకం కొనాలి - చదవాలి. కనుక అట్ట 'జవరాలి చెక్కిలిలా ఉండాలి' అన్నారు. ప్రక్కనున్న ఆయన "మీరు చెప్పింది బాగానే ఉంది గాని, ముద్దులతో తడిసి నలిగిపోతుందేమో!" అని సందేహం వ్యక్తం చేశారు. శాస్త్రిగారు 'నలిగితే ఆ గ్రంథంలోని నాణ్యత బయటపడుతుంది' అన్నారు.

'అచ్చు పాఠ్యపుస్తకాలు, గైడ్లు, టెలిఫోన్ డైరెక్టరీలు పుస్తకాలు కావు. చదివిన వ్యక్తి మనసుకు రెక్కలు తొడిగేది, అతడి ఏపైన ఎదుగుదలకు ఏతాముగా నీరు తోడేది, చీకటి వేళల మనసుకు బాసటగా నిలిచేది, త్రికాలాలను రెండట్టల మధ్యన ఒదిగించేది ఒక్క పుస్తకమే. ఆ ఆనందం, ఆ అనంతం, ఆ ఆకాశం, ఆ ఆహ్వానం - మీ చేతి చివర ఉండాలి సుమా!' అంటారు వాకాటి పాండురంగారావు గారు.

"మది కుదురజేసి చల్లని మాట జెప్పి
కలక నెడలించి ధైర్యంబు కలుగ జేసి
తల్లిదండ్రుల బోలి పెద్దలను బోలి
సదుపదేశంబు జేయు పుస్తకమె నీకు"

పుస్తకాలు బాలలకు చల్లని మాట చెప్పి మనసు కుదురుకొనేలా చేస్తాయి. భయాన్ని పోగొట్టి ధైర్యాన్ని కలుగజేస్తాయి. తల్లిదండ్రులలాగ, పెద్దలలాగా మంచి ఉపదేశాన్ని అందజేస్తాయి అంటారు వెంకట పార్వతీశ కవులు.

"పుస్తకంబులు గలిగిన పూరి గుడిసె
యందు నిరుపేద కాపునై యుందుగాని
పుస్తకంబులు లేనట్టి భూరి సౌధ
మందు చక్రవర్తిగ నుండ నభిలషింప"

పుస్తకాలు ఉన్న పూరిగుడిసెలో నిరుపేద కాపుగా ఉంటానుగాని, పుస్తకాలు లేని పెద్ద భవనంలో చక్రవర్తిగా ఉండటానికి ఇష్టపడను అంటారు మధురకవి శ్రీ నాళం కృష్ణారావు గారు.

నేడు పుస్తక ప్రచురణ రంగంలో అనేక మార్పులు చోటు చేసుకున్నాయి. పుస్తకాలను ప్రచురించే తెలుగు ప్రచురణ రంగం గురించి తెలుసుకుందాం!

**- ముప్పల సుబ్బరామయ్య**

# తెలుగు ప్రచురణ రంగం

పదిహేడవ శతాబ్దంలో తెలుగు లిపితో ముద్రణ ప్రారంభమైనట్లు చారిత్రక ఆధారాలున్నాయి. జాన్ ఫ్రేయర్ అనే విదేశీయాత్రికుడు తొమ్మిదేళ్ళపాటు తూర్పు దేశాలలో పర్యటించి 'న్యూ ఎకౌంట్ ఆఫ్ ఇండియా అండ్ పర్షియా' అనే గ్రంథాన్ని రాసి 1698లో ప్రచురించాడు. ఈ గ్రంథములో తెలుగు లిపితో వాక్యాలున్నాయి. ఈ గ్రంథప్రతి నేడు న్యూఢిల్లీలోని నేషనల్ ఆర్కైవ్‌లో పదిలంగా ఉంది.

మొట్టమొదట తెలుగు అక్షరాలను చెక్కతో చెక్కిన దిమ్మల సాయంతో బెంజిమన్ షుల్జ్ అనే మిషనరీ, క్రైస్తవమత ప్రచార గ్రంథాలను ముద్రించాడు. డెన్మార్కు రాజు భారతదేశానికి పద్దెనిమిదో శతాబ్దారంభంలో కొందరు మతాచార్యులను పంపాడు. వారిలో బెంజిమన్ షుల్జ్ ఒకరు. షుల్జ్ ఇరవైమూడు సంవత్సరాలపాటు దక్షిణ భారతదేశంలో మతప్రచారం చేస్తూ తెలుగు, తమిళ, హిందీ తదితర భాషలు నేర్చుకున్నాడు. బైబిల్‌ను తెలుగులో అనువదించాడు. అనారోగ్య కారణాల వల్ల 1743లో జర్మనీలోని హాలేనగరం చేరాడు. కఠోరదీక్షతో తెలుగులో మతగ్రంథాలు అచ్చువేయాలని సంకల్పించాడు. చెక్కదిమ్మలపై తెలుగు అక్షరాలను చెక్కించాడు. 1746-47 మధ్యకాలంలో హాలే నగరంలో నాలుగు తెలుగు పుస్తకాలను అచ్చు వేశాడు.

అ - మోక్షానికి కొంచుపొయ్యే దోవ (24 పుటలు)

ఆ - సత్యమైన వేదంలో ఉండే జ్ఞాన ఉపదేశాల యొక్క సంక్షేపం (24 పుటలు)

ఇ - వక గురువు అఇదు బ్రాహ్మల యొక్క నడుమన... పెద్దస్వామి మీద ప్రసంగించిన తర్రమితె (48 పుటలు)

ఈ - బుద్ధి కలిగిన.... నూరు జ్ఞాన వచనాల యొక్క చిన్న పుస్తకం ఇది (48 పుటలు)

ఈ పుస్తకాలు నాలుగు లండన్‌లోని బ్రిటీష్ గ్రంథాలయంలో ఉన్నాయి. మొదటి రెండు పుస్తకాలు కలకత్తా సమీపములోని శ్రీరామ్‌పూర్‌లో క్యారీ గ్రంథాలయంలో ఉన్నాయి నేటికీ.

బెంజిమిన్ షుల్జ్ జర్మనీ దేశీయుడని 1746 - 47 సంవత్సరాల మధ్యకాలంలో ఆయన తొలి తెలుగు గ్రంథాన్ని, తన సొంత పట్టణమైన హెల్‌లో ముద్రించారని ప్రముఖ కవి, సాహితీ చరిత్ర పరిశోధకుడు ఆరుద్ర అంటే; బెంజిమిన్ షుల్జ్, డెన్మార్కు

దేశస్థుడని 1706లో భారతదేశానికి వచ్చి 1741 వరకు ఇక్కడే ఉండి తెలుగుభాషను అధ్యయనం చేశాడని జూలియస్ రిచర్ రచించిన 'ది హిస్టరీ ఆఫ్ మిషన్స్ ఇన్ ఇండియా' అనే గ్రంథంలో ప్రస్తావన ఉంది.

అయితే మద్రాసులోని సెయింట్ జార్జి కోట గ్రంథాలయంలో 1719 సెప్టెంబరులో రూపొందిన పుస్తకాల వివరణ పట్టిక (కేటలాగు)లో 'బైబిల్ ఇన్ జెంటూ (తెలుగులో బైబిల్ - అప్పట్లో 'తెలుగు'ను పరదేశీయులు 'జెంటూ' అని పలికేవారు) అని రాసి ఉందని ఆరుద్ర 'స్టడీస్ ఇన్ ది హిస్టరీ ఆఫ్ తెలుగు జర్నలిజం' అనే గ్రంథంలోని తన వ్యాసంలో పేర్కొన్నారు.

అయితే 'జెంటూ' అంటే ఆ కాలంలో 'తెలుగు' అని అర్థం కాదని, టాంకోబర్ ప్రాంతంలో తమిళాన్ని జెంటూ అంటుండేవారని, 1719లో రెవరెండ్ జిగెన్‌బాగ్ తమిళంలో బైబిల్ అనువదించడం పూర్తి చేశారని 'బుక్ ప్రింటింగ్ ఇన్ ఇండియా' అనే గ్రంథంలో డాక్టర్ జోలెపాళెం మంగమ్మ వివరించారు. ప్రస్తుతం ఉన్న ఆధారాల ప్రకారం జూలియస్ రిచర్, డాక్టర్ మంగమ్మ అందిస్తున్న వివరాలే సరైనవని అనిపిస్తుంది.

విలియం క్యారీ 1793లో భారతదేశంలో మిషనరీ పనిమీద అడుగుపెట్టాడు. చార్లెస్ విల్కిన్స్, మార్షమన్, విలియం వార్డు, పంచానన్ కర్మార్కర్ మరియు కర్మార్కర్ అల్లుడు మనోహర్‌ల సాయంతో అన్ని భారతీయ భాషలలో, ఆసియా భాషలలో అచ్చులను తయారు చేయించడం, మరోవైపు పండితులను నియోగించి బైబిల్‌ను అనువదించడానికి ఏర్పాట్లు చేశాడు. ఆ రోజులలో శ్రీరామ్‌పూర్‌లో అచ్చులు పోతపోసి తయారు చేసేవారు, కూర్పరులు, ప్రూఫులు దిద్దేవారలతో కోలాహలంగా ఉండేదట! విలియం క్యారీ అనువదించిన బెంగాలీ బైబిల్ 1801లో అచ్చయింది. కదిలే అచ్చుల సాయంతో పుస్తకాలు ముద్రించడం భారతదేశంలో ఇదే ప్రథమం. విలియం క్యారీ తదేక దీక్షతో 1801-1832 మధ్యకాలంలో 42 భాషలలో బైబిల్ అనువాదం చేయించి, టైపులు పోతపోయించి, రెండు వందల కాపీల చొప్పున పదివేల కాపీలకు పైగా ప్రచురించాడు. క్యారీ భారత ముద్రణా పితామహుడు.

భారతదేశంలోని ప్రతి ముద్రాపకుడు, ప్రచురణకర్త విలియం క్యారీ చిత్రపటాన్ని, ఆంధ్రదేశంలోని ప్రతి ముద్రాపకుడు, ప్రచురణకర్త బెంజిమన్ షుల్జ్ చిత్రపటాన్ని తమ కార్యాలయాలలో అలంకరించడం ఆ మహామహులకు మనమిచ్చే నివాళి!

శ్రీరామ్‌పూర్‌లో ముందుగా తెలుగు బైబిల్ అచ్చయింది. ఆ తరువాత 1812లో తెలుగు సువార్తలు, 1814లో 'విలియం క్యారీ తెలుగు వ్యాకరణం', 1814లో 'ఈశ్వరుని అన్న మాటలు' అచ్చయినాయి.

1812లో చెన్నపట్నంలో ఫోర్టుసెంట్ జార్జి కళాశాల ప్రారంభమైంది. ఈస్టిండియా కంపెనీ తన కార్యక్రమాలను విస్తృతం చేసింది. మద్రాసులో మిషనరీలను ప్రోత్సహించింది. అచ్చుకూటాలు (ముద్రణాలయాలు) ప్రారంభమైనాయి. చెన్నపట్నంలో మిషనరీలు మతగ్రంథాలతోపాటు, భాషాభివృద్ధికి తోడ్పడే నిఘంటువులు, పదావళు లు, వ్యాకరణ గ్రంథాలు ప్రచురించారు. పద్దెనిమిదో శతాబ్ది రెండోపాదంలో తెలుగులో సాహిత్య గ్రంథాల ప్రచురణ ప్రారంభమైంది.

1816లో చెన్నపట్నంలో క్యాంబెల్ తెలుగు వ్యాకరణం, 1817లో విలియం బ్రౌన్ తెలుగు వ్యాకరణం, 1818లో విలియం బ్రౌన్ వొకాబులరీ, 1819లో రావిపాటి గురుమూర్తి శాస్త్రి గారి విక్రమార్క కథలు, 1821లో క్యాంబెల్ తెలుగు నిఘంటువు మొదలైనవి మొదటిసారి అచ్చయిన గ్రంథాలు.

చెన్నపట్నంలో ముద్రణాలయాలు నెలకొల్పి, సఫలమైనవని విశాఖపట్నంలోని లండన్ మిషనరీ సొసైటీవారు తెలుగు ముద్రణాలయం ప్రారంభించారు. రెవ. ఆగస్టన్ డేస్ గ్రాంజెసీ, రెవ. జార్జి క్రాన్ అనే ఇద్దరు మిషనరీలు తెలుగుభాష నేర్చుకుని మత్తయి, మార్కు, లూకా సువార్తలను ఆంగ్లం నుంచి తెలుగులోకి అనువదించి ముద్రించారు. దాంతో బళ్ళారిలో మిషనరీలు తెలుగు ముద్రణాలయాన్ని ప్రారంభించారు. బళ్ళారి ట్రస్టు సొసైటీ తరఫున క్రైస్తవబోధనకు సంబంధించిన గ్రంథాలను తెలుగులో ప్రచురించారు. 1835లో మొదటి తెలుగుపత్రిక 'సత్యదూత' ప్రచురించడం జరిగిందని అంటారు. తొలిదశలో మిషనరీలు మతగ్రంథాలను ప్రచురించి, రెండవదశలో నీతికథలు, నిఘంటువులు, వ్యాకరణాలను ప్రచురించారు. వాడుకభాషను రచనలలో ప్రవేశ పెట్టారు. మిషనరీలు మతానికి చేసిన సేవ ముద్రణ రూపంలోకి మారింది.

ఈస్టిండియా కంపెనీ విద్యావిధానంలో మార్పు తేవాలనుకుంది. 1820లో 'మద్రాసు స్కూలు బుక్ సొసైటీ'ని స్థాపించింది. ఈ సొసైటీలో అదాలత్ కోర్టులో దుబాసీగా ఉన్న వెన్నెలకంటి సుబ్బారావును సభ్యునిగా నియమించింది. సుబ్బారావు గారు 1820 నవంబరు 20వ తేదీన ఈస్టిండియా కంపెనీకి సుదీర్ఘమైన లేఖ రాస్తూ – ఇంగ్లీషు విద్యాబోధన, శాస్త్రీయ అంశాలను పాఠ్యగ్రంథాలలో చేర్చడం మొదలైన అనేక విషయాలను వివరించారు. ఆ లేఖను కంపెనీ ప్రభుత్వం పరిశీలించింది.

లేఖలో సూచించిన విధంగా విద్యావిధానంలో పెద్ద మార్పులను చేసింది. ఛందస్సు, వ్యాకరణం, నిరుక్తం, జ్యోతిష్యం, తర్కం మొదలైన ప్రాచ్యవిద్యల స్థానంలో ఇంగ్లీషు, సాంఘిక శాస్త్రం, విజ్ఞానశాస్త్రం, భూగోళవిజ్ఞానం, చరిత్ర, సాహిత్యం మొదలైన కొత్త అంశాలను ప్రవేశపెట్టారు. అందుకోసం ఆయా విషయాలపై గ్రంథాలు రచించడానికీ, వాటిని ముద్రించడానికి ఈస్టిండియా కంపెనీ ఎంతో దోహదం చేసింది.

పంతొమ్మిదవ శతాబ్దం చివరలో యద్దనపూడి సంజీవయ్య, బరూరు త్యాగరాయ చెట్టి, గుంటుపల్లి శేషాచార్యులు, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు మొదలైనవారు తెలుగు ముద్రాణాలయాలను స్థాపించి, ముద్రణను ప్రోత్సహించారు. అంతేకాకుండా జమీందారులు, శ్రీమంతులు పుస్తకాల రచనను, ప్రచురణను ఆదరించారు. తెలుగు ముద్రణ రంగం బళ్ళారి, విశాఖపట్నంలలో స్థిరపడి, తరువాత కాలంలో విజయవాడ, తెనాలి, కర్నూలు, రాజమండ్రి, హైదరాబాదులకు విస్తరించింది. ఆ రోజుల్లో అచ్చుకూటాలు, ముద్రణాలయాలు, ముద్రణశాలలు, ముద్రాక్షరశాలలు అని తెలుగు పేర్లతో పిలిచేవారు. ●



## వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్

వావిళ్ళ రామస్వామి శాస్త్రి గారు నెల్లూరు జిల్లా కోవూరు తాలూకాలోని వావిళ్ళ గ్రామంలో 1826లో జన్మించారు. తల్లి మంగమ్మ, తండ్రి వేంకటేశ్వర శాస్త్రి. శాస్త్రి గారికి నలుగురు కుమారులు, ఒక కుమార్తె. వారందరిలో చిన్నవారు రామస్వామి శాస్త్రి. పండితులైన తండ్రిగారి దగ్గరే విద్యాభ్యాసం సాగింది. సోదరుడు అనంత నారాయణ శాస్త్రితో కలిసి రామస్వామిశాస్త్రి నెల్లూరులో శ్రీ గట్టుపల్లి శేషయ్య శాస్త్రి, శ్రీ ఉడాలి శేషోపాధ్యాయులు గారల వద్ద వేదాధ్యయనం చేశారు. ద్రాక్షారామములో శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి గారి దగ్గర వ్యాకరణం నేర్చుకున్నారు.

చెన్నపట్నంలోని తంజావూరు రామానాయనిం వారి సంస్కృత వేద పాఠశాలలో కొంతకాలం ఉపాధ్యాయులుగా పనిచేశారు. తరువాత మైసూరు మహారాజా ముమ్మడి కృష్ణరాయల ఆశ్రయం సంపాదించి, కన్నడం నేర్చుకున్నారు. మిత్రుల ప్రోత్సాహంతో ముద్రణాలయం స్థాపించి కన్నడంలో రామాయణం, భారతాలను ముద్రించారు. ఆ ప్రయత్నంలో నిరుత్సాహం ఎదురైంది. కొంతకాలం మహారాజా గారి వేద సంస్కృత పాఠశాలలో అధ్యాపకులుగా పనిచేశారు.

శ్రీ శృంగేరీ పీఠాధిపతులు వావిళ్ళసోదరుల విద్యావిషయాలకు సంతోషించి, మూడువందల రూపాయలు సంభావన అందజేసి, చెన్నపట్నం వెళ్ళి సంస్కృత, తెలుగు గ్రంథముల సంపాదకత్వం, ప్రచురణ జరపమని ప్రోత్సహించారు. చెన్నపట్నంలో వావిళ్ళ సోదరులిద్దరూ మేనమామ శ్రీ వేదం వేంకటాచల శాస్త్రి గారితో కలసి 'వివేక రత్నాకర ముద్రణాలయం' ప్రారంభించి కొన్ని గ్రంథములు ప్రచురించారు. ఆశించినట్లు సాగకపోయేసరికి, నెల్లూరి వారు అయిన శ్రీ ఆసూరి సరస్వతీ తిరువేంగణాచార్యులతో కలసి 'సరస్వతీ నిలయ ముద్రాక్షరశాల' స్థాపించారు. ఈ ప్రయత్నం కూడా విఫలమైంది.

1854లో రామస్వామి శాస్త్రి గారు 'ఆదిసరస్వతీ ముద్రణాలయము' నెలకొల్పి స్వయంగా తాటాకు ప్రతులు సేకరించి, పండితుల చేత పరిష్కరింపజేసి, తీరిక సమయాలలో స్వయంగా పరిశోధించి ప్రెస్ కాపీ సిద్ధం చేసి, అచ్చుతప్పులు లేకుండా ముచ్చటగొలిపే ముద్రణతో మంచి కాగితముతో దాదాపు 140 పుస్తకాలను ప్రచురించి, తెలుగు పాఠకులకు జ్ఞానదానం చేసిన మహనీయులు. రామస్వామి శాస్త్రిగారు ఆముక్త మాల్యద గ్రంథానికి రాసిన 'రుచి' వ్యాఖ్యానం పండిత ప్రశంసలు పొందింది. ఈ విషయంలో కొంత వివాదం ఏర్పడినప్పటికీ, అప్పటికి ప్రచారంలో ఉన్న వ్రాతప్రతులను వ్యాఖ్యానాలను పరిశీలించి శాస్త్రిగారు తమ వ్యాఖ్యానాన్ని రూపొందించారని పండితులు భావించారు.

శ్రీ మతుకుమిల్లి నరసింహశాస్త్రి గారి 'చెన్నపురీ విలాసం' కావ్యంలోని ముద్రాక్షరశాలా ప్రకరణంలో 'ఆదిసరస్వతీ ముద్రణాలయము' ప్రసక్తి ఉంది. ముద్రణ కళకు ఒక ప్రత్యేకతను సంపాదించిన ముద్రణాలయం ఇది. అక్షరాలను మొదట పోత పోయించిన తెలుగువారు వీరే. ఆ కాలంలో పలువురు ప్రచురణకర్తలు అభిమానించిన తెలుగు గ్రేట్‌ప్రైమర్ (జి.పి.) రూపొందించడంలో రామస్వామి శాస్త్రి కృషి ఉన్నదని ప్రముఖ పరిశోధకులు శ్రీ నిడదవోలు వెంకటరావు గారు సేకరించిన సమాచారం. అచ్చుతప్పులు లేకుండా చూడడంలో శాస్త్రి గారు కనబరిచిన శ్రద్ధను ఇప్పటికీ ప్రశంసగా చెప్పుకుంటారు. రామాయణం, భారతం లను దేవనాగర లిపిలో ప్రచురించినపుడు, ఆ పుస్తకాలను పట్టపు ఏనుగు అంబారీపై ఉంచి, మంగళ వాద్యములతో పురప్రముఖులు, నగర ముఖ్యులు వీధులలో ఊరేగించి, వావిళ్ళ వారిని ఘనంగా సత్కరించారు. రామస్వామి శాస్త్రి గారు 1891 మే లో దివంగతులైనారు.

వావిళ్ళ రామస్వామి శాస్త్రిగారి కుమారులు వేంకటేశ్వర శాస్త్రి గారు 1884 ఏప్రియల్ 1 న జన్మించారు. తండ్రిని మించిన తనయులు వేంకటేశ్వర శాస్త్రి గారు.

కాలేజీలో ఎఫ్.ఏ. చదువుతూ చాలించి పుస్తక కంపెనీ వ్యవహారాలు చూసుకోవలసి వచ్చింది. వీరు 1906లో ప్రెస్ పేరును 'వావిళ్ళ'గా మార్చారు. వందకుపైగా వివిధ గ్రంథాలను మేటి పండితుల చేత పరిష్కరింప చేసి నిర్దుష్టంగా ముద్రణ చేసి సాహిత్యాభిమానులకు వాటిని చదివే అవకాశం కల్పించారు.

'వందేమాతరం' నినాదం దేశం నలుమూలలా మార్మోగిన కాలంలో 'వావిళ్ళ' వారు బంకించంద్ర ఛటర్జీ 'ఆనందమఠం' నవలను ఓ.వై. దొరసామయ్య గారి చేత తెలుగు చేయించి ప్రచురించారు. అలా జాతీయభావాల వ్యాప్తికి తమ వంతు కృషి చేశారు. శృంగార ప్రబంధాల అచ్చుకు అడ్డుగా ఉన్న ప్రభుత్వ నిబంధనలను తొలగించడానికి 1911 నుండి ఆంధ్ర సారస్వత పరిషత్తుతోపాటు వావిళ్ళ వారు పడ్డ శ్రమ 1947లో టంగుటూరి ప్రకాశం పంతులు గారు మంత్రి కాగానే ఫలించింది. వావిళ్ళ తెలుగు నిఘంటువు కర్తలు – శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి, బులుసు వెంకటేశ్వరులు గారలు. వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి గారు ప్రచురించిన నిఘంటువు ఇది. మూడు భాగాలలో ఉంది. సూర్యరాయాంధ్ర నిఘంటువులో చేరని అనేక పదాలు దీనిలో ఉన్నాయి. పూర్వకవి ప్రయోగాలను కూడా ఉదహరించారు.

వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి గారు నడిపిన తెలుగు పత్రిక 'త్రిలింగ' 1916లో మాసపత్రికగా ప్రారంభమైంది. అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరుడు దీనికి సంపాదకులు. కొంతకాలానికి నేలనూతల సుబ్బారాయుడు గారు సహాయ సంపాదకులైనారు. అప్పటినుండి వారపత్రిక అయింది. 22 ఏండ్లు వారపత్రికగా నడిచి 1941 ఆగస్టులో రజతోత్సవాన్ని జరుపుకున్నది. శాస్త్రి గారు 1927 జనవరిలో 'ఫెడరేటెడ్ ఇండియా' అనే ఆంగ్ల వారపత్రికను ప్రారంభించారు. దీనికి ఎడిటర్ శ్రీ కె. వ్యాసరావు. చివరకు ఇది మాసపత్రికగా మారింది. 'బాలవినోదిని' అనే తమిళ మాసపత్రికను సుబ్రహ్మణ్య భారతిగారి సహకారంతో ప్రచురించారు.

వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి గారికి సంతానం లేరు. బంధువుల పిల్లలను, అనాధ పిల్లలను చేరదీసి చదువులు చెప్పించారు కాని, ఎవరినీ పెంపకానికి తీసుకోలేదు. సాంఘిక, సాహిత్య, సేవా రంగాలలో దాదాపు అయిదు దశాబ్దాలు అవిరళ కృషి చేసిన శాస్త్రిగారికి 1942లో పక్షవాతం వచ్చి మంచాన పడ్డారు. షష్టిపూర్తి మహోత్సవం 1948 ఏప్రిల్ 3న చెన్నపట్నంలో కట్టమంచి రామలింగారెడ్డి గారి అధ్యక్షతన జరిగింది.

వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి గారి సేవలను గుర్తించి కాశీక్షేత్ర విద్వన్మండలి 'శాస్త్ర ప్రచార భూషణ' బిరుదు నిచ్చింది. ఆంధ్ర పండితలోకం కడపలో గొప్పసభ జరిపి

'భాషోద్ధారక' బిరుదు ప్రదానం చేసింది. 1955 డిసెంబరులో ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు 'కళాప్రపూర్ణ' బిరుదును ప్రదానం చేశారు. 1956 ఫిబ్రవరి 9న వెంకటేశ్వర శాస్త్రి గారు కన్ను మూసారు. అంతే 1914లో స్థాపించిన 'త్రిలింజ్ఞ' పత్రిక మూత పడింది. వావిళ్ళ ఆంధ్రనిఘంటువు అనాథ అయింది. మద్రాసు గవర్నమెంటు వావిళ్ళ కంపెనీ యాజమాన్యాన్ని తీసుకుంది.

వావిళ్ళ వారి గురించి 1977లో శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డి, 1982లో శ్రీ పునుగు వెంకటశాస్త్రి, 2009లో శ్రీ వజ్ఝల వెంకట సుబ్రహ్మణ్యశర్మ పుస్తకాలు రచించి, ప్రకటించారు.

నిడదవోలు వెంకటరావుగారు –

"బాలశిక్ష మొదలు భారతంబు వరకు
గ్రంథమేదియైన కావలసిన
వ్రాయుడింకనేల 'వావిళ్ళ' కనియెడు
పలుకు తెలుగునాట నిలచె నేడు" అన్నారు.

చిరునామా : వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్
292– ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

కాల ప్రభావం వల్ల కొన్ని సంవత్సరాలు 'వావిళ్ళ ప్రచురణలు' ఆగినప్పటికీ మరల ఇప్పుడు పునః ప్రారంభమైనాయి. శ్రీ అల్లాడి స్వామినాథం గారి దీక్షతో మళ్ళీ ఆనాటి మంచిపుస్తకాలు తిరిగి వెలుగు చూస్తున్నాయి.

ఆదిసరస్వతి నిలయ ముద్రణాలయము నుండి వెలువడిన గ్రంథములు – శ్రీమద్రామయణము, లీలావతి గణితము, అమరము, గురుబాలప్రబోధకం, గౌతమ స్మృతి, పరాశర మాధవీయము, ఉత్తరగీత, శంకర విజయము, అభిదాన రత్నమాల, సంస్కృత శ్రీ భాగవతమ్, సవ్యాఖ్యాన రఘువంశం, మేఘసందేశం, భట్టికావ్యము, శబ్దమంజరి, విష్ణు సహస్రనామ భాష్యము, బాల రామాయణము, ఉపదేశ సహస్రి, కాశీమాహాత్మ్యము, విష్ణుపురాణము – మూలం, గరుడ పురాణము, విశ్వకోశము – సటీక, హారావళి – సటీక, మేదినీకోశము – సటీక, నానార్థ రత్నమాల – సటీక.

మనుస్మృతి, పుష్పబాణ విలాసము, చెన్నపురీ విలాసము, కాశీఖండము, భారతము, మనుచరిత్రము – వ్యాఖ్యాన సహితం, శృంగారనైషధము, రాఘవ పాండవీయము, అప్పకవీయము, సుదక్షిణా పరిణయము, ఆముక్తమాల్యద – వ్యాఖ్యాన

సహితం, శిశుపాలవధము, సమీర కుమార విజయం, మనుచరిత్రము, శంకర విజయ విలాసము, యోగశాస్త్రము, వీరభద్ర విజయము, భోగినీ దండకము, ఉత్తర రామాయణము, భాస్కర రామాయణము, కళాపూర్ణోదయము, శ్రీకృష్ణ కర్ణామృతమూ, శ్రీరామకర్ణామృతము, హాలాస్య మాహాత్మ్యము, వృత్తరత్నాకరము, నకరాసుర వ్యాయోగము, కాలామృతము - బృహజ్జాతకము, అధ్యాత్మ రామాయణము, ముహూర్త దర్పణము, నక్షత్ర చూడామణి, పంచాంగ ప్రకటనము, సౌందర్యలహరి, శివానందలహరి.

వైద్యశతశ్లోకి, గోపికా గీతములు, చంద్రాలోకము (సంస్కృత - ఆంధ్ర టీకా సహితం), వృద్ధపరాశరము, వ్రతచూడామణి, కార్తీక మాహాత్మ్యము, మాఘపురాణము, ధర్మసింధువు, రంగరాయ చరిత్రము, శివరహస్యఖండము, యాజుషపూర్వ ప్రయోగ చంద్రిక, ఋగ్వేద ప్రయోగాదర్శనము, అమరుక కావ్యము, అష్టోత్తర శతోపనిషత్తులు (మూలం), దశోపనిషత్తులు (ఆంధ్ర టీకాసహితం), ద్వాదశోపనిషత్తులు (వచనం), బ్రహ్మోత్తరఖండము, శ్రీ విష్ణుపురాణము (సవ్యాఖ్యానము), వివేక చూడామణి, పెద్దబాల శిక్ష, దశకుమార చరిత్రమ్ (సంస్కృతం-తెలుగు), హరవిలాసము, కావ్యాలంకార సంగ్రహము, శ్రీరామోదన్తమ్, ధనుర్మాస మాహాత్మ్యము, గయా మాహాత్మ్యము, శ్రీమద్దేవీ భాగవతము (సవ్యాఖ్యానం), ఆంధ్ర శబ్ద మంజరి, ఆంధ్ర చంద్రాలోకము, రత్నపరీక్ష, రామాభ్యుదయము, సీతారామాంజనేయ సంవాదము (సటీక).

వేమన పద్యములు, నలచరిత్రము (ద్విపద), మూకపంచశతి, వేదాంత పంచదశీ ప్రకరణము (సవ్యాఖ్యానాంధ్ర టీక), ఛప్పన్న శాస్త్రము, లగ్నసర్వస్వము, అష్టాంగ హృదయము, బసవరాజీయము, చరకసంహిత, గదనిగ్రహము, నాడీజ్ఞానము, సుశ్రుత సంహిత, భారత రసప్రకరణము (సాంధ్ర తాత్పర్యము), అష్టకవర్గు,. వైశ్య పురాణము, కవిజీవితములు, హరివంశము, నృసింహపురాణము, మార్కండేయ పురాణము, లంకా విజయము, హరిశ్చంద్రోపాఖ్యానము, భాగవత చంపువు, భారత చంపువు, సులక్షణసారము, ఆంధ్రనామ సంగ్రహము, ఆంధ్రనామ శేషము, సాంబ నిఘంటువు, త్రిలింగ లక్షణ శేషము, తిరుక్కురళ్, తొల్కాప్పియము, చెన్నబసవ పురాణము, పురుషసూక్తము, శ్రీసూక్తము, యజుర్వేద సంధ్యావందనము, ఋగ్వేద సంధ్యావందనము, ఆశ్వలాయన ప్రవరకాండము, ఆపస్తంబ ప్రవరకాండము, యాజ్ఞవల్క్య స్మృతి (మూడు కాండములు), లిఖితస్మృతి (తెలుగర్థసహితం), హారీత ధర్మశాస్త్రము, బుధ ధర్మశాస్త్రము, వర్ణాశ్రమ ధర్మకాండము, శ్రీమద్వాల్మీకి రామాయణము (పరమార్థ చంద్రిక వ్యాఖ్య సహితం), కల్యబ్ధియాన మీమాంసా,

గోపీనాథ రామాయణము మొదలైన గ్రంథాలను రామస్వామిశాస్త్రి గారు ఆదిసరస్వతీ నిలయ ముద్రణాలయము నుండి వెలువరించి తెలుగుజాతికి అందించిన ధన్యులు.

వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి గారు సంస్థ పేరును 'వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్' గా మార్చి ఆంధ్ర వచనభాగవతము (ఒక సంపుటం), ఆంధ్ర వచన భాగవతము (మూడు సంపుటములు), ఆంధ్ర వచన భారతము (ఏడు సంపుటములు), ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము, అరేబియన్ నైట్సు కథలు, తిలక్‌గారి ఉపన్యాస ములు, భారత రమణీమణులు (మూడు భాగములు), యజుర్వేద కథా సంగ్రహము, నీతి చంద్రిక, పంచతంత్రము, నీతిరత్నాకరము, సంగ్రహ రామాయణము, భోజుని కథలు, భోజ కాళిదాసు కథలు (రెండు భాగాలు), తెనాలి రామలింగని కథలు (రెండు భాగాలు), సంస్కృత నాటక కథలు (రెండు భాగములు), విక్రమార్కుని కథలు, చార్‌దర్వీషు కథలు, తాతాచార్యుల కథలు, భేతాళుని కథలు, పరమానంద శిష్యుల కథలు, వైద్యుల కథలు, వీరాంగనలు, నలుగురు మంత్రుల కథలు, అయిదుగురు దొంగల కథలు, సత్యసేన విజయము, ఋషుల చరిత్ర, పురాణ గాథలు (రెండు భాగాలు), బాజీరాయని చరిత్ర, రఘువంశ కథ, విక్రమార్క చరిత్ర, ఈసఫ్ నీతి కథలు (రెండు భాగాలు), పంజాబు అల్లరి, మర్యాదరామన్న కథలు, మైరావణ చరిత్ర, బ్రహ్మ సూత్రములు, జీవన్ముక్తి ప్రకాశిక, నైష్కర్మ్యసిద్ధి, జ్ఞానవాశిష్టము, పంచదశ ప్రకరణము, ధర్మశాస్త్రములు, వేదాంత గ్రంథములు, స్తోత్రములు, ఉపనిషత్తులు మొదలైనవి అనేకం ప్రచురించారు.

పరిశోధన పరమేశ్వర విద్యారత్న శ్రీ నిడదవోలు వెంకటరావుగారన్నట్లు – "వావిళ్ళ శబ్దం ఓంకారమే". ●



## శారదాంబా విలాస ముద్రాక్షరశాల

**చ**దలవాడ సుందరరామశాస్త్రి 1865లో నెల్లూరు జిల్లా వెంకనపాళెం శ్రోత్రియంలో జన్మించారు. తల్లి సీతమ్మ, తండ్రి రామశాస్త్రి. సుందరరామశాస్త్రి మహా పండితులు, మంత్ర శాస్త్రవేత్తలు, వావిళ్ల రామస్వామి శాస్త్రి గారి కుమార్తె మంగమ్మను వివాహమాడారు. వివాహానంతరం సుందరరామశాస్త్రి వెంకనపాళెం శ్రోత్రియంలో

పొలాలను పాటూరు సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి స్వాధీనం చేసి, చెన్నపట్నంలో స్థిరపడ్డారు. కొంతకాలానికి తన వాటా ఆస్థిని పాటూరి వారికే అమ్మివేశారు.

సుందరరామశాస్త్రి గారు వావిళ్ల రామస్వామిశాస్త్రి గారి అల్లుడై వారి ముద్రణ సంస్థలోను, ప్రచురణ కార్యక్రమంలో శ్రద్ధ వహించారు. 'ఆదిసరస్వతీ నిలయం' శాఖోపశాఖలతో విస్తరిల్లడానికి మామగారికి అన్నివిధాల తోడ్పడ్డారు. 1884లో వావిళ్ల వారసుడు వెంకటేశ్వర శాస్త్రి జన్మించారు. భార్యా వియోగంచే పరితపించే రామశాస్త్రి గారికి కుటుంబ నిర్వహణ బాధ్యతలలో కూడా తోడ్పడి పుత్రతుల్యులుగా ప్రవర్తించారు.

వెంకటగిరి సంస్థాన రాజు శ్రీ సర్వజ్ఞ కుమార యాచేంద్రుల వారు సుందర రామశాస్త్రి గారిని తమ సంస్థానంలో ఆస్థాన పండిత పదవి నిచ్చారు. సుందరరామశాస్త్రి గారిచే 1889లో 'శారదాంబా విలాసముద్రాక్షరశాల'ను స్థాపింప చేసి, సాయం చేశారు. మొట్టమొదట రాజా వారు రచించిన గ్రంథము 'మనఃసాక్ష్యము' ముద్రించబడినది. రాజావారు రచించిన గ్రంథాలు, రాజావారు అంకితం పొందిన గ్రంథాలు, సుందర రామశాస్త్రి గారి రచనలు ఈ ముద్రాక్షరశాలలోనే ముద్రించబడినాయి.

కుమార యాచేంద్రులు రచించిన గీతార్థసార సంగ్రహము, నాస్తిక ధ్వాంత భాస్కరము, నిర్గుణవాద నిరాకరణము, రత్నషట్కాంగులీయకము, సందిగ్ధ తత్వ రాద్ధాంతము, సభారంజని, సర్వమతసార సంగ్రహము, సహేతుక నీతిశాస్త్రము, హిందూ మత విరోధభంజని మొదలగునవి శారదాంబా విలాస ముద్రాక్షరశాలలో ముద్రించ బడినవి. అంతేకాకుండా గోపీనాథము వేంకటకవి రచించిన 'కృష్ణజన్మఖండము', చదలవాడ వారి 'మనుధర్మశాస్త్రము' మరికొన్ని రచనలు కూడా వెలువడినవి.

వావిళ్ల రామస్వామి శాస్త్రులు, చదలవాడ వారిచే శ్రీమద్రామాయణము (తెలుగులో టీకా తాత్పర్యాలతో) 'పరమార్థ చంద్రిక' అనే పేరుతో వ్యాఖ్యానం వ్రాయించడానికి సంకల్పించారు. అది చాలా ఖర్చుతో కూడుకున్న పని అయినందున, మాసపత్రికల మూలంగా చందా నెలకు రూపాయి వసూలు చేయడానికి నిర్ణయించుకుని, ఎనిమిది వందల యాభైమంది చందాదారులతో శ్రీమద్రామాయణము ప్రచురణ కార్యం ప్రారంభించారు. ఈ బృహత్కార్యానికి ప్రధాన పోషకులు విజయనగరం మహారాజా శ్రీ ఆనందగజపతివారు. వారు తమ తొలి చందా అయిదు వందల రూపాయలు ఇచ్చి రచనను ప్రోత్సహించారు. 1891లో రామస్వామి శాస్త్రి గారు మరణించే నాటికి బాలకాండలో రెండు సంపుటాలు, అయోధ్యాకాండలో మూడు సంపుటాలు మాత్రమే వెలువడినాయి. వావిళ్ల వారు ముందుచూపుతో తమ వీలునామాలో రామాయణం

ప్రచురణ విషయంలో కట్టుదిట్టమైన ఏర్పాటుచేసి, రచయిత అయిన తమ అల్లునికి నెలకు ఇరవై రూపాయలు వ్యాఖ్య రచన కియ్యవలసినదిగా వీలునామాలో నిర్దేశించారు. ఈ విధంగా వావిళ్ల, చదలవాడల వారి సమిష్టి కృషి ఫలితంగా 'పరమార్థ చంద్రిక' పదిహేను సంపుటాలలో ప్రకటితమైంది. ఆ ప్రతులు ఇప్పుడు లభించడం లేదు.

చదలవాడ సుందరరామశాస్త్రి గారు భగవద్గీతా భాష్యాలన్నీ పరిశోధించి 'ఆనంద చంద్రిక' అనే వ్యాఖ్యతో ఆరు సంపుటాలు ప్రకటించారు. సంస్కృతంలో స్రగ్ధరా వృత్తాలలో 'ఆదిత్యస్తవం' అనే పేరుతో సూర్యస్తుతి పరంగా ఒక శతకం రచించారు. అధ్యాత్మ రామాయణయము, రుద్రకోటి మాహాత్మ్యము, సస్వర రుద్రాధ్యాయం, మనుధర్మశాస్త్రము, కావ్యదూషణ నిరాకరణము, శ్రీమదాంధ్ర మహాభారతము, కృష్ణ రాయబారము, ఆశ్చర్య చూడామణి, మోక్షమార్గత్రయము, వాసిష్ఠ రామాయణము, ఆదిత్యస్తవము, అంబాగీతమ్, అంబికా చంపకము, జగన్నాథ శతకము, వేదాంత డిండిమము, అపరోక్షానుభూతి, అభిదాన రత్నమాల, ఆదిత్య హృదయము, దక్షిణామూర్తి స్తోత్రము, శ్రీరామహృదయము, బాలరామాయణము, శ్రీమద్రామాయణ సారసంగ్రహము, భర్తృహరి ప్రబోధము మొదలగునవి రచించారు.

చదలవాడ సుందరరామశాస్త్రి 1925లో మరణించారు. ●



## కందుకూరి వీరేశలింగం రచనలు – ప్రచురణలు
### (హితకారిణి సమాజం)

కందుకూరి వీరేశలింగం పంతులుగారు 1848 ఏప్రియల్ 16న తూర్పు గోదావరి జిల్లా రాజమహేంద్రవరము (రాజమండ్రి)లో జన్మించారు. తల్లి పున్నమాంబ, తండ్రి సుబ్బారాయుడు. సాహిత్యాన్ని సంఘసంస్కరణ సాధనగా గ్రహించిన నవయుగ వైతాళికులు. దేశకాల పరిస్థితులు గమనించి, ప్రభోదాత్మకముగా సులభమైన శైలిలో, అందరకూ అర్థమయ్యే విధంగా రచనలు చేశారు. చింతామణి ముద్రాక్షరశాల నెలకొల్పినట్లు తెలుస్తుంది గాని, పుస్తకాలు ఏ పేరుతో ప్రచురించినదీ తెలియకున్నది.

పంతులుగారు సంస్కృతాంధ్రాలలో విద్వత్కవులై, నాటకకర్తలై, వచన రచనా ధురీణులై, స్త్రీ జనోద్ధరణ పరాయణులై, సంఘసంస్కర్తలై, పత్రికా నిర్వహకులై ఆంధ్ర

ప్రజానీకానికి అపారమైన సేవ చేశారు. అయిదో తరగతి వాచకం మొదలు ఆంధ్రకవుల చరిత్ర వరకు, నవలలు, నాటకాలు, వ్యాసాలు, ప్రహసనాలు, గ్రంథ విమర్శలు, చారిత్రక కృతులు సుమారు నూట ముప్పై వరకు రచించారు. ప్రాచీనకవుల కావ్యాలను సంపాదించి, పరిష్కరించి, పీఠికలతో ముద్రించారు. వివేకవర్ధని పత్రిక స్థాపించి, వితంతు వివాహాలు, స్త్రీ విద్యావశ్యకత వంటి విషయాలు ప్రచారం చేశారు. సంఘంలోని దురాచారాలను శృతి స్మృతి పురాణ ప్రమాణ పురస్సరంగా ఖండించి, ఉపన్యాసాలు ఇచ్చి ఆంధ్రదేశంలో మహోద్యమాన్ని నడిపారు. సామాన్య ప్రజానీకంలోని అజ్ఞానాన్ని తొలగించడానికి తమ భావాలను వారిలో ప్రచారం చేయడానికి ప్రహసన ప్రక్రియను సాధనంగా గ్రహించారు. స్త్రీలకు విద్యాసౌకర్యాలు కలిగించడం కోసం హితకారిణి సమాజం, కన్యాపాఠశాల నెలకొల్పారు. స్త్రీల కోసం ప్రత్యేకంగా 'సతీ హితబోధిని' పత్రిక నడిపి ఆరోగ్యశాస్త్ర, మత, నీతి విషయాలను ప్రచారం చేశారు. సమాజ అవసరాలను గుర్తించి రచనలు చేశారు, ప్రచురించారు.

హాస్యసంజీవని – మూడు భాగాలు, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము, బ్రహ్మ వివాహము, వ్యవహార ధర్మబోధిని, రాజశేఖర చరిత్రము, సత్యరాజా పూర్వ దేశయాత్రలు, అభిజ్ఞాన శాకుంతలము, నీతి కథామంజరి అను ఈసపు కథలు, నీతిదీపిక, సత్యాద్రౌపదీ సంవాదము, గోపాలస్వామి శతకము, మార్కండేయస్వామి శతకము, సరస్వతీ నారద సంవాదము, జాన్ గిల్పిన్, ఆంధ్రకవుల చరిత్ర – మూడు భాగాలు, సత్యవతీ చరిత్రము, చంద్రమతీ చరిత్రము, రత్నావళి, ప్రబోధ చంద్రోదయము, మాళవికాగ్ని మిత్రము, దక్షిణ గోగ్రహణము, ప్రహ్లాద, తిర్యగ్విద్వన్మహా సభ, మాలతీ మధుకరము, వైదర్భీ విలాసము, మహారణ్య పురాధిపత్యము, రసికజన మనోరంజనము, వేశ్యాప్రియ ప్రహసనము, సతీమణి విజయము, వీనస్ వర్తక చరిత్రము, విక్టోరియా మహారాణి చరిత్రము, చమత్కార రత్నావళి, మాతృపూజ, శుద్ధాంధ్ర భారత సంగ్రహము, అభాగ్యోపాఖ్యానము, శుద్ధాంధ్ర ఉత్తర రామాయణము, కలిపురుష శనైశ్చర విలాసము, వేణుగోపాల శతకము, చంద్రహాస చరిత్రము, చిత్రకేతు చరిత్ర, బలత్కార గాన వినోద ప్రహసనము మొదలగునవి రచించి, ప్రచురించారు.

శబ్దరత్నాకర నిఘంటువును రచించిన బహుజనపల్లి సీతారామాచార్యులు గారు అవతారికలో కొన్ని ప్రాచీన గ్రంథముల పేర్లు ఉదహరించి, వాటిపేర్లు వినడమేగాని, ఎక్కడా కనిపించడం లేదని వ్రాశారు. వీరేశలింగం గారు ఆ పట్టికలోని గ్రంథములను పదికి పైగా సంపాదించి, సంస్కరించి ముద్రించారు. అవి –కనపర్తి అబ్బయామాత్యుని

రామమనోరంజనమనే పురూరవశ్చరిత్రము, మొల్ల రచించిన రామాయణము, పింగళి సూరనార్యుని ప్రభావతీ ప్రద్యుమ్నము, కాకుమాని మూర్తి కవి రచించిన పాంచాలీ పరిణయము, అయ్యలరాజు రామభద్రకవి రచించిన రామాభ్యుదయము, కేతనార్యుని విజ్ఞానేశ్వరము, నాచనసోముని ఉత్తర హరివంశము, చరిగొండ ధర్మనార్యుని చిత్రభారతము, నారాయణకవి రచించిన పంచతంత్రము, మాదయ్యగారి మల్లన రచించిన రాజశేఖర చరిత్రము, కేతనకవి రచన ఆంధ్రభాషా భూషణము, అడిదము సూరకవి కవి సంశయ విచ్ఛేదాది గ్రంథములు, సింహాద్రి వెంకటాచార్యుని చమత్కార మంజరి, కోట వేంకనార్యుని ఆంధ్రభాషారవము, నంది మల్లయ – ఘంట సింగయ్యల ప్రబోధ చంద్రోదయము మరియు వరాహపురాణము, కేతన దశకుమార చరిత్రము, తెనాలి అన్నయార్యుని సుదక్షిణా పరిణయము, అనంతామాత్యుని భోజరాజీయము మొదలగునవి ప్రచురించారు.

శంకరకవి రచించిన హరిశ్చంద్రోపాఖ్యానము, పిల్లలమర్రి పినవీరభద్రుని జైమినీ భారతము పూర్వమే ముద్రితమైనవి గాని, వాటిలో తప్పులు ఎక్కువగా ఉన్నందువలన సంస్కరించి మరల ముద్రించారు పంతులుగారు.

వీరేశలింగం పంతులుగారు 1919 మే 27న మద్రాసులో మునగాల రాజా వారి ఆంతరంగిక కార్యదర్శి కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గారి వేదనివాస్‌లో మరణించారు. లక్ష్మణరావు గారు జమీ పనిమీద మునగాల వెళ్ళారు అప్పుడు.

తెలుగుజాతి అభ్యుదయానికి తమ జీవితాన్ని ధారపోసిన కందుకూరి వారిని గురించి ప్రత్యేక సంచికలు, గ్రంథాలు వెలువడ్డాయి. అక్కిరాజు రమాపతిరావు గారు వీరిపై సమగ్ర పరిశీలన చేసి డాక్టరేట్ పొందారు. కందుకూరి స్మారకోత్సవ సంఘము (హైదరాబాదు) వారి 'యుగపురుషుడు వీరేశలింగం' అనే సంచిక, ఆంధ్ర రాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘము వారు 'వీరేశలింగ వర్థంతి సంచిక', హితకారిణి సమాజం వారు 'వీరేశలింగ స్మృతి'. అడివి శంకరరావుగారి సంపాదకత్వంలో వెలువడిన 'వీరేశలింగ శతవార్షిక జయంతి సంచిక' పంతులుగారిని గురించిన సమాచారంతో ఉన్నాయి. ●



## విజ్ఞానచంద్రికా గ్రంథ మండలి

కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గారు గ్రంథాలయాలు స్థాపించడమే కాదు, వచన వాఙ్మయం కూడా ప్రచురించాలని తలచి 1906 ఏప్రియల్ 5న హైదరాబాదులో 'విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి' ని స్థాపించారు. దానిలో పాలుపంచుకుంటూ రాజా నాయని వేంకట రంగారావు గారు రెండువేల రూపాయలు విరాళమిచ్చారు. రావిచెట్టు రంగారావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, అయ్యదేవర కాళేశ్వరరావులు కలిసి ప్రచురణాలయ స్థాపనలో సహాయకులుగా ఉన్నారు. ఆదిరాజు వీరభద్రరావు వ్యవహర్త.

సంవత్సరానికి కనీసం నాలుగు పుస్తకాలు ప్రచురించాలని, వంద పేజీలలోపు ఉండాలని, చందాదారులకు ఒక్కో పుస్తకం పావలాకు, ఇతరులకు ఆరణాలకు అందించాలని మండలి స్థాపకులు నిర్ణయించారు. ఏ పుస్తకమూ మూడు వందల పేజీలు మించకూడదు. మొట్టమొదట గాడిచర్ల వారి రచన 'అబ్రహాంలింకను జీవితచరిత్ర'ను ప్రచురించాలని సంకల్పించారు. సంపాదకులు ప్రతిఫలం స్వీకరించ కూడదనీ, ఒక్క గాడిచర్ల వారికి మాత్రం ఆర్థిక సహాయము చేయాలని, గ్రంథ రచయితలతో చర్చించి కొమర్రాజు వారే భాషా సంస్కరణ చేయాలనీ, భాష సరళ గ్రాంథికములో ఉండాలనీ తీర్మానించారు.

గ్రంథవిక్రయము, హైదరాబాదు నుంచి పోస్టులోపంపడం రావిచెట్టు రంగారావు గారి పని. 1907లో స్వదేశీఉద్యమం తీవ్రరూపం తాల్చినప్పుడు గ్రంథమండలి కార్యస్థానాన్ని మద్రాసుకు మార్చారు. మద్రాసులో చింతాద్రిపేటలోని ఆచంట లక్ష్మీపతిగారి ఇంటిలో కార్యాలయం ఉండేది. ఏడువేలమంది చందాదారులను చేర్చారు. ఒకటి రెండు సందర్భాలలో రచయితల ఆక్షేపణలకు కోపగించి కొందరు సంపన్నులు చందాదారులుగా ఉండటానికి నిరాకరించినా, ధైర్యంగా కార్యక్రమాలను నిర్వహించారు. 1907లో గాడిచర్ల వారు జైలులో ఉన్నప్పుడు, ఆయన స్థానంలో ఆచంట లక్ష్మీపతి బాధ్యత వహించారు. కొంతకాలానికి రాయప్రోలు సుబ్బారావు, ఆదిరాజు వీరభద్రరావులు వచ్చి చేరారు.

1906 నుండి 1923 వరకు కొమర్రాజు వారు ప్రధాన సంపాదకులుగా దేశ చరిత్రలు, జీవిత చరిత్రలు, స్వీయ చరిత్రలు, నవలలు, శాస్త్ర రచనలు వెలువడ్డాయి. 1916-1923 మధ్య కాలంలో కొమర్రాజు వారి దృష్టి విజ్ఞాన సర్వస్వం నిర్మాణంలో నిమగ్నమవడం వలన, మొదటి ప్రపంచ యుద్ధం తరువాత పరిస్థితులకు ప్రచురణ కార్యక్రమము సన్నగిల్లింది.

1923లో కొమర్రాజు వారు మరణించడంతో, 1924లో కార్యాలయం బెజవాడ (విజయవాడ)కు మారింది. 1924 నుండి 1936 వరకు అయ్యదేవర కాళేశ్వరరావు గారు సంపాదకత్వం వహించారు. దిగవల్లి వేంకట శివరావు, వాసిరెడ్డి దుర్గాసదా శివేశ్వర ప్రసాద్‌లు కార్యనిర్వాహకులుగా పూర్వదేశచరిత్రలు, ప్రపంచ స్వాతంత్ర్యోద్యమాల చరిత్రలు వెలుగులోకి వచ్చాయి.

విజ్ఞానచంద్రికా గ్రంథమండలి అధ్యక్షులుగా ఆచంట లక్ష్మీపతి, కార్యదర్శిగా అయ్యంకి వెంకట రమణయ్య, సభ్యులలో ఒకరుగా గుండము రామచంద్రరావు వ్యవహరించారు.

గాడిచర్ల హరి సర్వోత్తమరావు గారి రచనలు – అబ్రహాంలింకను జీవితచరిత్ర, ఢిల్లీ దర్బారు; కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గారి రచనలు – హిందూ మహా యుగము, మహమ్మదీయ మహాయుగము, మహాపురుషుల జీవిత చరిత్రలు, లక్ష్మణ రాయ వ్యాసావళి; చిలుకూరి వీరభద్రరావు గారి రచన – ఆంధ్రదేశ చరిత్ర (మూడు భాగాలు); కందుకూరి వీరేశలింగం పంతులు గారి రచన – స్వీయచరిత్ర (రెండు భాగాలు); ఆచంట లక్ష్మీపతిగారి రచనలు – జీవశాస్త్రము, కలరా, చలిజ్వరము; అయ్యదేవర కాళేశ్వరరావు గారి రచనలు – అమెరికా సంయుక్త రాష్ట్రములు, ఫ్రెంచి స్వాతంత్ర్య విజయము, తురుష్క స్వాతంత్ర్య విజయము, రాష్ట్రీయ స్వపరిపాలనము, చైనా యువజనోద్యమము; దిగవల్లి వెంకట శివరావు గారి రచనలు – దక్షిణ ఆఫ్రికా చరిత్ర, అధినివేశ స్వరాజ్యములు, ఆంగ్ల రాజ్యాంగము – భారతదేశ స్థితిగతులు, మానికొండ సత్యనారాయణ శాస్త్రి గారి రచనలు – వైదిక నిలయము, ఆంగ్ల రాజ్య స్థాపనము (రెండు భాగాలు); వేలూరి సత్యనారాయణ గారి రచనలు – ఫాహియాన్ భారత వర్ష యాత్ర, బౌద్ధ మహాయుగము; వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద్ గారి రచన – భారతదేశమున రైళ్లు; ఆత్మకూరి గోవిందాచార్యులు గారి రచన – భారతదేశ ఆర్థిక చరిత్ర (రెండు భాగాలు); ఆదిరాజు వీరభద్రరావు గారి రచన – రావిచెట్టు రంగారావు జీవిత చరిత్ర; మంత్రిప్రెగడ సాంబశివరావు గారి రచన – పదార్థ విజ్ఞాన శాస్త్రము; గోటేటి జోగిరాజు గారి రచన – వ్యవసాయ శాస్త్రము (రెండు భాగాలు); వేమూరి విశ్వనాథశర్మ గారి రచన – రసాయన శాస్త్రము; క. సీతారామయ్య గారి రచన – వృక్షశాస్త్రము; కట్టమంచి రామలింగారెడ్డి గారి రచన – అర్థశాస్త్రము (రెండు భాగాలు); వేలాల సుబ్బారావు గారి రచన – రాణీ సంయుక్త; దుగ్గిరాల రాఘవ చంద్రయ్య చౌదరి గారి రచన – విజయనగర సామ్రాజ్యము; కేతవరపు వేంకట శాస్త్రి గారి రచనలు – రాయచూరు యుద్ధము, అగ్రహారము మొదలగునవి ప్రచురించారు.

అంతేకాక చంద్రగుప్త చరిత్ర, జంతుశాస్త్రము, శారీరక శాస్త్రము, భౌతిక శాస్త్రము పాఠములు (రెండు భాగాలు) మొదలగునవి కూడా ప్రచురించడం జరిగింది.

## విజ్ఞాన చంద్రికా బుక్ డిపో

మౌంట్ రోడ్ - మద్రాసు

**కేటలాగు**

**నవలలు :** ఆనందమఠం, ఐవన్హో, మదాలస, సుజనరంజని, దుర్గేశనందిని, తారాబాయి, వసుమతీ వసంతము, లలిత చంద్రహాసము, హోరావళి, అహల్యాబాయి, పరిమళ, రామచంద్ర విజయము, కర్పూరమంజరి, కాదంబరి, దుర్జన భర్జనము, సువర్ణమాల, చంద్రశేఖరము, మాధవీకంకణము, శుక్తిమతి, ఆనందసాధు, రాబిన్సం క్రూసో, వసంతసేన, ప్రఫుల్ల, చంద్రరేఖ, మరకతవల్లి, ప్రభావతి, మనోహరి, సీతారామము, టిప్పుసుల్తాను, ఉషఃకాలము, విమలాదేవి, రాయచూరు యుద్ధము, రాణీ సంయుక్త.

**నాటకములు :** ధనాభిరామము, త్రై విక్రమ నాటకము, నాగానందము, మందపాల, ప్రియదర్శిని, సత్యహరిశ్చంద్రీయము, ప్రసన్న యాదవము, గయోపాఖ్యానము, పారిజాతాపహరణము, ఉష, శకుంతల, ప్రతాపరుద్రీయము, రామమోహన నాటకము, కోకిల, సతీసంయుక్త, శమంతకమణి, ప్రహ్లాద, గులేబకావళి, బుద్ధబోధసుధ, వృద్ధవివాహము, విప్రనారాయణ, వనవాసరాఘవము, విజయరాఘవము, రాధాకృష్ణ, నర్మదా పురుకుత్సీయము, ప్రచండ చాణక్యము, పాదుకాపట్టాభిషేకము, సారంగధర, మనోమహిమము, హేమలత, కర్పూర తిలక, ప్రియదర్శిక, నాటకత్రయము, శ్రీయాదమారేంద్ర విజయము, వణిక్పుర వర్తకోదంతము, సంగీత ద్రౌపదీ వస్త్రాపహరణము, సంగీత తరంగిణి, పుష్పలీలావతి, శమంతకమణి, స్వప్నవాసవదత్త, సావిత్రీ సత్యవంతము, చంద్రమతీ పరిణయము, సత్యహరిశ్చంద్రీయము, కన్యకాపరమేశ్వరీ విలాసము, రంగరాయ కదన సమవాకారం.

**కథలు :** హితోపదేశ కథలు, భోజకాళిదాస కథలు, భేతాళుని యద్భుత కథలు, విక్రమార్కుని యద్భుత కథలు, అద్భుత నీతివ్యవహారక కథలు - 2 భాగాలు, అముద్రిత గ్రంథ చింతామణీ మయూఖము, ప్రబంధ సంబంధ బంధ నిబంధన గ్రంథము, హరహరేశ్వర శతకము, తిరువాయి మొళ, సత్యవిజయము.

**లక్షణ గ్రంథములు :** అప్పకవీయము, సులక్షణసారము, బాలవ్యాకరణము, సంగ్రహ వ్యాకరణము, కావ్యాలంకార చూడామణి, గ్రామ్యభాషా ప్రయోగ నిబంధనము, ఆంధ్రభాషార్ణవము, ఆంధ్రభాషా భూషణము, ఆంధ్రశబ్ద చింతామణి.

**చరిత్రలు :** అబలా సచ్చరిత్రమాల, హిందూ మహాయుగము, మహమ్మదీయ మహాయుగము, ఆంధ్రుల చరిత్ర – 2 భాగములు, ఢిల్లీ దర్బారు, మహారాష్ట్ర చరిత్ర, ఆంగ్లేయ రాజ్యాంగ నిర్మాణచరిత్ర, అశోక చరిత్ర, చీనాదేశ చరిత్ర, రాజస్థాన్ కథావళి – 2 భాగాలు, అక్బరు చరిత్ర, సిఖుల చరిత్ర.

**నిఘంటువులు :** శబ్దరత్నాకరము, ఆంధ్ర నిఘంటు త్రయము, శబ్దార్థ చంద్రిక, అమరము, ఇంగ్లీషు–తెలుగు డిక్షనరీ, గురుబాల ప్రబోధక, నానార్థ రత్నమాల.

**శాస్త్రములు :** రసాయన శాస్త్రము, పదార్థ విజ్ఞాన శాస్త్రము, ఆరోగ్య శాస్త్రము, పశు శాస్త్రము, జంతు శాస్త్రము, వృక్ష శాస్త్రము, ఓషధ శాస్త్రము, వ్యవసాయ శాస్త్రము – 2 భాగాలు, శరీర శాస్త్రము, భౌతిక శాస్త్ర ప్రథమ పాఠము, భౌతిక శాస్త్రము, అర్థ శాస్త్రము, రాజ్యాంగతంత్రము, హిందూదేశ రాజ్యాంగ పద్ధతి, భౌతిక భూగోళము

మరియు

రామాయణ గీతము, రామాయణ నక్షత్రమాలిక, భారతసార సంగ్రహము, రామాయణ కథామృతము, వ్యవహార చంద్రిక, కంపెనిపాట, పురుషార్థప్రకాశము, స్వయం సహాయము, ఉపన్యాస సుమమాలిక, భక్తియోగము, మమకారము, చాటుపద్య మణిమంజరి. అరవదేశమందలి ఆంధ్ర వాఙ్మయము, శ్రుతిరంజని, కనకాభిషేకము, ఆంధ్రభాషా వ్యుత్పత్తి వికాసములు, ఏకభాషాలిపి ప్రశంస, బుద్ధకుమార చరిత్ర, సత్యాబాయి, ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు, వినోదములు, శ్రీమదానంద రామాయణము, శ్రీ సుజ్ఞాన చంద్రోదయము, గాన రామాయణము, జ్ఞానాంజనము, కలి మహిమ, జీవకారుణ్యము, తహశీల్దారు వేశ్యా ప్రహసనము, శ్రీ శివాజీ చరిత్రము, దుర్గావతి, ప్రణయమహిమ, మానవధర్మ చంద్రిక, వచన భారతము, వచన భాగవతము, వచన రామాయణము.

**మా వద్ద దొరుకును**
**ఏమిటి ?**

విజ్ఞానచంద్రికా గ్రంథములు, ఆంధ్రభాషాభివర్ధనీ ప్రచురణలు, ఆంధ్ర ప్రచారిణీ నవలలు, వావిళ్ళ రామస్వామిశాస్త్రి అండ్ సన్స్ వారి గ్రంథములు, ఆర్. వెంకటేశ్వర్లు అండ్ కో గ్రంథములు, ఆనందాప్రెస్ వారి భారత – భాగవత – రామాయణములు, విస్మృత కవులు సిరీస్, సువర్ణరేఖా గ్రంథమంజరి, పానుగంటి లక్ష్మీనరసింహారావు గారి గ్రంథములు, చిలకమర్తి లక్ష్మీనరసింహారావు గారి గ్రంథములు, వేదం వేంకట్రాయ శాస్త్రుల వారి గ్రంథములు, అభినవ కవితామండలి యంజులులు, సరస్వతి పత్రికా ప్రచురణములు.

ఇంతయేల

సంస్కృత గ్రంథములు, పద్య ప్రబంధములు, వచన కావ్యములు, నాటకములు, నవలలు, కథలు, వింతలు, వినోదములు

వగయిరా! వగయిరా!! వగయిరా!!!

మా వద్ద దొరుకును

**చిరునామా :**

**విజ్ఞాన చంద్రికా బుక్ డిపో**

మౌంట్‌రోడ్ – మదరాసు.



# ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల

**త**ల్లాప్రగడ సూర్యనారాయణరావు గారు న్యాయవాదిగా తణుకులో ఉండేవారు. వారి వద్ద బాలాంత్రపు వేంకటరావు అనే సాహిత్యాభిమాని ప్లీడరు గుమాస్తాగా ఉండే వారు. సూర్యనారాయణరావు గారి స్నేహితులు కొవ్వూరి చంద్రారెడ్డి గారు. రెడ్డిగారు ఆగర్భశ్రీమంతులు. చంద్రారెడ్డి గారి దగ్గర చాగంటి శేషయ్య అనే యువకుడు ఆంతరంగిక కార్యదర్శిగా ఉండేవారు. శేషయ్యకు సాహిత్యాభిలాష ఉంది. తల్లాప్రగడ సూర్యనారాయణరావు గారు 1893లో 'సంజీవరాయ చరిత్ర' రచించి, 'చింతామణి' పత్రికకు నవలల పోటీకి పంపగా ప్రథమ బహుమతి వచ్చింది. దాంతో తణుకులోని యువకులలో గ్రంథరచన చేయాలనే కోరిక ప్రబలింది.

తల్లాప్రగడవారు 'సువర్ణలేఖ' అనే మాసపత్రికను నడిపేవారు. దాని అచ్చుపనులు కూడా బాలాంత్రపు వేంకటరావు గారు చూచేవారు. ఆ ముద్రణాలయములో తల్లాప్రగడ వారి రచనలు – ఆంగ్లేయుల మతము, శైవలినీ చంద్రశేఖరము, జార్జి పట్టాభిషేక చరిత్రము, వినోదిని, దుర్జయ దురోదము మొదలగునవి వెలువడినవి.

బాలాంత్రపు వేంకటరావు .గారు స్త్రీల వ్రతకథలు, ధనాభిరామం, సురస, శ్రీరంగరాయ పట్టాభిషేకము అను యాచశూరేంద్ర విజయం రచించారు. చాగంటి శేషయ్య గారితో కలసి సతీ సంయుక్త అనే నాటకం రచించారు. పిఠాపురం దగ్గరలోని

కొమరగిరి వాసులు ఓలేటి పార్వతీశం గారు. పార్వతీశం గారు ఎర్నగూడెం జమీందారు చెలికాని లచ్చారావు గారి దగ్గర అచ్చుపనులు చూస్తూ ఉండేవారు. ఈయన సువర్ణమాల, తారాశశాంకం నాటకాలను రచించారు. బాలాంత్రపు వారికి ఓలేటి వారిని నడకుదుటి వీర్రాజు గారు పరిచయం చేశారు. పరస్పర పరిచయంలో ఇద్దరూ బావా అంటే ఏం బావా అని వరసలు కలుపుకుని రచనలు కలసి చేద్దామనుకున్నారు.

జంటకవులుగా ఏర్పడిన బాలాంత్రపు, ఓలేటి గారలు ఆరు రోజుల్లో 389 పద్యాలతో 'చిత్రకథాసుధాలహరి' అనే ఆధునిక పద్యకావ్యాన్ని రచించి 'వెంకట పార్వతీశ కవులు' పేరుతో ప్రకటించారు. ఈ రచన కాకినాడలోని 'సావిత్రి' మాస పత్రికలో కొంతవరకు ముద్రించబడింది. పత్రిక నిలిచిపోయింది. వెంకటగిరిలోని 'కారొనేషన్ విద్యా వినోదినీ లైబ్రరీ' వ్యవస్థాపకులైన శ్రీనివాసాచార్యులు గారి సహకారంతో ఈ కావ్యం 1910లో ముద్రించబడింది. దీనిలోని కావ్యనాయిక 'అనురూప' కావడంతో దీనికి అనురూప అనే పేరు కూడా ఉంది.

తణుకులో కొవ్వూరి చంద్రారెడ్డి గారు, వారి సన్నిహితులు అయ్యగారి నారాయణ మూర్తి గారు, చాగంటి శేషయ్య గారు, వెంకట పార్వతీశ కవులు కలసి సమిష్టి కృషితో 'ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల' అనే ప్రచురణ సంస్థను 1911 ఏప్రియల్ 1న స్థాపించారు. నాలుగు దశాబ్దాల పైచిలుకు కాలం పుస్తక ప్రచురణను విజయవంతమైన వ్యాపారంగా కొనసాగించారు. మొదట్లో అయ్యగారి నారాయణమూర్తి గారు సంపాదకులుగా ఉన్నారు. కొంతకాలం కొవ్వూరి చంద్రారెడ్డి గారు, అద్దేపల్లి లక్ష్మణ స్వామి గారు, పోలాప్రగడ బ్రహ్మానందరావు గారు, వెంకట పార్వతీశకవులు, బాలాంత్రపు సత్యనారాయణ గారలు నిర్వహించడం జరిగింది.

సాంఘిక నవలలు, అనువాదాలు, చారిత్రక నవలలు, అపరాధ పరిశోధక నవలలు ఈ గ్రంథమాల నుండి వెలువడ్డాయి. ఈ గ్రంథమాలకు పిఠాపురం, ఉయ్యూరు, మునగాల, కపిలేశ్వరపురం, తుని, ఉర్లాము, విజయనగరం, జటప్రోలు, వెంకటగిరి మొదలైన సంస్థానాధిపతులు ఉదారంగా రాజపోషకులయ్యారు. ఈ గ్రంథమాల కార్యాలయం వరుసగా తణుకు, నిడదవోలు, పిఠాపురం, కాకినాడ, రాజమండ్రి లకు బదిలీ అవుతూ వచ్చింది.

మొదట్లో సంవత్సరానికి ఆరు పుస్తకాలు, చందాదారులకు అందజేసేవారు. 1935 నుండి పన్నెండు పుస్తకాలను ప్రచురించాలని సంకల్పించారు. 1936లో గ్రంథమాల రజతోత్సవం జరిగింది. 1938లో పదిమంది సభ్యులు బోర్డ్ ఆఫ్

డైరెక్టర్లుగా 'ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ్ కంపెనీ'గా మారింది. తల్లావజ్ఝల శివశంకర శాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు గౌరవ సంపాదకులుగా వ్యవహరించారు. బాలాంత్రపు వెంకటరావు గారి అన్నగారి కుమారులైన బాలాంత్రపు సత్యనారాయణ గారు సంపాదకులు. 1943లో వెంకట పార్వతీశ్వర కవుల షష్టిపూర్తి ఉత్సవాలు జరిపినారు.

వెంకట పార్వతీశ కవులు బెంగాలీ, మరాఠీ, కన్నడ భాషల పుస్తకాలను తెలుగులోకి అనువాదములు చేశారు. బెంగాలీ నుండి బంకించంద్ర ఛటర్జీ రచనలు, విశ్వకవి రవీంద్రుని – గోరా, నౌకాభంగం మొదలైన రచనలను అనువదించారు. పాంచకడీదేవ్ బెంగాలీలో రచించిన అపరాధ పరిశోధక నవలలను కూడా అనువదించారు.

వెంకట పార్వతీశకవులు – పద్యకావ్యాలు – అనురూప, చందమామ, హోరావళి (రెండు భాగాలు), బృందావనము, భావసంకీర్తనము, నిర్వచనాంధ్ర రామాయణం (సంపూర్ణం); స్వతంత్ర నవలలు – వసుమతీ వసంతం, ప్రమదావనము, శ్యామల, మాతృమందిరము; అనువాదములు – సీతారామ్, రాజసింహ, ఇందిర, ఆరణ్యక, కృష్ణకాంతుని మరణశాసనము, గోరా (రెండు భాగాలు), నౌకాభంగం, మాయావి, మనోరమ, రహస్యవిప్లవము, నీలాంబరి, జీవన్మృత రహస్యము, సంతాపకుడు, ఉన్మాదిని; బాలసాహిత్యం – గోపికలు, లక్ష్మీవిలాసం, బాలగీతావళి (అయిదు భాగాలు), బొమ్మల రామాయణం, బొమ్మల భారతం, బొమ్మల భాగవతం, జంటమూలం–ఏకాంతసేవ, శివపురాణము, బ్రహ్మపురాణము, వామనపురాణము మొదలగునవి.

బాలాంత్రపు వేంకటరావు గారి ఒక్కరి పేరున వచ్చిన రచనలు – సతీసంయుక్త, ధనాభిరామము, యాచశూరేంద్ర విజయం అనే నాటకాలు, కమలినీ కలహంస, కపోతము, ఇది యొక విచిత్రము, అనుమాన పురుషులు, కాకము, సురస, ప్రేమాంజలి, అనాధప్రేతము, మరకతమంజూష, దురదృష్టవంతులు, సమస్యలు మొదలగునవి.

బాలాంత్రపు వేంకటరావు గారు 1881 జనవరి 2న తూర్పుగోదావరి జిల్లా పిఠాపురం తాలూకా మల్లాం గ్రామంలో జన్మించారు. తల్లి సూరమ్మ, తండ్రి వేంకట నరసింహము. 1972 అక్టోబరు 27న మరణించారు.

ఓలేటి పార్వతీశం గారు 1882లో తూర్పుగోదావరి జిల్లా పిఠాపురం తాలూకా కొమరగిరిలో జన్మించారు. తల్లి వెంకమ్మ, తండ్రి అచ్యుతరామయ్య. 1955 జూన్ 13న మరణించారు.

ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల గుంటి సుబ్రహ్మణ్యశర్మ గారి రచనలు మొదలైనవి సుమారు 170 పుస్తకాలను ప్రచురించింది. 1936లో ఆంధ్రప్రచారిణీ రజతోత్సవ సంచిక 'మురళి' పేరుతో వెలువడింది. ఇప్పుడీ గ్రంథమాల చాగంటి శేషయ్యగారి కుటుంబీకుల యాజమాన్యాన నామమాత్రంగా ఉన్నది. ●



# విజ్ఞాన ప్రచారిణీ గ్రంథమాల

1918 మార్చి 3న హైదరాబాదులో కోదాటి రామకృష్ణారావు, కోదాటి వెంకటేశ్వర రావు, ఎస్.బి. రామానుజాచార్యులు, షబ్నవీసు వేంకట రామనరసింహారావు, అక్కినేపల్లి జానకి రామారావు, ఒద్దిరాజు సీతారామచంద్రరావు, ఒద్దిరాజు రాఘవ రంగారావు గారలు ఇష్టాగోష్టిగా కూడినప్పుడు విజ్ఞానదాయకములు, దేశభక్తి ప్రేరకములైన గ్రంథములు వ్రాసి ప్రకటించుటకు ఇనుగుర్తిలో గ్రంథమాల స్థాపించాలని నిర్ణయించారు. దానికి 'విజ్ఞాన ప్రచారణీ గ్రంథమాల' అని పేరు పెట్టారు. అక్కినేపల్లి జానకి రామారావు గారిని సంపాదకులుగా నిర్ణయించారు.

మొదటి ప్రచురణ ఒద్దిరాజు సీతారామచంద్రరావు గారు రచించిన 'రుద్రమదేవి' అనే చారిత్రక నవల. దీనిని బెజవాడ మారుతీప్రెస్‌లో ముద్రించడం జరిగింది. ముద్రణ కాలంలో సీతారామచంద్రరావు గారు బెజవాడలో ఉండి అక్షరాలను కూర్చడం, చెస్‌లు కట్టడం, రూరర్లు నిర్మించడం, ముద్రించడం, బైండింగు చేయడం మొదలగు పనులు చూసి నేర్చుకున్నారు. మొదటి పుస్తకం వెలువడిన తరువాత తరచుగా మద్రాసు రాకపోకల మూలంగా వీరన్నశ్రేష్ఠి గారితో స్నేహం ఏర్పడింది. ఒద్దిరాజు సోదరులిద్దరూ ఇనుగుర్తిలో సొంత ముద్రణాలయం స్థాపించాలనుకున్నారు. వీరన్నశ్రేష్ఠి గారిని సంప్రదించి ఒక చిన్న చేతి యంత్రమును, కావలసిన అచ్చు అక్షరములను, వానిని కూర్చి ముద్రించుట బాగా తెలిసిన నంబూరి నంబయ్య అనే ఒక ప్రూఫ్ రీడరును వెంట తీసుకుని వెళ్ళి ఇనుగుర్తిలో 1919లో 'విజ్ఞాన ప్రచారిణీ ముద్రణాలయం' నెలకొల్పారు.

నంబయ్య తోడ్పాటుతో ఒద్దరాజు సోదరులు ముద్రణా పనులన్నీ నిర్వహించారు. రాత్రులు చదవడం, వ్రాయడం, పగలు అచ్చులు కూర్చి ముద్రించడం వారి దినచర్య అయింది. అలా అచ్చయిన తొలి గ్రంథం 'ఉపదేశ రత్నమాల'.

నెలకు ఒక గ్రంథం ప్రచురించాలనుకున్నారు. ఇంతలో ఆ ముద్రణాలయాన్ని షబ్నవీసు వేంకట రామనరసింహారావు గారు నల్గొండకు తీసుకుపోయి, కొందరు భాగస్వాములను చేర్పించి పని ప్రారంభించారు. అక్కడ పనివారికి కొత్తా, పైగా నైపుణ్యం లేకపోవడంతో అక్షరాలు చెడిపోయాయి. ఆ నష్టం తామే భరించి ఒద్దిరాజు సోదరులు ముద్రణాలయాన్ని మరల ఇనుగుర్తికి తెచ్చారు. కాని అది పనికిరాకుండా పోవడంతో, పెద్ద గ్రంథాలను ముద్రించాలని తలపెట్టి మద్రాసు నుంచి పెద్ద అచ్చు యంత్రము తెచ్చి, గ్రామములోని కొందరికి అచ్చులు కూర్చడం, ముద్రించడం, బైండింగు చేయడం మొదలైనవి నేర్పించి పెద్ద గ్రంథాలను ముద్రించడం సాగించారు. విజ్ఞాన ప్రచారిణీ గ్రంథమాలలో దాదాపు పాతికపైగా గ్రంథాలను ముద్రించడం జరిగింది. ఒకటి అర తప్ప మిగిలిన గ్రంథాలన్నీ ఒద్దిరాజు సోదరుల రచనలే.

చాట్రాతి నర్సమాంబ గారు రచించిన 'అనురాగవిపాకము' ఈ గ్రంథమాలలోనే వెలువడింది. అటు తరువాత రాజవైద్య పింగళి లింబాద్రిరెడ్డి గారు ఈ గ్రంథమాలను స్వగ్రామమైన నెమలికొండకు తరలించి 1932 వరకు తమ సంపాదకత్వంలో అనేక గ్రంథాలను ప్రకటించారు.

ఒద్దిరాజు సోదరులకు బడిచదువుల, కళాశాలల యోగ్యతా పత్రాలు ఏమీలేవు. సోదరులిద్దరూ కొమర్రాజు లక్ష్మణరావు గారి ప్రోత్సాహముతో 18 రోజులు మాత్రం చదివి 1912లో చెన్నపురిలో జరిగిన విజ్ఞానచంద్రికా పరిషత్తు పరీక్షలు వ్రాసి, ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులై కందుకూరి వీరేశలింగం పంతులుగారి మన్ననలను పొందారు. ప్రైవేటుగా కలకత్తా ఎ.సి.బోసు కళాశాల హోమియో వైద్యంలో ఎం.డి. పట్టా పొందారు. స్వయంకృషితో అనేక భాషలు నేర్చారు. శతాధిక సంఖ్యలో చెన్నై, కాశీ విద్యాపీఠం పరీక్షలకు కూర్చునే వారికి తమ ఇంటిలో భోజనం పెట్టి, సమస్త శాస్త్రాలు నేర్పి విద్వాన్, శిరోమణి పట్టాలు ప్రసాదించారు. 1922లో 'తెలుగు పత్రిక' అనే వారపత్రికను వెలువరించారు.

ఒద్దిరాజు సీతారామచంద్రరావు గారు రచించిన తెలుగు గ్రంథాలు – రుద్రమదేవి, శౌర్యశక్తి, వరాహముద్ర, భ్రమర, బ్రాహ్మణ సాహసం మొదలగు చారిత్రక నవలలు, స్త్రీ సాహసం, ముక్తలవ వంటి సాంఘిక నవలలు; మోహినీ విలాసం, ప్రేమ ప్రవాహం వంటి నాటకాలు, సౌదామినీ పరిణయం, అనాథబాల, ఖడ్గతిక్కన, రాకుమారి విద్యాభ్యాసం, చవన ప్రతిజ్ఞ, లోకేశ్వర శతకం వంటి పద్యకృతులు, ఛాయాగ్రహణ తంత్రం, చేతిపనులు, బాలవిజ్ఞాన మంజూష, శరీర విజ్ఞానం, విద్యుద్విజ్ఞానం వంటి ఆధునిక శాస్త్ర గ్రంథాలు; కృష్ణస్తవః, శ్రీస్తవః, శుక్ల పక్షీయం, ఉత్సవానందభాణం,

వైభవస్తవః, విభక్త్యర్థం, ధాతు నిఘంటుః మొదలైన సంస్కృత రచనలు; పాణినీయాష్టాధ్యాయి వ్యాకరణ సూత్రాలకు తెలుగు తాత్పర్యం, సిద్ధాంత కౌముది తెలుగు అనువాదం, భట్టి కావ్యానువాదము, నౌకాభగం, ఆంగ్ల వ్యాకరణం ఆంగ్లానువాదం; ఇంగ్లీషులో – ది ఫ్లవర్, ది బ్లెస్సింగ్, ది ఫ్రయిడ్ ఆఫ్ ది వెల్త్ వంటి పది రచనలు చేశారు.

ఒద్దిరాజు రాఘవ రంగారావు గారు తెలుగులో – వీరాదేశం (చారిత్రక నవల), పంచవూళ కషాయం (ప్రహసనం), విషములు – తచ్చికిత్సలు, సప్తపది, ఉత్తర గురుపరంపర మొదలైనవి; ఆర్తి ప్రబంధం, సప్తగాథ, గురుపరంపరా ప్రభావం సంస్కృతానువాదాలు; ముదలాయిరం, వణ్ణమాడంగల్ మొదలగు తమిళానువాదాలు; మత్కగోపాఖ్యానము, తపతీ సంవరణోపాఖ్యానం మొదలగు తెలుగు కావ్యాలు రచించారు.

ఒద్దిరాజు సోదరులు కలసి రచించినవి – ఉపదేశ రత్నమాల, తిరుప్పల్లాండు, సంస్కృత వ్యాకరణం, భక్తిసార చరిత్ర నాటకం మొదలగునవి.

సీతారామచంద్రరావు గారు 1887 నవంబరు 23న జన్మించారు. 1956 జనవరి 28న మరణించారు.

రాఘవరంగారావు గారు 1894 ఫిబ్రవరి 16న జన్మించారు. 1973 మే 17న మరణించారు. ●



# విస్మృత రాజకవులు గ్రంథమాల మరియు దక్షిణభారత సంస్కృత గ్రంథమాల

వనపర్తి సంస్థానాధీశులు రాజా జనుంపల్లి రెండవ రామేశ్వర రాయలు గారు 1870లో 'బ్రహ్మవిద్యావిలాస ముద్రాక్షరశాల' ను స్థాపించారు. 'విస్మృత రాజకవులు గ్రంథమాల'ను నెలకొల్పి, అనేక గ్రంథాలను అచ్చువేసిన భాషాపోషకులు. మానవల్లి రామకృష్ణ కవిగారు వనపర్తి సంస్థానంలో ఓ పదేళ్ళపాటు గ్రంథ ప్రచురణ కార్య నిర్వాహకులుగా పని చేశారు. ప్రాచీన గ్రంథాల సంపాదన, పరిశీలనకై తన జీవితాన్ని, ధనాన్ని సమర్పించిన పండితకవి మానవల్లి రామకృష్ణకవి. అనేక ప్రాచీన గ్రంథాలను పరిష్కరించి వీరు ప్రకటించారు.

విస్మృత రాజకవులు గ్రంథమాల ద్వారా కడకుంట్ల పాపయశాస్త్రి గారి రచన భారత సంగ్రహణ భ్రమరాంబికా సంవాదం; విక్రాల నరసింహాచార్యులు గారి రచనలు - కళ్యాణి, భారతీస్తుతి; ఖేతనభట్టు విశ్వనాథము గారి రచన ఆధునిక విజ్ఞాన వికాసము; మాదిరాజు విశ్వనాథరావు గారి రచన శాకుంతలం; కప్పగంతుల లక్ష్మణశాస్త్రి గారి రచన కర్ణసుందరి; గొల్లాపిన్ని మల్లికార్జునశాస్త్రి గారి రచన రాజవంశ రత్నావళి; నన్నెచోడుని కుమార సంభవం; వినుకొండ వల్లభరాయని క్రీడాభిరామము; మడికి సింగన్న సకల నీతిసమ్మతము; బద్దె భూపాలుని నీతిశాస్త్ర ముక్తావళి; భైరవకవి శ్రీరంగ మాహాత్మ్యము, ప్రబంధ మణిభూషణము, వేంకట సోదాహరణము, ఆంధ్ర తిరువాయ్ మొదలగునవి ప్రచురించారు. పండితసభలో విద్వాంసుల శాస్త్రోపన్యాసము లను 'శాస్త్రీయ విజ్ఞానము' అనే పేరుతో ప్రచురించారు.

మానవల్లి రామకృష్ణకవి గారు నన్నెచోడుని కుమారసంభవం అనే కావ్యం ప్రకటిస్తూ, ఈ కావ్యం నన్నయకు ప్రాచీనమైనది అని వ్రాశారు. తెలుగు పండిత లోకంలో వాదోపవాదములు చెలరేగినవి. మానవల్లివారు తమ వాదన సమర్థించు కోవడానికి చూపిన ఉపపత్తులలో బీచుపల్లి శాసనం ముఖ్యమైనది. శాసనం పదకొండవ శతాబ్ది నాటిది. కాని తొమ్మిదవ శతాబ్దానికి తీసుకొనిపోబడినది. శాసనకర్త చిద్దనచోడుడైతే, బద్దెనచోడునిగా చెప్పబడింది. అంటే నన్నెచోడుని తండ్రి బద్దెన చోడుడని అతనికి ముడిపెట్టినారు. మానవల్లి వారి వంటి మహాపండితులు ఇలా చేయకూడదు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసర్ కొర్లపాటి శ్రీరామమూర్తి గారు కుమారసంభవాన్ని మానవల్లివారే వ్రాసి, నన్నెచోడుని పేరు పెట్టారని ఒక గ్రంథాన్నే రాశారు.

మానవల్లి రామకృష్ణకవి 1866లో మద్రాసులో జన్మించారు. తండ్రి రామశాస్త్రి. ఎం.ఏ., పాసయ్యారు. సంస్కృతం, తెలుగు, తమిళం, కన్నడం, మళయాలం, ఇంగ్లీషు భాషలలో నిష్ణాతులు. అందరూ ఆయనను కవిగారు అని పిలిచేవారు. చెన్నపట్నంలో ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో పనిచేసేవారు. ఊరూరు తిరిగి తాటాకు ప్రతులను పోగు చేసుకుని తీసుకువచ్చి భాండాగారానికి సమర్పించి, వాటిని పరిశీలించడం ఉద్యోగ విధి. అక్కడనుండి రాజమహేంద్రవరంలోని గవర్నమెంటు హయ్యరుగ్రేడు ఎలిమెంటరీ ట్రయినింగు స్కూలుకి సహాయోపాధ్యాయులుగా బదిలీ చేశారు.

రామకృష్ణ కవిగారు 'దక్షిణ భారత సంస్కృత గ్రంథమాల'ను ప్రారంభించి అపూర్వ ప్రాచీన సంస్కృత గ్రంథాలను పరిష్కరించి ప్రకటించారు. దండి రచించిన అవంతి సుందరి కథ, చతుర్భాణీ; శూద్రకుని పద్మప్రాభృతకం; ఈశ్వరదత్తుని ధూర్త వికట సంవాదము; వరరుచి రచించిన ఉభయాభిసారిక; శ్యామలాకుని పాద తాడితం అనే

భాణచతుష్టయం; భోజుని శృంగార ప్రకాశం; ద్విజాగ్నుని కుందమాల నాటకం; విజ్జకవి రచించిన కౌముదీ మహోత్సవ నాటకం, వత్సరాజ చరితము మొదలగునవి ప్రచురించారు.

మానవల్లి కవిగారి స్వతంత్రకావ్యాలు - మృగావతి, వసంత విలాసము, కళింగ సేనము, పాటలీపుత్రకం మొదలగునవి రచించి ప్రచురించారు.

రామకృష్ణ కవి బరోడా ప్రభుత్వం వారి కోరికపై, భరతుని నాట్యశాస్త్రాన్ని అభినవ గుప్తాచార్యుల వ్యాఖ్యానంతో పరిష్కరించగా ఓరియంటల్ గ్రంథమాల వారు మూడు భాగాలు ప్రకటించారు. ఇంకా ఒక భాగం ప్రచురించవలసి ఉన్నది.

కవిగారికి ఆర్థిక ఇబ్బందులు విపరీతమైనాయి. ప్రచురించిన పుస్తకాలు అమ్ముడు కాలేదు. ఎమ్.ఏ., బి.ఏ., పరీక్షలకు భాషా ప్రశ్నా పత్రాలను ఇచ్చేవారు. చివరకు హయ్యరు ఎలిమెంటరీ గ్రేడ్ పరీక్షలకు కూడా ప్రశ్నాపత్రాలను ఇచ్చి తృణమో, పణమో పొందేవారు. మహాపరిశోధకుడు చేయవలసిన పనా! కూడబెట్టిన ధనం పుస్తకాల రూపంలో ఉంది. కన్నకొడుకులు అక్కరకు రాలేదు.

రామకృష్ణ కవిగారికి జీవితం చివరిదశలో తిరుపతి ప్రాచ్య పరిశోధనా సంస్థలో ఆశ్రయం లభించింది. ఆ తరువాత తిరుపతి దేవస్థానం వారే ఆయనకు ఉపాధి కల్పించారు. కవిగారి భరతకోశం తిరుపతి ప్రాచ్య పరిశోధనాలయం ప్రకటించింది. ఆయన కడపటి రోజులు మనశ్శాంతిగా ముగిసాయి.

మానవల్లి రామకృష్ణ కవిగారు 1957 సెప్టెంబరు 21న మరణించారు. ●



## మంజువాణి ముద్రాక్షరశాల

నందిరాజు చలపతిరావు గారు 1873లో గుంటూరుజిల్లా మంగళగిరి దగ్గర ఉన్న ఆత్మకూరు గ్రామంలో జన్మించారు. తండ్రి ఆలూరి రామయ్య, తల్లి మహాలక్ష్మమ్మ. ఏలూరులోని నందిరాజువారు చలపతిరావుగారిని దత్తత తీసుకున్నారు. దత్తత తండ్రి నందిరాజు సుబ్బారాయుడు, తల్లి సుబ్బమ్మ.

గోదావరిజిల్లా పోలవరం తాలూకాలోని లక్కవరం సంస్థానాధీశులు రాజా మంత్రిప్రెగడ భుజంగరావు గారు 1876 ఏప్రియల్ 14న ఏలూరులో జన్మించారు.

తల్లి వెంకమాంబ, తండ్రి మల్లియామాత్యుడు. దత్తత తల్లి విజయలక్ష్మమ్మ, తండ్రి మల్లికార్జున ప్రసాదరావు.

మంత్రిప్రెగడ భుజంగరావు గారు, నందిరాజు చలపతిరావుగారు మంచి మిత్రులు. మిత్రులిద్దరూ రచయితలు. ఇద్దరు కలసి 1898లో 'మంజువాణి ముద్రాక్షరశాల'ను ఏలూరులో స్థాపించారు. 1910 వరకు 'మంజువాణి' అనే మాసపత్రికను నడిపారు. 1914లో 'ఇండస్ట్రీ' అనే పత్రికను, 'గృహలక్ష్మి' అనే స్త్రీల మాసపత్రికను స్థాపించి నాలుగేళ్ళు నడిపారు.

అప్పట్లో మధిర సుబ్బన్న దీక్షితులు రచించిన కాశీమజిలీలు ప్రజాదరణ పొందింది. దాంతో నందిరాజు చలపతిరావు గారు 'నిజమైన కాశీమజిలీలు' అనే మూడు సంపుటాలు రచించి, ప్రచురించారు. అంతేకాక మంగళగిరి మాహాత్మ్యము, ఆంధ్ర మహాజనసభ కోలాహలము, చిత్రాంగి, రాజా కళింగ గంగు, ఉపన్యాస దర్పణము, సావిత్రి, స్వరశాస్త్రము, స్త్రీల పరిశ్రామికములు, లోక తంతు, ఆంధ్ర సాహిత్య దర్పణము, పాకశాస్త్రము, వాసంతిక, హిందూ గృహము, సహజీవ పశు శాస్త్రము, పశువైద్య శాస్త్రము, గోసంరక్షణము, అగ్నిక్రీడ (బాణాసంచా), సంక్రాంతి ముగ్గులు, స్వప్న ఫల దర్పణము, బాలనీతికథలు, వినోద కథలు, రేచుక్క పగటిచుక్క కథలు, యుక్తి కథలు, మర్యాదరామన్న కథలు, తెనాలి రామలింగ కథలు, హాస్య కథలు,టర్కీ కథలు, పంజాబు కథలు, పాకపదార్థ బోధిని, అశ్వ చికిత్సాసారము, మంజువాణి జంత్రి, అరటిచెట్టు, కొబ్బరిచెట్టు, కిత్తనార, గోగునార, కర్పూరము మొదలగు వివిధ విషయకములైన పుస్తకాలు రచించి, ప్రచురించారు. మంజువాణి పత్రికలో ధారావాహికంగా వచ్చిన చాలా రచనలను గ్రంథరూపంలో అందించారు.

మంత్రిప్రెగడ భుజంగరావు గారు జమీందారే కాక, శతాధిక గ్రంథ రచయిత. ప్రాచీన గ్రంథములను సేకరించి ప్రచురించారు. కూచిమంచి తిమ్మకవి - సర్వ లక్షణ సారసంగ్రహము, అహోబలపతి - కవిశిరోభూషణము, అడిదము సూరకవి - చంద్రాలోకం, కుమార ధూర్జటి - కృష్ణరాయ విజయము, నంది తిమ్మన్న - పారిజాతాపహరణము, కాకుమాని మూర్తికవి - రాజవాహన విజయము, తిరుమల బుక్క పట్టణము కిరీటి వెంకటాచార్యులు - అచలాత్మజా పరిణయము, ఏనుగు లక్ష్మణకవి - రామేశ్వర మాహాత్మ్యము, సారంగు తమ్మయ - వైజయంతీ విలాసము, కొటికలపూడి వేంకటకవి - దిలీపచరిత్రము మరియు ఆంధ్రలోకోక్తి చంద్రిక, సంస్కృత లోకోక్తి చరిత్ర, శకటరేఫ నిర్ణయము మొదలగునవి ప్రచురించారు.

భుజంగరావు గారు చేసిన అనువాదములు, అవధానములు, ఆశుకవిత్వము, కథలు, గాథలు, చాటువులు, జీవిత చరిత్రలు, నవలలు, నాటకములు, ప్రబంధములు, ప్రహసనములు, వచన కావ్యములు, వాఙ్మయ చరిత్ర, శతకములు మొదలగునవి రచించారు. వీరి రచనలు - వసంత కుసుమము, వారకాంత, శివపురాణము, మార్కండేయ చరిత్రము, శంకర రత్నావళి, శశిరేఖ, విద్యున్మాల, చిత్ర హరిశ్చంద్ర, పాండవాజ్ఞాతవాసము, ఉత్తరరామచరితము, ప్రసన్న రాఘవము, శాకుంతలము, చమత్కార స్నేహ విధవా వివాహ నిరపవాద మహాయోగ రహస్యము, మనోరమ, రాజహంస, వాసంతిక, విజయాంక సాహసము, సంస్కృత భాషా వాఙ్మయము, భగవద్గీత, గానామృతము, శిశుసంజీవని, తత్త్వ మీమాంస, శివగీతలు, క్రీస్తుమత సారము, క్రైస్తవ గూఢార్థదీపిక, ముత్తయి, లూకా, మార్కు యోహాను సువార్తలు, సత్క్రైస్తవ శతకము, రసవంతిక, నవనిబంధలు, కస్తూరి తిలకము, ఆంధ్ర కథా సరిత్సాగరము, గోఖలే చరిత్రము, ఏసునాథస్తవము, వ్యవసాయ శతకము, Inner Doctrines of Christinianity, The power of Christ, Baptism, A History of Telugu Literature మొదలగునవి వందకు పైగా రచించి, ప్రచురించారు.

**మంత్రిప్రెగడ భుజంగరావు గారు అంకితం పొందిన రచనలు :** ఆదిపూడి ప్రభాకరకవి - ఆంధ్రపరాశరస్మృతి, కవిరాజ సందర్శనము; నేతి సుబ్బరాయశాస్త్రి- ధర్మజ రాజసూయం; కోన వెంకటరాయశర్మ - దండనాథులు, ప్రాచీన హిందూదేశ రాజ్యాంగ చరిత్రము; కూచి సత్యనారాయణ - పద్మినీ ప్రభాకరాఖ్య మహాప్రబంధము; అన్నమరాజు సుబ్బారాయుడు - హనుమజ్జీవి సత్ప్రబంధము; మచ్చ సూర్యరాయకవి- ప్రపంచ యుద్ధ చరిత్ర; కొత్తపల్లి సుందరరామకవి - భుజంగ భూపాల శతకము, భుజంగరాయ; అడివి సాంబశివరావు - భుజంగ నృపాల శేఖర శతకము; నందిరాజు చలపతిరావు - రాజా కళింగ గంగు; రావూరి చిట్టి సుబ్రహ్మణ్యకవి - భుజంగరాయ సందర్శనము; చిల్లరిగె యోగానందకవి - కనకవల్లి; కాలనాథభట్ట నారాయణశాస్త్రి- హనుమద్విజయము మొదలగునవి కూడా మంజువాణి ముద్రాక్షరశాల తరపున ప్రచురించారు.

మంత్రిప్రెగడ భుజంగరావు గారి పెద్దకుమార్తె హైమవతి పెళ్ళి సందర్భంగా రెండు వందల ముప్పై రెండు మంది కవుల ఆశీర్వాద పద్యాలతో, ఆయా కవుల సంక్షిప్త చరిత్ర చేర్చి 'హైమవతీ పరిణయము లేక ఆధునిక కవి జీవితములు' అనే విలువైన గ్రంథాన్ని ప్రచురించారు.

మంత్రిప్రెగడ భుజంగరావు గారు 1941 ఏప్రియల్ 28న మరణించారు.

నందిరాజు చలపతిరావు గారు పద్య రూపంలో తమ స్వీయ చరిత్రను రచించి, 1950లో ప్రకటించారు. చలపతిరావు గారు 1960 అక్టోబరు 15న మరణించారు. ●



# సత్యవోలు గున్నేశ్వరరావు అండ్ బ్రదర్స్

**స**త్యవోలు పార్వతీశం గారికి సంతానం లేక ఒక పిల్లవాడిని దత్తత తీసుకుని గున్నయ్య అని పేరు పెట్టారు. గున్నయ్య పెరిగి పెద్దయి రాజమహేంద్రవరం (రాజమండ్రి) కరణంగా పని చేశారు. గున్నయ్య గారికి పార్వతీశం, పాపయ్య అని ఇద్దరు కుమారులు. పార్వతీశంగారు పెద్దయిన తరువాత రమణమ్మను వివాహమాడారు. ఈ దంపతులకు గున్నేశ్వరరావు గారు 1879 డిసెంబరు 15న జన్మించారు. గున్నేశ్వరరావు గారి తమ్ముడు బంగారాజు.

పార్వతీశం గారు ముత్యాల వ్యాపారం, రత్నాల వ్యాపారం చేసి బాగా సంపాదించారు. ఆ రోజుల్లో ఆయనకు సరుకు రవాణా చేసే నాలుగు పెద్ద పడవలుండేవి. రాజమహేంద్రవరానికి చెందిన శివనారాయణ అనే మార్వాడీతో కలసి వ్యాపారం చేశారు. గున్నేశ్వరరావు గారి అయిదవ ఏటనే పార్వతీశం గారు మరణించారు. కుటుంబభారం గున్నేశ్వరరావు గారి మీద పడింది. గున్నేశ్వరరావు గారు పరిస్థితులను ఒక సవాలుగా స్వీకరించారు. పదమూడవ ఏటనే స్కూలుఫైనల్ పాసై, వివాహం చేసుకున్నారు. చెన్నపట్నంలో నాలుగు సంవత్సరాలు కుటుంబంతో సహా ఉన్నారు. అక్కడే కామర్సు పరీక్షలో డిప్లొమా పొందారు.

రాజమహేంద్రవరంలో ఇమ్మానేని హనుమంతరావు నాయుడు గారు 1889లో 'హిందూ నాటక సమాజం' నెలకొల్పారు. 1894 వరకు ఈ సమాజం వారు కొన్ని నాటకాలను ప్రదర్శించి ప్రజలను అలరించారు. 1900 సంవత్సరంలో హిందూ నాటక సమాజాన్ని పునరుద్ధరించారు. ఈ సమాజం అధ్యక్షులు చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు, సత్యవోలు గున్నేశ్వరరావు గారు - ఇద్దరి మనస్తత్వాలు ఒకటే. సమాజానికి వచ్చిన ధనాన్ని పరోపకారానికి, సమాజానికి వెచ్చించే సుగుణం ఇద్దరిదీ. చిలకమర్తి లక్ష్మీనరసింహం, కందుకూరి వీరేశలింగం పంతులు, వడ్డాది సుబ్బారాయుడు, ధర్మవరం కృష్ణమాచార్యులు గారల నాటకాలను ప్రదర్శించేవారు.

గున్నేశ్వరరావు గారు, వారి చిన్నాన్నగారి అబ్బాయి లక్ష్మీపతి ఈ సమాజానికి కామధేనువు, కల్పవృక్షంలా ఉండేవారు.

వీరేశలింగం పంతులు గారు తమ గ్రంథములన్నింటినీ సంపుటాలుగా ప్రకటించిన 'చింతామణి ముద్రాక్షరశాల' ను 1900లో చెన్నపురి నుండి తిరిగి వచ్చిన గున్నేశ్వరరావు గారికి విక్రయించారు. గున్నేశ్వరరావు గారు సోదరులతో కలసి ప్రెస్ నడిపేవారు. 'ఆంధ్రకేసరి' అనే పత్రికను స్థాపించి ఆ ప్రెస్‌లో ముద్రించేవారు. పత్రిక సంపాదకులు చిలుకూరి వీరభద్రరావు గారు. చిలకమర్తి, అత్తిలి సూర్యనారాయణ వంటివారు జాతీయ ఖాదీ ప్రేరణకై పత్రికలో వ్యాసాలు వ్రాసేవారు.

రాజమహేంద్రవరానికి గున్నేశ్వరరావు గారు పెద్ద కరణం. ఆయన పరిధిలో ఇరవై రెండు గ్రామాలు. ఆయన దగ్గర ఇద్దరు చిన్నకరణాలు ఉండేవారు. గంభీరరూపం, ఆకర్షణ ఉన్న నిండైనవిగ్రహం ఆయనిది. కలెక్టరు, పోలీసు అధికారులు అయిన యూరోపియనులకు ఆయన పట్ల గౌరవాదరణలు ఉండేవి. కొందరికి భయం కూడా ఉండేది.

గున్నేశ్వరరావు గారి పినతండ్రి కుమారుడు సత్యవోలు లక్ష్మీపతి. ఆయనకు నాగుల చెరువు వీథిలో రెండువేల గజాల ఖాళీ స్థలం ఉన్నది. 1901లో ఆ స్థలంలో కనుపర్తి శ్రీరాములు గారిచే 'చింతామణీ నాటక సమాజం' స్థాపించారు గున్నేశ్వరరావు గారు. గుర్రం జాషువా గారిని చింతామణీ నాటక సమాజానికి రచయితగా ఆహ్వానించడమే కాక ఆత్మీయంగా ఆదరించారు – ఒక రకంగా బ్రతుకు తెరువు చూపించారు.

చింతామణీ నాటక సమాజంలో చేరిన జాషువా గారు, వీరేశలింగం పంతులు గారిని కలవగా, పంతులు గారు జాషువాతో – "గున్నేశ్వరరావు గారు ప్ర/సన్నులగుట మెచ్చదగ్గ సంగతి ఇది, నీ/యున్నతికి మొదటిమెట్టగు/కన్నె కలల కతడు – కల్పకంబందు కలీ" అన్నారట.

జాషువా గారు గున్నేశ్వరరావు గారి గురించి ఏమన్నారంటే – "అరనెరసియున్న గుప్పెడు/బిరుసగు మీసములు వదన బింబమ్మున రా/చరికపు హుందా తనమున్/వరభూషలు సత్యవోలు వంశీందునకున్"

గోదావరిపై పద్యం రచించి, ఆ కాగితం గోదావరిలో పడవేసిన కవి జాషువా గారు గున్నేశ్వరరావు గారికి కృతజ్ఞత ఎలా తెలిపారంటే – "చెలిమిన్ నాదు

భుజాగ్రమున్ గుదుపుచున్ చింతామణీ నాట్యమం/దలికిన్ నాటకముల్ రచింపుము కవీంద్రా! ముందుగా కొమ్మిదే/ నెలజీతం బని రూప్యవింశతి నిడెన్ చిత్తంబు పొంగారనీ/ పలుకుం దొయ్యలి తాండవించె నవభావ స్వర్ణ భూషాఢ్యయై"

గున్నేశ్వరరావు గారు ప్రసిద్ధ రచయితల గ్రంథాలను కొన్నాళ్ళపాటు గుత్తకు తీసుకుని 'సత్యవోలు గున్నేశ్వరరావు అండ్ బ్రదర్స్' పేరిట ప్రచురించేవారు. ఇతరులు ప్రచురించిన పుస్తకములకు సోల్ ఏజెంట్‌గా ఉండటం చేసేవారు. వీరేశలింగం పంతులు గారి పుస్తకాలను 1906 నుండి ఓ పదేళ్ళపాటు గున్నేశ్వరరావు గారు సోల్ ఏజెంట్‌గా నూటికి పదిహేను రూపాయలు కమీషను తీసుకునేట్లు, 1905 డిసెంబరు 26న ఒక ఒప్పందం కుదుర్చుకున్నారు.

1905లో చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు గయోపాఖ్యానం, సీతా కళ్యాణం, ద్రౌపదీ పరిణయము, పారిజాతాపహరణం - నాలుగు నాటకాలు రాసి ఇచ్చేట్టు, అయిదు సంవత్సరాల గుత్తకు గాను వెయ్యి రూపాయలు ఒక్కసారి ఇచ్చి ఒప్పందం రాసుకున్నారు. (చిలకమర్తి వారు 'గయోపాఖ్యానం, పారిజాతాపహరణం, ప్రసన్న యాదవము - మూడు నాటకాలే గున్నేశ్వరరావు గారికి ఇచ్చాను. నాలుగవది ఇవ్వనే ఇవ్వలేదు. గున్నేశ్వరరావు గారూ అడగనూ లేదు' అని స్వీయచరిత్రలో రాసుకున్నారు)

గున్నేశ్వరరావు గారికి వ్యాపారదృష్టి ఒక్కటే కాదు. దేశాభివృద్ధికి, స్వాతంత్ర్యోద్యమం విస్తరించడానికి పుస్తకాలు ఉచితంగా పంచిపెట్టేవారు. బంకించంద్ర ఛటర్జీ రచించిన ఆనందమఠం (వందేమాతరం) నిషేధించినప్పుడు, అయిదువేల రూపాయలు ఖర్చుపెట్టి ప్రింట్ చేసి, ఆ ప్రతులు ఉచితంగా పంచారు. బ్రాహ్మ వివాహం రాసిన వీరేశలింగం గారన్నా, కన్యాశుల్కం రాసిన గురజాడ అప్పారావు గారన్నా గున్నేశ్వరరావు గారికి ప్రత్యేక అభిమానం. కాళ్ళకూరి నారాయణరావు గారి వరవిక్రయం, గురజాడ వారి కన్యాశుల్కం కాపీరైట్స్ పొందారు.

జీవితంలో చరమదశలో గున్నేశ్వరరావు గారు కష్టనష్టాలను ఎదుర్కొన్నారు. నాటక సమాజం, ముద్రణ-ప్రచురణ, దానాలు, ప్రజాసేవ- వీటిని చూడడానికి దక్షతగల సహాయకులు లేకపోయారు. సోదరులు విడిపోయారు. వ్యాపారాలు క్రమేణా క్షీణించసాగాయి. 1922లో ఒక్కగానొక్క పదహారేళ్ళ కూతురు శ్రీమతి వాడ్రేవు రమణమ్మ చనిపోయింది. దొంగనోట్ల కేసు అభియోగం మోపబడి మానసిక క్లేశాలకు గురి అయ్యారు. బెరిబెరి వ్యాధికి గురి అయి రెండు నెలలు మృత్యువుతో పోరాడి 1925 ఫిబ్రవరి 2న పరమపదించారు.

1925 ఫిబ్రవరి 3 మంగళవారం ఆంధ్రప్రత్రిక దినపత్రికలో :

## కీ.శే. సత్యవోలు గున్నేశ్వరరావు గారు
### రాజమహేంద్రవరమునకు మకుటము లేని మహీపతి
### వెనుకచూపు లేని నెరదాత

"ఆంధ్ర నాటక రంగోద్ధారకుడు, భాషాపోషకుడు, అఖిలాంధ్ర లోకమునకు చిరపరిచితులునగు శ్రీ సత్యవోలు గున్నేశ్వరరావు పంతులుగారు నిన్న 2వ తేదీ రాత్రి రాజమహేంద్రవరమున స్వగృహమున స్వర్గస్తులయిరనియు, వీరు కొన్ని నెలల నుండి వ్యాధిగ్రస్తులై యుండిరనియు నేడు రాజమహేంద్రవరము నుండి మా విలేఖరి పంపిన తంతివార్తను చూచి మిక్కిలి చింతించితిమి.

రాజమహేంద్రవరమున పేదలలో వీరి సహాయమును బడయనివారు లేరని చెప్పుట యందెట్టి అతిశయోక్తియును లేదు. వరదలు, అంటువ్యాధులు, ఇండ్లు తగుల బడుట మున్నగు ప్రమాదములు గలిగినప్పుడు, వీరతి సాహసముతో ముందు నిలచి ధనమొసగియు, అన్నదానం చేసియును, వస్త్రముల నొసంగియు సకల విధముల వేనవేల కుటుంబములకు సేవయును సహాయమును చేసి యుండిన వదాన్య శిరోమణులు. ప్రాజ్ఞత వచ్చిన తదాదిగ ఆంధ్రనాటకరంగము నందత్యధికమగు నభిమానముతో వేలకొలది ధనమును వెచ్చించి పని చేసిరి. చింతామణీ నాటక సమాజమును నెలకొల్పి ప్రాణప్రదముగా పోషించిరి. బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం గారిని ప్రోత్సహించి చాలా నాటకములు వ్రాయించిరి. వానిని స్వకీయ చింతామణి ముద్రాక్షరశాల యందే మొదట ముద్రించిరి. కేసరియను వారపత్రికను రాజమహేంద్రవరమున నెలకొల్పి శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు గారిని సంపాదకులుగా నేర్పరచి చాలాకాలము సాగించిరి. ఆపదలోనున్న వారిని కాపాడుటలో వీరగ్రగణ్యులు. ఆపద్బాంధవులను పేరు వీరికి సార్థకమగును. రాజమహేంద్రవరమున వీరికి గల పలుకుబడి అపారము. పెద్దలకును, పిల్లలకును, కవులకును, నటులకును గూడ వీరు కడు సులభులుగా నుండిరి. వీరి సోదరులగు బంగార్రాజు గారిని, బంధువర్గమును, పెద్ద కుటుంబమును, అపారమగు మిత్రమండలిని దుఃఖసాగరమున ముంచి దివికేగిరని తెలుపవలసి వచ్చినందులకు మిక్కిలి చింతిల్లుచున్నాము. వీరి బంధుమిత్రులకు మా సానుభూతి నందజేయుచు, వీరి ఆత్మకు శాంతిని ప్రసాదింప భక్తిపూర్వకముగా పరమేశ్వరుని వేడుకొనుచున్నాము. ●



# వేగుచుక్క గ్రంథమాల

బరంపురంలో దేవరాజు వేంకట కృష్ణారావు గారు 1910లో 'వేగుచుక్క ముద్రణాలయం' పేరుతో సొంత ముద్రణాలయాన్ని ప్రారంభించారు. 1911లో కృష్ణారావు గారు, తాపీ ధర్మారావు గారు, భాగవతుల నృసింహశర్మ గారలు కలసి 'వేగుచుక్క గ్రంథమాల'ను స్థాపించారు. తెలుగు పాఠకులు దీనిని దీవించారు. న్యాపతి రామానుజస్వామి గారు దీనికి అధ్యక్షులు. దేవరాజు వేంకట కృష్ణారావు గారు కార్యదర్శి. తాపీ ధర్మారావు గారు సంపాదకులు. ఈ గ్రంథమాల ప్రచురణలను మరీచికలు అనేవారు. సంవత్సరానికి నాలుగు మరీచికలు వెలువరించారు. విజ్ఞాన చంద్రికా గ్రంథమాల, ఆంధ్ర భాషాభివర్ధని సమాజం చేపట్టని విషయాలపై గ్రంథాలు ప్రచురించడం దీని మరొక లక్ష్యం. 1914లో 'వేగుచుక్క కథావళి' పేరుతో మాసపత్రికను ప్రారంభించారు.

తాపీ ధర్మారావు గారి తొలి రచన 'ఆంధ్రులకొక మనవి' 1911లో వెలువడింది. ఉషఃకాలం (కలభాషిణి పేరుతో), క్రొవ్వురాళ్లు (ఉపాధ్యాయుడు పేరుతో), విలాసార్జునీయం (నేను పేరుతో) ప్రకటించారు కాని, పుస్తకంలో వారి పేరును ప్రకటించుకోలేదు. తాపీవారు ఆట్టేకాలం బరంపురంలో ఉండలేదు. వేగుచుక్క గ్రంథమాలతో దీర్ఘసంబంధం దేవరాజు వేంకట కృష్ణారావు గారికి, భాగవతుల నృసింహ శర్మ గారికి కొనసాగింది. కొంతకాలం ఈ సంస్థ భాగవతుల నృసింహశర్మ గారి ఆధ్వర్యంలో ఆదిభట్ల తరిణయ్య సిద్ధాంతి గారి సంపాదకత్వంలో నడిచింది.

వేంకట కృష్ణారావు గారు వాడే వీడు, కాలూ రాయి, నేనే మొదలైన అపరాధ పరిశోధక నవలల అనువాదాలే కాకుండా, రామాయణాన్ని 'విభ్రమ రాఘవం' అనే పేరుతో అయిదు సంపుటాల గ్రంథం రచించారు. మహాభారతంలోని కథలు తీసుకుని నవలలుగా రచించారు. సంజయ రాయబారం పాఠ్యగ్రంథంగా అప్పట్లో నిర్ణయించారు.

నవలల్లో ప్రతి అధ్యాయం చివర 'సింహావలోకనం' పేరుతో విశ్లేషణ రాశారు. వీటి ప్రాముఖ్యత విన్న మహాత్మాగాంధీ వీటిలో కొన్ని భాగాలను ఇంగ్లీషులోకి అనువదించుకుని చదివారు. చదివాక ఆనందం పట్టలేక 'డియర్ గురూజీ' అని సంబోధిస్తూ కృష్ణారావు గారికి అభినందన లేఖ రాశారు. ఈ సింహావలోకనం 1960-62 మధ్య కాలంలో కొన్ని విశ్వవిద్యాలయాలు పాఠ్యాంశంగా నిర్ణయించాయి. కృష్ణారావు గారు 'మనసు - దాని పని' అనే మనస్తత్వ శాస్త్రం, ఒరిస్సా చరిత్ర, పురాణ సంహిత, శ్రీ కృష్ణాభ్యుదయం వంటివి రచించి, ప్రచురించారు.

కృష్ణారావు గారు 1934లో మండపాక పార్వతీశ్వర శాస్త్రి గారితో కలసి 'కళా ప్రచారక సమితి' పేరుతో మరో ప్రచురణ సంస్థ ప్రారంభించి మల్లాది వేంకట కృష్ణ శర్మ, జయంతి జగన్నాథరావు, గుండిమెడ వేంకట సుబ్బారావు తదితరుల రచనలు వాడుకభాషలో ప్రచురించారు.

ఒరిస్సాలోని తెలుగువారి సమస్యలు ప్రభుత్వం దృష్టికి తీసుకు వచ్చేందుకు 1942లో 'విశాలాంధ్ర వాణి' అనే పత్రికను తెలుగు, ఇంగ్లీషు, ఒరియా భాషలలో నెలకొల్పి 1960 వరకు నడిపారు. వేగుచుక్క గ్రంథమాల మరీచికలు చాలా ముద్రణలు పొందినా, కృష్ణారావు గారి ఆర్థిక పరిస్థితి దెబ్బతిన్నది. 1955లో వారి 69వ ఏట తమ ప్రచురణల కాపీరైటును గ్రంథానికి నూరు రూపాయల చొప్పున కొండపల్లి వీర వెంకయ్య అండ్ సన్స్, రాజమండ్రి వారికి అమ్మివేశారు. ప్రేమము, సుహృల్లత, పద్మిణీ పరిణయము, సుగుణ- మూడు భాగాలు, గోవిందబాబు, భూపేంద్రుడు, మిస్టర్ సేన్, ఆనందబాబు, వెంకటరావు, కోటీసు తనయ, లోకభయంకరుడు, నరాధమ, ఉగ్ర భైరవుడు, జూలియా, మిస్ మినీ, లీలాకుమారి - 2 భాగాలు, చపల మొదలైనవి కూడా గ్రంథమాల మరీచికలు.

దేవరాజు వేంకట కృష్ణారావు గారు 1886 సెప్టెంబరు 23న విజయనగరం జిల్లా పార్వతీపురం దగ్గరలోని మృత్యుంజయ నగరంలో జన్మించారు. ఆర్థికంగా దెబ్బతిన్న తరువాత 1960లో రాజాం చేరుకున్నారు. 1966 సెప్టెంబరు 13న రాజాంలో కన్నుమూశారు. ●



## పీపుల్స్ ఫ్రెండ్ లైబ్రరీ

చెన్నపట్నంలో రెండు దశాబ్దాలపాటు రెండు ఇంగ్లీషు పత్రికలు నడిపి, అధ్యాపకుడుగా, సంపాదకుడుగా, సంస్కర్తగా, ప్రచురణకర్తగా నగర పౌరజీవనంలో గుర్తింపు పొందిన వ్యక్తి దంపూరు నరసయ్య. నరసయ్య ప్రజల మనిషి. ఇంగ్లీషులో 'పీపుల్స్ ఫ్రెండ్', 'నేటివ్ అడ్వొకేట్' అనే పత్రికలను నడిపారు. 1899లో నరసయ్య గారు నెల్లూరులో నిర్వహించిన 'ఆంధ్రభాషా గ్రామ వర్తమాని' వారపత్రిక పూర్తిగా వాడుకభాషలోనే వెలువడినట్లు తెలుస్తుంది. గ్రామ ప్రజల సమస్యలను తెలుగులో సుస్పష్టంగా ప్రచురించేది.

నరసయ్య గారు 'పీపుల్స్ ఫ్రెండ్ లైబ్రరీ' అనే ప్రచురణ, పుస్తక విక్రయ సంస్థను నిర్వహించారు. ప్రభుత్వ చట్టాలకు సంబంధించిన మామూలు పుస్తకాలతో పాటు, కందుకూరి వీరేశలింగం పంతులుగారి పుస్తకాలు కూడా విక్రయించేవారు.

1864లో కేశవచంద్రసేన్ చెన్నపట్నం వచ్చారు. బాల్య వివాహాలను ఖండిస్తూ అనేక ఉపన్యాసాలు చేశారు. పచ్చయప్ప పాఠశాలలో పనిచేస్తున్న తన అన్నయ్య దంపూరు కృష్ణయ్యతోపాటు, ఆ ఉపన్యాసాలు వినడానికి నరసయ్య వెళ్ళారు. ఎందరో ఆ ఉపన్యాసాల వల్ల ప్రభావితులయ్యారు. అప్పుడు నెల్లూరి వారైన చదలవాడ అనంత రామశాస్త్రి 'వివాహ కన్యా స్వరూప నిరూపణము' అనే గ్రంథాన్ని చెన్నపట్నం పుర ప్రముఖులైన రంగనాధశాస్త్రి గారి ప్రోత్సాహంతో రచించారు. మనుస్మృతిలోని వాక్యాలను ఉదహరిస్తూ రజస్వలానంతర వివాహాన్ని ఈ గ్రంథంలో సమర్థించారు. నరసయ్యగారి బావగారు గుర్రం వెంకన్న గారు దీనిని ఖండిస్తూ 'వాద ప్రహసనం' అనే గ్రంథాన్ని రాశారు.

ఆ రోజుల్లో చెన్నపట్నంలో విద్యావంతులు ఈ గ్రంథాలను గురించి, రజస్వలానంతర వివాహాల గురించి పెద్ద చర్చ చేశారు. తొలి యవ్వనంలో అడుగు పెడుతున్న నరసయ్యగారు రజస్వలానంతర వివాహాలపై వెలువడిన అభిప్రాయాలను ఆయా పండితుల పేరు మీదుగానే 'మద్రాసు టైమ్స్'కు సంపాదకీయ లేఖలు రాసి, ప్రజల దృష్టిని ఈ సమస్యవైపు ఆకర్షించారు. మనుస్మృతో, మరొకటో గీటురాయి కాదు. సంప్రదాయ దాసులమై బాల్యవివాహాలను ఇంకా కొనసాగించడమా ? లేక యూరప్‌లో, కొన్ని ఆసియా దేశాలలో సంస్కారవంతులైన ప్రజలు అనుసరిస్తున్నది సమంజసమూ, ఆచరణయోగ్యమూ అయిన రజస్వలానంతర వివాహ పద్ధతిని అనుసరించడమా ? అనేది అసలు సమస్య - అని హేతువాద దృష్టితో నరసయ్యా గారు ఒక లేఖలో తన భావాలను వివరించారు. ఆ విధంగా మద్రాసు టైమ్స్ పత్రికలో తను రాసిన ఈ లేఖలన్నింటినీ చేర్చి 'లెటర్స్ ఆన్ హిందూ మేరేజస్' అనే పుస్తకాన్ని 1867లో ప్రకటించారు.

దంపూరు నరసయ్యా గారు 'లెటర్స్ ఆన్ హిందూ మేరేజస్', 'హిస్టారికల్ స్కెచెస్ ఆఫ్ ది బ్రిటీష్ ఇన్ ఇండియా', 'ఎసెన్షియల్స్ ఆఫ్ ఇంగ్లీష్ గ్రామర్', 'ఎసెన్షియల్ ఆఫ్ ఎ పీపుల్స్ ఫ్రెండ్ లైబ్రరీ బుక్ ఇన్ ఇంగ్లీష్ గ్రామర్ ఇన్ ఈజీ తెలుగు' మొదలగు పుస్తకాలు రచించి, ప్రచురించారు.

దంపూరు నరసయ్య గారు 1849 సెప్టెంబరు 25న మద్రాసులో జన్మించారు. తల్లి అన్నపూర్ణమ్మ, తండ్రి ఆదినారాయణయ్య. 1909 జూన్ 28న నరసయ్య గారు వెంకటగిరిలో మరణించారు. ఆయన మరణవార్త పదిరోజులు తరువాత కూడా గురజాడ అప్పారావు గారివంటి వారికి తెలియలేదంటే, ఆయన చివరి రోజులు ఎంత అజ్ఞాతంగా గడిచాయో! ●



# క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీ ఫర్ ఇండియా

1890 ప్రాంతంలో 'క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీ ఫర్ ఇండియా' చెన్నపట్నంలో స్థాపించబడింది. సాంఘిక, సారస్వత ప్రయోజనాల కోసం ఏర్పడిన సంస్థ. హితవాది, సత్యదూత వంటి పత్రికలు నడపడంతో పాటు సారస్వత సంబంధంగా క్రైస్తవమత ప్రచారానికి కూడా కృషి చేసింది. ప్రత్యక్షంగా క్రైస్తవమత బోధ చేయకుండా, హిందూ సంఘంలోని లోపాలను సూచిస్తూ, ధ్వన్యాత్మకమైన వ్యాసాలు, చిన్న పుస్తకాలను వందలాదిగా ప్రచురించింది. స్త్రీలకు విద్య నేర్పుట - కలిగే మేలులు, ఋణము - అది తప్పించుకొను విధము, పరిశుభ్రత వలన కలుగు మేలులు, హిందూ వితంతువులు మొదలగునవి తొలి ప్రచురణలలో కొన్ని.

పెద్దల విద్య (ఉపాధ్యాయ బోధిని) వంటి రచనలు కూడా ప్రచురించినది. దీని అనుబంధ శాఖలు ఆంధ్రదేశములో చాలా చోట్ల ఏర్పడినాయి. స్త్రీ విద్య, రచయిత్రులను ప్రోత్సహించడం, చిన్న చిన్న గ్రంథాలయాలు నడపడం వంటివి వీరి కార్యకలాపాలలో కొన్ని. అతి సామాన్యమైన కరపత్రము నుండి శబ్దరత్నాకరము, తెలుగు బైబిలు నిఘంటువు, ఆర్డెన్సు తెలుగు వ్యాకరణం వంటి గ్రంథాలు కూడా ఈ సంస్థ ప్రచురించింది. చిన్నపిల్లలకు అర్థమయ్యే పుస్తకాలు, వ్యాఖ్యాన గ్రంథాలూ సరసమైన ధరలకు పాఠకులకు అందించడానికి కృషి చేశారు. కొన్ని దశాబ్దాలపాటు పాఠ్య పుస్తకాలు కూడా ప్రచురించిన ఈ సంస్థ కేవలము మతపరమైన పుస్తకాలనే కాకుండా, విద్యారంగాన్ని విస్తృతం చేయాలనే లక్ష్యంతో సాంఘిక ప్రయోజనాలను ఆశించి సర్వజనీనమైన పుస్తకాలను ప్రచురించింది. ●



# ఆనంద ముద్రణ సంస్థ

చెన్నపట్నంలో వేమూరు వేంకట కృష్ణమ్మశెట్టి, తిరువేంగ దత్తాన్ శెట్టి 'ఆనంద ముద్రణ సంస్థ'ను స్థాపించారు. వావిళ్ల ముద్రణ సంస్థతో పోటీపడి తెలుగు, ఇంగ్లీషు, తమిళం, కన్నడం, దేవనాగరి లిపులలో అనేక ఉత్తమ గ్రంథాలను ప్రచురించిన సంస్థ. ఆర్. వెంకటేశ్వర్ అండ్ కో యాజమాన్యంతో పనిచేసింది. ప్రోలాప్రగడ శేషగిరిరావుగారి ప్రోత్సాహంతో 'చంద్రిక' అనే మాసపత్రికను 1934 జనవరిలో స్థాపించి నడిపారు. దీనికి దోమా వేంకటస్వామి గుప్తా, బులుసు వెంకట రమణయ్యలు సంపాదకులు. దీనిని 'భారతి' పత్రిక స్థాయిలో నిర్వహించారు.

వసుచరిత్ర వంటి ప్రాచీన ప్రబంధాలకు పండితుల చేత వ్యాఖ్యలు రాయించి ప్రచురించారు. దేవరాజు సుధి (తెపప్పెరుమాళ్ళయ్య) గారి చేత వాల్మీకి రామాయణాన్ని యధామూలంగా తెలుగులో వచనంలో రాయించి ప్రచురించారు. తెలుగులో వచ్చిన వచన రామాయణం ఇదే మొదటిది. 1906లో భవభూతి 'ఉత్తర రామచరిత'ను తెలుగు వ్యాఖ్యతో, తెలుగు లిపిలో, మూలంతో కూడా అచ్చు వేశారు. వైదిక వాఙ్మయానికి, పురాణ వాఙ్మయానికి, విశిష్టాద్వైత మతానికి సంబంధించిన అనేక గ్రంథములను ఈ సంస్థ ద్వారా వెలువరించారు.

వాచక పుస్తకాలు, ఉపవాచకాలు, వ్యాకరణాలు, ప్రబంధాలు, భారత, భాగవత, రామాయణాలు వచనంలో తెలుగులో అనేకం ప్రచురించారు. కూచి నరసింహం, పానుగంటి లక్ష్మీనరసింహం గార్లతో పాఠశాల తరగతులకు వాచక పుస్తకాలు రాయించి ప్రచురించారు. ఆనంద ముద్రణ సంస్థ ప్రచురించిన ఆంధ్ర మహా భారతం ప్రామాణికమైనదిగా పండితుల ఆమోదం పొందింది. ●



# జ్యోతిష్మతీ ముద్రాక్షరశాల

వేదం వేంకటరాయశాస్త్రి గారు 1853 డిసెంబరు 21న నెల్లూరుజిల్లా కావలి తాలూకా మల్లయపాలెంలో జన్మించారు. తల్లి లక్ష్మమ్మ, తండ్రి వేంకటరమణ శాస్త్రి.

1890లో శాస్త్రిగారు 'జ్యోతిష్మతీ ముద్రాక్షరశాల'ను మద్రాసులో స్థాపించారు. ఈ పనికి శాస్త్రిగారికి వేంకటగిరి మహారాజా శ్రీ గోపాలకృష్ణ యాచేంద్రులు వారి ఆదరం లభించింది. ప్రారంభించిన ముద్రాక్షరశాల కొద్దిరోజుల్లోనే చిక్కుల్లో పడింది.

పుస్తక ప్రచురణ కార్యక్రమాన్ని తాత్కాలికంగా నిలిపివేశారు. శాస్త్రి గారు కొంతకాలం సూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాణంలో పనిచేశారు.

శాస్త్రి గారు 1910లో జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలను తిరిగి ప్రారంభించారు. ఆ సంవత్సరంలో అమరుక కావ్యం, పుష్పబాణ విలాసం, రసమంజరులను పూర్తి టీకల తోను; భర్తృహరి శతక త్రయాన్ని సంపూర్ణాంధ్ర వ్యాఖ్యానంతోను, తెలుగు పద్యాలతోను ముద్రించారు.

కాళిదాసు 'రఘువంశం', 'కుమారసంభవం' కావ్యాలలోని మొదటి ఆరు సర్గల్ని తెలుగు టీకా తాత్పర్యాలతో ముద్రించారు. ఉపాధ్యాయులతో పని లేకుండా సంస్కృత సాహిత్య పరిచయాన్ని పెంచుకోవటానికి శాస్త్రిగారు చక్కటి ప్రణాళికలతో గ్రంథ ముద్రణ చేశారు. 'హితోపదేశం', 'దశకుమార చరిత్ర'లను తెలుగు అనువాదాలతో ప్రచురించారు. తరువాత 'పంచతంత్రం' మూలాన్ని ముద్రించారు.

వేదం వారు తమ ముద్రణాశాల పక్షాన పారిజాతాపహరణము, బిల్హణీయము, హరిశ్చంద్రోపాఖ్యానము (ద్విపద), బాణాల శంభుదాసుని సారంగ చరిత్ర (ద్విపద), కావ్యాలంకార చూడామణి మొదలైన గ్రంథాలను ప్రచురించారు. చేమకూర వేంకటకవి 'విజయవిలాసము', 'సారంగధర చరిత్ర'లను కూడా ముద్రించారు.

వేదం వారికి శ్రీ వేంకటగిరి మహారాజా శ్రీగోపాలకృష్ణ యాచేంద్ర బహద్దరు వారికి ఎంతో సాన్నిహిత్యం ఉండేది. వేదం వారి మీద, వారి పాండిత్యం మీద రాజా వారికి అపారమైన అభిమానం. అలాగే వేదం వారికి రాజా వారి మీద ఎనలేని గౌరవం. కథా సరిత్సాగరం ముద్రణకు రాజావారు ఆర్థికంగా సహకరించారు. ఆనాటి నుంచి ఒక్కొక్క గ్రంథం ముద్రితమైన వెంటనే రాజా వారికి పంపగా, రాజా వారు ఆయా గ్రంథాల్ని చదివి, సవిమర్శకంగా అభిప్రాయాలు తెలుపుతూ పారితోషికం కూడా పంపేవారు.

ప్రతాపరుద్రీయం రాజావారికి అంకితమైంది. ప్రతాపరుద్రీయ నాటకాన్ని గురించి ఉషా నాటకాన్ని గురించి రాజా వారు విలువైన అభిప్రాయాన్ని ప్రకటించారు. శృంగార నైషధ వ్యాఖ్యను మెచ్చుకుంటూ రాజావారు వేదం వారికి నాలుగువందల రూపాయలు ఇవ్వబోగా, వేదం వారు ఆ పుస్తక ముద్రణకు రేబాల లక్ష్మీ నరసారెడ్డి గారు ఆర్థిక సహాయం చేశారు కాబట్టి, తనకు డబ్బు అవసరం లేదని సున్నితంగా తిరస్కరించబోగా, రాజావారు 'మీరు గురువులు, మేము శిష్యులము. శూన్య హస్తముతో గురుదర్శనము

చేయగూడదని ధర్మమేర్పరిచితిరి. అందువల్ల ఇది ఆచారము జరుపుటగాని యొందు గాదు' అని వేదం వారిని ఒప్పించారు.

రాజావారికి వేదం వారు తమ ఆర్థిక పరిస్థితి తెలుపుతూ విన్నవించుకొన్న తీరుకు స్పందించి రాజా వారు ఆర్థికంగా సహకరించారు. రాజావారికి తమ ఆర్థిక స్థితిని వివరిస్తూ సాహిత్య రచనా ప్రణాళికను కూడా తెలిపారు. అయితే ఈ విన్నపం చేసిన కొద్దికాలానికి రాజావారు ఆకస్మికంగా మరణించడంతో శాస్త్రిగారి సాహిత్య ప్రణాళిక అమలుకు నోచుకోలేదు.

మద్రాసులో ఆర్థికంగా ఇబ్బందుల్లో ఉన్న శాస్త్రిగారిని నెల్లూరి వదాన్యులు ఎంతగానో ఆదరించారు. నెల్లూరు వచ్చిన శాస్త్రి గారికి వయసు మీద పడడంతో ఆరోగ్యం సన్నగిల్లింది. అప్పుడు ఏకైక కుమారుడు మరణించడంతో శాస్త్రి గారు మరింత కుంగిపోయారు. ఆ తరువాత కొంతకాలానికి ఆరోగ్యం కుదుటపడింది.

గద్వాల సంస్థానాధీశులు శ్రీ సీతారామ భూపాలరావు బహద్దరు వారిని శాస్త్రి గారు 1924లో దర్శించగా, ఆ రాజావారు శాస్త్రి గారి పాండిత్యానికి మెచ్చుకుని, తమ ఆస్థానంలో కొంతకాలం ఉంచుకుని ఆరువందల రూపాయలు, బంగారుతోడా, జోడు శాలువాలు బహూకరించారు.

వేదం వారి ఆర్థిక రుణం 1928 డిసెంబరులో నెల్లూరు ప్రాంతపు రెడ్డి వంశజులు తమ వదాన్యం ప్రదర్శించి తీర్చారు. శాస్త్రి గారికి ఆనందం కలిగించారు. శాస్త్రి గారి పట్ల ఎంతో అభిమానాన్ని ప్రదర్శించి వారి ఆర్థిక ఇబ్బందుల్ని తొలగించడంలో ప్రధానపాత్ర వహించిన గునుపాటి యానాదిరెడ్డి గారు వేదం వారికి కనకాభిషేకం చేయాలని తలచారు. కాని ఆ కోరిక తీరక మునుపే శాస్త్రి గారు అనారోగ్యంతో కొంతకాలం బాధపడి 1929 జూన్ 18న 76వ ఏట పరమపదించారు. కనకాభిషేకం కోసం సమకూర్చిన ధనాన్ని కొంత శాస్త్రి గారి రచనల ప్రచురణకు, కొంత శాస్త్రి గారి కుటుంబానికి ప్రదానం చేశారు.

శాస్త్రి గారి రచనలు - ప్రతాపరుద్రీయ నాటకం, ఉషా నాటకం, నాగానందం, ఆంధ్ర సాహిత్య దర్పణము, శృంగార నైషధ సర్వంకషవ్యాఖ్య, ఆముక్తమాల్యదా సంజీవనీ వ్యాఖ్య, శారదాకాంచికలు, ఆంధ్ర గ్రంథ విమర్శన ప్రకారలేశము, భారతా భారత రూపక మర్యాదలు, ఆంధ్ర కథా సరిత్సాగరము, విసంధి వివేకము, విమర్శ వినోదము, రత్నావళి, నన్నెచోదుని కవిత్వము, గ్రామ్యదేశ నిరసనము, స్త్రీ పునర్వివాహ

దుర్వాద నిర్వాపణము, అలంకార సారసంగ్రహము, ఆంధ్రభాషాసర్వస్వార్థ నియమ కతిపయములు, బొబ్బిలి యుద్ధము, శాకుంతలము, ప్రియదర్శిక, మాళవికాగ్నిమిత్రము, తిక్కన సోమయాజి విజయము, ఉత్తర రామచరిత్ర, విక్రమోర్వశీయము, ఆంధ్ర హితోపదేశ చంపువు మొదలగునవి. ●



# వైజయంతీ ముద్రణాలయం

పనప్పాకము ఆనందాచార్యులు (అనంతా చార్యులు) 1843లో చిత్తూరు జిల్లా కడమంచి గ్రామంలో జన్మించారు. తండ్రి శ్రీనివాసాచార్యులు.

ఆనందాచార్యుల గారు ఇంగ్లీషు, సంస్కృత భాషలలో పండితులు. గొప్ప వక్త. ప్రముఖ న్యాయవాది. మొదట్లో కొంతకాలం మద్రాసు పచ్చయప్ప కళాశాలలో అధ్యాపకులుగా పని చేశారు. విక్టోరియా మహారాణి స్వర్ణోత్సవాలలో బ్రిటీషు ప్రభుత్వం వారిచే "రావు బహద్దూర్" బిరుదు పొందారు. మద్రాసులో 'అడ్వకేట్స్ అసోసియేషన్'ను స్థాపించారు. 1891 డిసెంబరు 28న జరిగిన నాగపూర్ కాంగ్రెసుకు అధ్యక్షులు.

ఆనందాచార్యులు తమ అనర్గళ వాగ్ధోరణితో ఇండియా కౌన్సిలును "ఇండియాలో ఉద్యోగము చేయడానికి పనికిరాని భారతీయ పురాణ వృద్ధులతో కూడిన గూడుపుఠాణీ పరిపాలక సంఘము" అని వర్ణించారు. ఆయన అధ్యక్షోపన్యాసము ఉద్రేక పూరితమైనది. "స్వచ్ఛంద సైనికుల విషయమాలోచించండి. ఆర్మీనియనులు, నీగ్రోలు, పశ్చిమాఫ్రికాలోని ములాటోలు, ఫలానా అని వర్ణించడానికివీలులేని తదితర జాతుల వారును కూడా స్వచ్ఛంద సైనికులుగా అంగీకరించబడుతుండగా, భారతీయులు మాత్రం నిరాకరింపబడుతుండిరి. వీరందరును మన వీరశిఖామణులుగాను, మన దేశ సంరక్షకులుగాను భావింపబడుతున్నారా. ఈ అవమానకర విభేదము మన సత్క్రమాందోళనము యొక్క అమోఘశక్తి ముందు అదృశ్యము కాక తప్పదని నా నిశ్చితాభిప్రాయము. అవి బ్రిటీషు న్యాయ సిద్ధాంతమునకు విరుద్ధములు. భారతీయ హృదయ ఫలకములందు చిత్రించబడి, మానవ న్యాయశాస్త్రములన్నింటి కంటెను మిన్నగానుండే ఆ దైవ సిద్ధాంతమునకు కూడా వ్యతిరేకములే." ఆనందాచార్యులు గారు దక్షిణభారత రాజకీయాకాశంలో రెండు దశాబ్దముల పాటు ధృవతారగా

వెలుగొందారు. ఆయనకెపుడూ అనుచరులు లేరు. ఆయనకి ప్రత్యేక తరగతికి చెందిన రాజకీయాభిప్రాయములు లేవు. కాని ఆయన అనర్గళ వాగ్ధోరణి వలన ఆయనకు సుప్రసిద్ధత కలిగింది. పూర్వపుకాంగ్రెసు అధ్యక్ష నాయకులలో అనేకమంది సుప్రసిద్ధులున్నా, వీరివి విభిన్న తత్త్వములు. ఆనందాచార్యుల వారి వాదనలు స్పష్టముగా ఉండేవి. మన పురాతన సంప్రదాయములను ఉదహరిస్తూ ప్రజలను రెచ్చగొట్టేవారు.

ఆనందాచార్యులు గారు 1895లో భారతీయ సామ్రాజ్య శాసనసభలో మద్రాసు ప్రతినిధిగా నియమితులై ఎనిమిది సంవత్సరాలు ఆ పదవిలో ప్రజలకు సేవ చేశారు.

ఆనందాచార్యులు గారు 'వైజయంతీ ముద్రాణాలయం' మద్రాసులో నెలకొల్పి ప్రాచీన కవుల కావ్యాలు తెలుగులో ముద్రించి తెలుగు పాఠకులకు అందుబాటులోకి తెచ్చారు. 'వైజయంతి' అనే సారస్వత మాసపత్రికను నెలకొల్పారు. మంజువాణీ విజయము, విక్రమార్కుని చరిత్ర, పారిజాతాపహరణము, గీతరఘునందనము మొదలగునవి రచించి, ప్రచురించారు. 1909లో మరణించారు. ●



# సరస్వతి గ్రంథమాల

**1876** లో పోలవరం జమీందారు కొచ్చెర్లకోట వేంకట జగన్నాథరావు గారు ఇరువది అయిదవ ఏట మరణించారు. వీరి భార్య కామాయమ్మ. వీరికి సంతానం లేనందున కామాయమ్మ గారు తమ చెల్లెలు కొడుకైన అయిదేండ్ల బాలుడు కృష్ణారావుని దత్తత తీసుకున్నారు. ఆ బాలుడే పెరిగి పెద్దయి రాజా కొచ్చెర్లకోట రామచంద్ర వేంకట కృష్ణారావు పేరుతో పోలవరం జమీని పాలించారు.

కృష్ణారావు గారికి చిన్నతనం నుండి సంస్కృత, ఆంధ్ర భాషల మీద మక్కువ ఎక్కువ. మద్రాసు క్రిస్టియను కళాశాలలో విద్యార్థిగా ఉన్నప్పుడే 1895లో 'ఆంధ్ర భాషోజ్జీవని' అనే సంస్థను స్థాపించి, దానికి ఉపాధ్యక్షులుగా ఉన్నారు. ఆ సంస్థకు పనప్పాకము ఆనందాచార్యులు గారు అధ్యక్షులు. భాషా పాండిత్యంతో సాహితీ వ్యవసాయం సాగించిన కొద్దిమంది తెలుగు జమీందారులలో కృష్ణారావు గారు ఒకరు. ఈయన కవి పండితులనేకమందిని పోషించి, ఆంధ్రభాషకు, సాహిత్యానికి ఎనలేని సేవ చేశారు.

1898లో చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు కృష్ణారావు గారి పేరు మీద, వారి ధన సహాయంతో రాజమండ్రిలో 'సరస్వతి' అనే సాహిత్య పత్రికను ప్రారంభించారు. చిలకమర్తి వారికి దృష్టి దోషం చేత, వారికి ఇష్టమైన గుమాస్తాను నియమించుకోమని జమీందారు గారు సెలవిచ్చారు. కొత్తపల్లి సూర్యారావు గారిని ఆ పనిలో చిలకమర్తి వారు నియమించారు. సూర్యారావు గారు వట్టి గుమాస్తా కాదు, ఆంధ్ర భాషా పరిచయమున్నది. గద్యపద్య కావ్యాలు వ్రాయగలరు. 1899 జూలైలో సరస్వతి పత్రికను జమీందారు గారు కాకినాడకు తీసుకువెళ్ళారు. పత్రికతోపాటు సూర్యారావు గారు కూడా వెళ్ళారు. ఈ పత్రికలో ప్రాచీన కావ్యాలతో పాటు, నవీనమైన నవలలను కూడా ప్రచురించి, 'సరస్వతి గ్రంథమాల' పేరుతో పుస్తకాలుగా వెలువరించారు.

చిలకమర్తి లక్ష్మీనరసింహము, దివాకర్ల తిరపతిశాస్త్రి, కొత్తపల్లి సూర్యారావు గారల తోడ్పాటుతో కృష్ణారావు గారు 'సరస్వతి' పత్రికను ఇరవైఏళ్ళపాటు నడిపారు. ఈ పత్రికలో తాడూరి లక్ష్మీనరసింహము, కొమర్రాజు వేంకట లక్ష్మణరావు, దాసు శ్రీరాములు, తిరుపతి వేంకటకవులు, వడ్డాది సుబ్బరాయకవి మొదలైన ఆధునిక కవుల రచనలే కాకుడా ప్రాచీనులైన శ్రీనాథుడు, మారన, పినవీరభద్రుడు, మట్ల అనంత భూపాలుడు, కందుకూరు రుద్రకవి, దామెర్ల వెంగళ భూపాలుడు, సవరము చిననారాయణ నాయకుడు మొదలైన వారి రచనలు కూడా ప్రచురితమయ్యేవి.

రాజా కృష్ణారావు గారు అపవాద తరంగణి, ప్రభువిశ్వాసము, మిల్లరు దొర వారి జీవితము, రాజతరంగిణి, సాహసిక కథార్ణవము మొదలైన స్వీయ రచనలను ప్రచురించారు. రాజతరంగిణిలో ఎనిమిది తరంగములున్నాయి. ఇది సంస్కృతంలో కల్హణుడు రచించిన రాజతరంగిణికి ఆంధ్రీకరణము.

చిలకమర్తి లక్ష్మీనరసింహం గారి సౌందర్యతిలక; ఎన్. మూర్తిరాజు గారి కాంచనమాల; ధరణీప్రగడ శివరావు గారి భువనమోహన, కొత్తపల్లి సూర్యారావు గారి ఫసానే అజాయబు, ఆతింతాయి, బీర్బల్ వినోదములు మొదలగునవి కూడా సరస్వతి గ్రంథమాల ప్రచురణలు.

రాజా కృష్ణారావు గారు 1871లో జన్మించి, 1919లో మరణించారు. ●



# వెంకట్రామ అండ్ కో.,

ఈదర వెంకట్రావు గారు 1881 మే 7న నెల్లూరు జిల్లా కనిగిరి తాలూకా వైకుంఠపురంలో జన్మించారు. తల్లి లక్ష్మీనరసమ్మ, తండ్రి పట్టాభిరామయ్య. తాత తండ్రులు సంపాదించినది ఏమీ లేదు. బంధువుల సహాయం కూడా లేదు. ఏలూరు పవరుపేటలో ఆచంట గోపాలకృష్ణయ్య పంతులు గారి ఇంట్లో ఉండి, మిషను హైస్కూలులో చదువు. పేదరికపు కష్టాలు అనుభవిస్తూ, కేవలం స్వయంకృషితో ప్రాముఖ్యానికి వచ్చిన వ్యక్తి వెంకట్రావు గారు.

మెట్రిక్యులేషన్ పూర్తిచేయకుండానే 1904లో ఏలూరులో 'రామా అండ్ కో' అనే పేరుతో పుస్తకాల షాపు స్థాపించారు. తరువాత భాగస్తులను కలుపుకున్నారు. 1908 నాటికి వ్యాపారం నిలదొక్కుకుంది. 1928లో భాగస్తుల నుండి విడిపోయి, స్వయంగా 'వెంకట్రామా అండ్ కో', 'వెంకట్రామ పవర్‌ప్రెస్'లను నెలకొల్పారు. 1928లోనే 'ప్రారంభ విద్య' మాసపత్రికను ప్రారంభించారు.

చిన్న చిన్న పాఠ్య పుస్తకాలు వ్రాయించి, వాటిని విద్యాధికారులచేత అనుమతింప జేయడానికి చెన్నపట్నం చుట్టూ తిరిగారు. నానా కష్టాలు పడుతూ, ఎన్ని ఆటంకాలు ఎదురైనా ఉత్సాహం, పట్టుదల విడవకుండా పాతికేండ్లు అనవరత పరిశ్రమ చేసి తెలుగులో గొప్ప ప్రచురణకర్త అనే గౌరవం ప్రతిష్టించుకున్నారు.

వెంకట్రావు గారు పుస్తక ప్రచురణ ప్రారంభించిన రోజులలో తెలుగు పాఠ్య పుస్తకాలు రికగ్నయిజు కావాలంటే భగీరథ ప్రయత్నం చేయవలసి వచ్చేది. ఏ హరిహర అయ్యంగారు పేరుతోనో, ఏ మహమ్మదు హుస్సేను గారి పేరుతోనో వ్రాసి, ఏ మాక్మిలన్ వంటి యూరోపియను కంపెనీనో ప్రచురిస్తే కాని రికగ్నయిజు కావడం అనేది అసాధ్యంగా ఉండేది. విద్యాధికారుల అభిమానం పెద్ద కంపెనీల వైపు ఉండడం చేత, ప్రతి మెట్టు దగ్గరా ఆటంకాలే ఉండేవి. అయినా వెంకట్రావు గారు ఏ మాత్రమూ నిరుత్సాహం పొందకుండా పట్టుదలతో ఆ అడ్డంకులన్నీ అధిగమించి, ఆంధ్ర పాఠ్య పుస్తక ప్రచురణలో ఆంధ్రులకు ఒక స్థానం సంపాదించి, దానిని నిలబెట్టారు. 1948లో వెంకట్రామా అండ్ కో శాఖను విజయవాడలో స్థాపించారు. విద్యా విషయక గ్రంథాలను అసంఖ్యాకంగా ప్రచురించారు. 1953 నాటికి ఆంధ్రదేశంలో 14 పట్టణాలలో వెంకట్రామా అండ్ కో శాఖలను నెలకొల్పారు. వావిలికొలను సుబ్బారావు గారి రామాయణ వ్యాఖ్య 'మందారము', శంకరనారాయణ డిక్షనరీ, విద్యార్థి కల్పతరువు, ఆంధ్ర శబ్ద రత్నాకరము – మూడు భాగాలు, పూర్వ గాథాలహరి మొదలైన ప్రసిద్ధ గ్రంథాలను అనేకం ప్రచురించారు. ఈ రోజుకీ వీరి వెంకట్రామ క్యాలెండరు బహుళ ప్రాచుర్యంగా ఉన్నది.

వెంకట్రావు పంతులు గారు కేవలం ప్రచురణకర్తగా ద్రవ్యార్జన చేయడమే కాకుండా దేశ సంక్షేమం కోసం కొన్ని పనులు చేసి పాలుపంచుకున్నారు. అతిథి అభ్యాగతులకు, పేదలకూ శక్తివంచన లేకుండా సహాయం చేశారు. ఏలూరు మునిసిపల్ సభలో చాలాకాలం సభ్యులుగా ఉండి నగరాభివృద్ధికి పాటుపడ్డారు. ఆంజనేయ దేవాలయం, గోరక్షణ సమితి, అన్నదాన సమాజం, హిందూ యువజన సంఘం, గాంధీ విద్యాలయం మొదలైన స్థానిక సంస్థల నిర్వహణలో ప్రాముఖ్యం వహించి, వాటి పోషణకు ద్రవ్య సహాయం చేసి, తాను చిన్నతనం నుండీ ఉన్న ఏలూరు నగరాభివృద్ధికి పాటుపడ్డారు.

వెంకట్రావు గారి ప్రజాసేవకు కృతజ్ఞతగా నగర పౌరులు వారి పేరుతో 'వెంకట్రావు పేట' అనే నగర భాగం నిర్మించారు. ఆ పేటలో వెంకట్రావు గారు తమ సతీమణి పేరుతో ఒక ప్రాథమిక పాఠశాల స్థాపించారు. పలు పాఠశాలలు స్థాపించి విద్యాభివృద్ధికి పునాది వేశారు. ఆంధ్ర దేశమంతటా ఉన్న తమ పుస్తక విక్రయశాలలో విద్యావంతులైన యువకులకు ఉపాధి కల్పించి నిరుద్యోగ సమస్య కొంత తగ్గించారు.

ఈదర వెంకట్రామయ్య 1931లో శ్రీ వాలిచెర్ల కొండయ్య, సీతమ్మ గార్లకు వాలిచెర్ల గ్రామంలో జన్మించారు. 13వ ఏట ఏలూరు వాస్తవ్యులు ఈదర వెంకట్రావు, సుబ్బమ్మ దేవి దంపతులకు దత్తత వెళ్ళారు ఈదర వెంకట్రామయ్య గారు.

ఈదర వెంకట్రావు పంతులుగారి జీవితం ఆదర్శప్రాయం. పంతులు గారు 1964 మే 12న పరమపదించారు. ●



## ప్రబోధిని ముద్రణాలయం

వడ్డెపాటి నిరంజన శాస్త్రి గారు 1877 అక్టోబరు 14న గుంటూరు జిల్లా తెనాలి తాలూకా దుగ్గిరాలలో జన్మించారు. తల్లి భద్రమ్మ, తండ్రి కోటయ్య.

శాస్త్రి గారు విద్వత్కవి, పత్రికా సంపాదకులు. 'ప్రబోధిని ముద్రణాలయం, నెలకొల్పి గ్రంథ ప్రచురణ నిర్వహించారు. జాన తెలుగులో కవిత్వం చెప్పిన ప్రసిద్ధులు. 1907లో 'ప్రబోధినీ' పత్రికను ప్రారంభించారు. ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర ప్రాంతాలు పర్యటించి శిల్ప గ్రంథాలు సేకరించారు.

కాలజ్ఞాన తత్త్వాలలోని విషయాలను కల్యంధ కౌముదిలో వివరించారు. కుమారాభ్యుదయం సలక్షణమైన తెలుగు నాటకాలలో ఒకటి. పౌరషేయ మహాపురుష

రత్నమాల అసంపూర్ణంగా ఉంది. ఈ కావ్యంలోని కొంతభాగం ప్రబోధినీ పత్రికలో ప్రచురితమైంది. దీనిని మహాకావ్యంగా సవిస్తరంగా రాయాలనుకొన్నారు. పౌరుషేయ శబ్ద విచారము, విశ్వకర్మ త్వష్టలను గురించిన వివరణ, మను మయాదుల వివరణ ఆ పత్రికలో వెలువడింది.

ధర్మపాలచరితంను కొమ్మూరి పిచ్చయ్య దీక్షితులు గారికి అంకిత మిచ్చారు. ఇది రెండాశ్వాసములు వరకు మాత్రమే రచించారు. భీష్మోదయం కూడా అసంపూర్ణం గానే వుంది. దీనిని మునగాల సంస్థానాధీశ్వరులైన రాజా రంగారావు బహద్దరు వారికి అంకితమిచ్చారు. మాఘమాహాత్మ్యము, సూర్యశతకము, సుబ్బరాయ తారావళి మొదలగునవి రచించి, ప్రచురించారు.

నిరంజనశాస్త్రి గారు విశ్వబ్రాహ్మణ సంఘ ఉద్ధరణ కోసం విశేషంగా కృషి చేశారు. వీరి కృషి 'విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము' అనే ప్రామాణిక గ్రంథంగా రూపొందింది.

వడ్డెపాటి నిరంజన శాస్త్రి గారు 1937 అక్టోబరు 17న మరణించారు. వీరి జీవిత చరిత్రను కొండూరి వీరరాఘవాచార్యులు 'నిరంజన విజయం' అని 1938లో రచించారు.

పిఠాపురం మహారాజా రావు వెంకట సూర్యారాయ మహీపతి, మునగాల రాజా నాయని వెంకట రంగారావు, చల్లపల్లి రాజా యార్లగడ్డ అంకినీడు ప్రసాద్, రంగాపురం సంస్థానం మాడపాటి వెంకటేశ్వరరావు పంతులు గారలు ప్రబోధినీ ముద్రణాలయానికి రాజపోషకులు. ●



## ఆంధ్ర భాషా మహా సంఘము

ఆంధ్రభాషా మహాసంఘము 1911 అక్టోబరులో మద్రాసులో '1920 - ఎస్ప్లనేడు - చెన్నపురి' చిరునామాలో స్థాపించబడింది. పిఠాపురం రాజా, వెంకటగిరి రాజాలు ఈ సంస్థకు ఆర్థిక సహాయమందించారు. ఈ సంస్థకు మొదటి నుండి చివరి వరకూ జయంతి రామయ్య పంతులు అధ్యక్షులు. పురాణం నాగభూషణం, వేదం వేంకటరాయశాస్త్రి, ఆచంట లక్ష్మీపతి కార్యదర్శులు. కంచి కృష్ణస్వామి రావు, పిట్టి త్యాగరాయ చెట్టి ట్రస్టీలు. దివాన్ బహద్దర్‌లు, రావు బహద్దర్‌లు మాత్రమే కాకుండా కొక్కొండ వెంకటరత్నం పంతులు, రెంటాల వెంకట సుబ్బారావు, మొక్కపాటి

సుబ్బారాయుడు, వేపా రామేశం, నెమలి పట్టాభి రామారావు, పండిత డి. గోపాలా చార్యులు, వరాహగిరి జోగయ్య, అయ్యదేవర కాళేశ్వరరావు, గురజాడ వేంకట అప్పారావు, రావుసాహెబ్ టి. రాఘవయ్య, మోచర్ల రామచంద్రరావు ప్రభృతులు దీనిలో సభ్యులు.

ఆంధ్ర భాషా మహా సంఘము సూర్యరాయాంధ్ర నిఘంటువుకు బీజావాపం చేసిన సంస్థ. ఇదే అనంతర కాలంలో 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు'గా రూపు దిద్దుకుంది. గ్రాంథిక భాషోద్యమానికి ఈ సంస్థ వెన్నెముకగా నిలిచింది. పాఠ్య గ్రంథాలలో వ్యావహారిక భాష ప్రవేశాన్ని నిరోధించడానికి ఈ సంస్థ కృషి చేసింది. అముద్రిత గ్రంథాల ప్రచురణ, భాషా సాహిత్యసేవ ముఖ్య ఆశయాలు.

ఈ సంస్థ 'జర్నల్ ఆఫ్ ది తెలుగు అకాడమీ' అనే పత్రికను నడిపింది. తరువాత కాకినాడకు మారినప్పుడు 'ఆంధ్ర సాహత్య పరిషత్పత్రిక' అని పేరు పెట్టారు. పరిశోధనా వ్యాసాలకు, శాసనాల ప్రకటనకూ ఈ పత్రిక ప్రామాణికంగా పేరు పొందింది. అనేక అముద్రిత గ్రంథాలు ఈ పత్రిక ద్వారా వెల్లడి అయినాయి. మల్లికార్జున పండితుని శివతత్త్వ సారము, రాయవాచకం, శాసన పద్యమంజరి మొదలగు గ్రంథాలు ఈ పత్రిక ద్వారా ముద్రించారు. ప్రాచీన తాళపత్ర గ్రంథాలు, శాసనాలు, కావ్యవిమర్శలు, సమీక్షలు, పీఠికలు, శబ్ద చర్చలు, కవిత్వ లక్షణ వివేచనము, ఇతర భాషా సాహిత్యాలకు సంబంధించిన వ్యాసాలు ఈ పత్రికలో చోటు చేసుకున్నాయి. కొన్నాళ్లు త్రైమాసిక పత్రికగా వెలువడింది. జయంతి రామయ్య శతజయంతి సంచిక, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి స్మారక సంచిక వంటి ప్రత్యేక సంచికలు కూడా దీని తరఫున వెలువడ్డాయి.

నిఘంటు నిర్మాణంలో, శాస్త్ర పారిభాషిక పద నిర్ణయంలో, పుస్తక భాండాగార నిర్వహణలో, సాహిత్య సభల నిర్వహణలో ఆంధ్ర సారస్వత పరిషత్తు అపూర్వమైన సాహిత్యసేవ చేసింది. వ్యావహారిక భాషోద్యమాన్ని ఆహ్వానించకపోవడం, పోషకులు మరణించడంతో సంస్థ నిలబడలేకపోయింది.

ప్రస్తుతం ప్రభుత్వ నిర్వహణలో శాసనాలు, తాళపత్ర గ్రంథాలు, ముద్రిత గ్రంథాలు భద్రపరిచిన కాకినాడలోని ఆంధ్ర సాహిత్య పరిషత్తు నేటికీ పరిశోధకులకు చాలా ఉపకరిస్తున్నది. ●



# శ్రీ రామ విలాస గ్రంథమాల

చెలికాని లచ్చారావు గారు 1885 మే 24న తూర్పుగోదావరి జిల్లా పిఠాపురం తాలూకా చిత్రాడలో జన్మించారు. తల్లి రమణయాంబ, తండ్రి భావనారాయణిం గారు. లచ్చారావు గారు రచయిత, సాహిత్య పోషకులు, పత్రికా స్థాపకులు. ఎర్నగూడెం, గౌరీపట్నం ఎస్టేట్లకు అధిపతి. సంస్కృతం, ఇంగ్లీషు భాషలలో మంచి ప్రావీణ్యమున్నది. 'ఆంధ్ర భాషా విలాసిని' అనే సాహిత్య మాసపత్రికను స్థాపించారు. గ్రంథాలయ సర్వస్వం వంటి పత్రికలకు పోషకులు. ఆరు వేలకు పైగా గ్రంథాలను, తాళపత్ర గ్రంథాలను సేకరించి ఒక ఉత్తమ గ్రంథాలయాన్ని నెలకొల్పారు. వీరి సాహిత్య పరిశ్రమకు వీరి సోదరి వీరవరం జమీందారిణీ అయిన రాణీ రామాయమ్మారావు బహద్దరు వారి సహకారం ఉండేది.

చిత్రాడలో 1912 ప్రాంతంలో చెలికాని లచ్చారావు గారు 'శ్రీరామ విలాస గ్రంథమాల' అనే ప్రచురణ సంస్థను స్థాపించారు. భాషాభివృద్ధిని కోరి గ్రంథ ప్రచురణ చేపట్టిన సంస్థ. ప్రాచీన ఆధునిక సాహిత్య ప్రగతికి తోడ్పడిన సంస్థ. భాషా మర్యాదలను పాటించే రచనలు, పాఠకులకు భాషా జ్ఞానాన్ని పెంపు చేసే గ్రంథాలు మూడు నెలలకు ఒకటి చొప్పున ప్రచురించేది. పానుగంటి లక్ష్మీనరసింహం గారు, కూచి నరసింహం గారలు ఈ సంస్థ వ్యవస్థాపక వర్గంలో ఉండేవారు.

లచ్చారావు గారు రచించిన స్త్రీ నీతి పద్యరత్నావళి, వంగూరి సుబ్బారావు గారు రచించిన ప్రభాతము అనే నవల ఈ సంస్థ తొలి ప్రచురణలు. వంగూరి సుబ్బారావు గారి రచనలు - ప్రభాతము, ఆంధ్ర వాఙ్మయ చరిత్రము, జాహ్నవీ మాహాత్మ్యము, మిత్రావిందా పరిణయం, రంగరాథ రామాయణోత్తరకాండము, వాల్మీకి చరిత్రము, విజయానంద విలాసము, సీమంతినీ కళ్యాణము మొదలగునవి; మరియు చెలికాని లచ్చారావు గారి రచనలు - భీష్ముని జీవిత చరిత్రము, ఆధునికాంధ్ర కవి చరిత్రము, భగవద్గీతామృతబిందువు, రామరాయ ఖండనము, స్త్రీ నీతి పద్యరత్నావళి, మల్లెమొగ్గలు, కురంగము, విద్యావంతుని ధర్మములు, ప్రేమలత, ఐరోపా మహా సంగ్రామము - కలహకారణములు మొదలగునవి రచించి, ప్రచురించారు.

చెలికాని లచ్చారావు గారి జీవిత చరిత్రను చెలికాని సూర్యారావు గారు 'శ్రీ చెలికాని లచ్చారాయ జీవిత చరిత్రము - నిర్యాణస్మృతి - ప్రకటిత గ్రంథములు' అనే పేరుతో ప్రకటించి తల్లి రమణయాంబకు అంకితమిచ్చారు. ●



# విజ్ఞానవర్ధినీ పరిషత్తు

తెలంగాణమున తెలుగు రచయితలు లేరను అపప్రధను ఖండించడానికి హైదరాబాదులో సురవరం ప్రతాపరెడ్డి గారు 1914 నవంబరు 27న గోలకొండ పత్రిక కార్యాలయంలో 'విజ్ఞానవర్ధినీ పరిషత్తు'ను ప్రారంభించారు. ప్రారంభం నుండి రెండు సంవత్సరాలపాటు రెడ్డిగారే కార్యదర్శిగా ఉండి కార్యకలాపములను కొనసాగించారు. తరువాత చెలమచర్ల రంగాచార్యులు గారిని కార్యదర్శిగా ఎన్నుకున్నారు. ఆ తరువాత కేశవపంతుల నరసింహశాస్త్రి గారు కార్యదర్శిగా నియమింపబడి 1952 వరకు ఆ పని నిర్వహించారు.

చెలమచర్ల రంగాచార్యులు, కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, కేశవపంతుల నరసింహ శాస్త్రి, మాడపాటి హనుమంతరావు, బి.వి. రమణారావు, చిదిరెమఠం వీరభద్ర శర్మ, పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి, బిరుదురాజు రామరాజు వంటి మహామహులు విజ్ఞానవర్ధినీ పరిషత్తు సభ్యులు. ఏడు చక్కని పుస్తకరాజములను ప్రచురించి తెలుగుభాషామ తల్లికి సేవ చేశారు.

మృత్యు సిద్ధాంతము, రామాయణ విశేషములు, అలంకార వసంతము, ప్రతాపరుద్ర యశోభూషణము, గంగాపుర మాహాత్మ్యము, ఆంధ్రలిపి సంస్కరణము, యువజన విజ్ఞానము మొదలగు గ్రంథాలు పరిషత్తు స్థాయిని, స్తోమతను చాటి చెప్పాయి.

దురదృష్టవశాత్తు సురవరం ప్రతాపరెడ్డి గారి మరణం తరువాత పరిషత్తు కార్యకలాపములు నామమాత్రమైంది. తగిన ఆదరణ, పోషణ, ఆలంబన లేకుండా ఉండే ఎలాంటి పెద్ద సంస్థలైనా పతనం కాక తప్పదు. ●



# ఆఖ్యాయికా పరంపర గ్రంథమాల

తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి (స్వామి, సభాపతి) 1892 సెప్టెంబరు 12న గుంటూరు జిల్లా కాజ గ్రామంలో జన్మించారు. తల్లి లక్ష్మీదేవి, తండ్రి కృష్ణశాస్త్రి. భావకవి, భావకవులకు ఆచార్యత్వం వహించి 'సాహితీసమితి' ఏర్పాటు చేశారు. సాహితి పత్రిక సంపాదకులు. కన్నడం, తమిళం, మళయాలం, గుజరాతీ, ఉర్దూ, పార్శీ, జర్మనీ, మరాఠీ, బెంగాలీ, పాళీ, ప్రాకృతం, సంస్కృతం, ఫ్రెంచ్, లాటిన్

మొదలైన భాషలలో కూడా ప్రావీణ్యమున్నది. సహాయ నిరాకరణోద్యమంలో జైలుశిక్షలు అనుభవించారు. సాహితీసమితి సభ్యులను ప్రోత్సహించి ప్రాచీన, నవీన రీతులకు సమన్వయ మార్గం చూపారు.

శివశంకరశాస్త్రి గారు నవ్యసాహిత్య పరిషత్తు స్థాపనకు మూలకారకులు. సఖి త్రైమాసిక పత్రిక సంపాదకులు. రామవిలాస సభ అనే నాటకసభకు దర్శకులుగా ఉండి నాటకకళలో నవ్యరీతులు ప్రవేశపెట్టారు. రాజమండ్రి సరస్వతీ గ్రంథమండలి గౌరవ సంపాదకులు. కంతేరు దగ్గర మహేశ్వరాశ్రమం స్థాపించారు. అస్పృశ్యతా నివారణకు ఏర్పాటైన శ్రీ కృష్ణాశ్రమానికి ఆధ్వర్యం వహించారు. తెలుగు భాషా సమితి సంపాదకవర్గములోను, కేంద్ర సాహిత్య అకాడమీ తెలుగు విభాగంలో సభ్యులు. వీరు బాల వాఙ్మయంలో కూడా కృషి చేశారు. చాలా బెంగాలీ నవలలను తెలుగులోకి అనువదించారు.

శివశంకరశాస్త్రి గారు ప్రకాశంజిల్లా ఒంగోలులో 1914లో 'ఆఖ్యాయికా పరంపర గ్రంథమాల' అనే ప్రచురణ సంస్థను స్థాపించి, అనేక రచనలు ప్రకటించారు. నవ్య సాహిత్యానికి, అనువాద వాఙ్మయానికి ప్రచారం కలిగించడం దీని ముఖ్య ఉద్దేశం. 'రఘునాథజీ' అనే నామాంతరము గల 'మహారాష్ట్ర జీవన ప్రభాతము' ఈ గ్రంథమాల మొదటి ప్రచురణ. శాస్త్రిగారు బెంగాలి నుంచి అనువదించిన కొన్ని నవలలను ఈ గ్రంథమాల ద్వారా ప్రచురించారు. 1915లో ఈ గ్రంథమాల 'ఆఖ్యాయిక' అనే మాసపత్రికను వెలువరించింది.

శాస్త్రి గారి రచనలు–రాజ జామాత, పద్మావతీ చరణ చారణ చక్రవర్తి, హృదయేశ్వరి, కథా సరిత్సాగరం, నీలకంఠ కథలు, వకుళమాలిక కావ్యావళి, రమాసుందరి, రత్నాకరము, దీక్షిత దుహిత, శివశంకర కృతులు - మూడు భాగాలు, సంస్కృత వ్యాకరణ దర్శన చరిత్ర, జాతక కథలు, కాంచనమాల, జీవన ప్రభాతము, తేజసింగు, కుంకుమభరిణి, భిక్షుకి, ఆవేదన, ఫలితకేశము, నోణకజాయ, సాధకుడు, వ్రతభంగం, కావ్యావళి, నాలోని మార్పు అనే స్వీయచరిత్ర రచించి ప్రచురించారు. తల్లావఝల శివశంకరశాస్త్రి 1977 ఏప్రియల్ 2న మరణించారు.

శివశంకరశాస్త్రి గారి రచనలు కొన్ని పోతుకూచి సుబ్రహ్మణ్యం గారు 'ద ఫస్ట్ లుక్ అండ్ అదర్ పోయెమ్స్' అనే పేరుతో ఇంగ్లీషులోకి అనువదించారు. 'ద మైండ్ అండ్ ఆర్ట్ ఆఫ్ శివశంకర శాస్త్రి' అనే గ్రంథం రచించారు. రాచకొండ నరసింహమూర్తి గారు హిందీలో 'శివశంకర కార్యదర్శన్' అనే సమీక్షాకృతి రచించారు. ●



# కళాభివర్ధనీ పరిషత్తు (గ్రంథమాల)

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు 1891 ఏప్రియల్ 23న తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకా పోలమూరు గ్రామంలో జన్మించారు. తల్లి మహాలక్ష్మి సోదెమ్మ, తండ్రి లక్ష్మీపతి సోమయాజులు.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారి కోరిక - 'గజం ఎత్తు దొంతి' లాగా తాను రచించిన, ప్రచురించిన పుస్తకాలు వెలువడాలని.

రాజమండ్రిలో శ్రీపాదవారు - మల్లిడి సత్తిరెడ్డి గారు, చెన్నుభొట్ల పెద సత్యనారాయణ గార్లతో కలిసి ఎస్.పి.ఏ.ఎల్. (సొసైటీ ఫర్ ది ప్రమోషన్ ఆఫ్ ఆంధ్రా లిటరేచర్) అనే ప్రచురణ సంస్థను స్థాపించారు.

శాస్త్రిగారి రచన, రెడ్డిగారి పెట్టుబడి, సత్యనారాయణ గారిది మార్కెటింగ్. కాపీరైట్ రచయితది. సత్యనారాయణ గారు చాలా షరతులు విధించారు. ప్రతి గ్రంథము రెండువేల కాపీలు ప్రచురించాలి. అమ్మకం మీద నూటికి ముప్పై రూపాయల కమీషను ఇవ్వాలి. ఆఫీసులో అమ్మే పుస్తకాలకు డిస్కౌంట్‌తో ఇచ్చే పుస్తకాలకు, కాంప్లిమెంటరీగా వెళ్ళిన పుస్తకాలకు సైతం వారికి మాత్రం కమీషను ఇవ్వాల్సిందే. సత్యనారాయణ గారు ఊరూరు తిరిగి అమ్మాలి. సోల్ డిస్ట్రిబ్యూటర్, సెల్లరూ, ట్రావెలింగ్ ఏజెంటు కూడా. చెన్నుభొట్లవారు పేచీకోరు. శ్రీపాద వారికీ, ఆయనకీ పడేది కాదు. ట్రావెలింగ్ ఏజెంట్ అనకూడదు, 'ట్రావెలింగ్ ఇనెస్పెక్టరు' అనాలి అన్నాడాయన. శాస్త్రి గారు రాజమండ్రిలో కార్యాలయం నిర్వహించాలి, నిభాయించాలి. దానికి నెలకి కొంత వరుమానం ఉంటుంది. చాలా విపులంగా నియమావళి రాసుకున్నారు. ఒకవేళ పుస్తకాలు అమ్ముడు కాకపోతే, పుస్తకాలను రెడ్డి గారు, శాస్త్రి గారు చెరిసగం పంచుకోవాలి.

ఆఫీసు ప్రారంభించాక చెన్నుభొట్లవారు వింత వింత షరతులు, అవసరాలు విధించారు. తాను గ్రామాలలో పర్యటించేప్పుడు, జనాన్ని ఆకర్షించడానికి ఒక బిళ్ల బంట్రోతు కావాలి. అమ్మకాలు సాగితే తన వద్ద డబ్బు ఉంటుంది కనక, రక్షణ కోసం తన దగ్గర ఆరుగుళ్ల పిస్తోలు కావాలని - రివాల్వర్ లైసెన్సు కోసం, బంట్రోతు బ్యాడ్జీ కోసం ఆయన కలెక్టరు గారికి అర్జీ కూడా పంపించాడు.

మొదటి పుస్తకం 'మిథునానురాగం' ప్రింట్ అయింది. ఖాకీ యూనిఫారమ్‌తో, మొలలో ఆరుగుళ్ల రివాల్వరుతో, అచ్చం పోలీసు సబినస్పెక్టరు వేషంలో చెన్నుభొట్లవారు,

ఖాకీ దుస్తులతోనే ఉన్న 'దలాయత్తు'తో పుస్తకాల కట్టలు పట్టుకుని ఒక రెడ్డి యువకుడు వెంటరాగా - మిథునానురాగాన్ని గ్రామగ్రామాల్లో అమ్మేశారు. మరల రెండువేల కాపీలు వేశారు. రెండో నవల 'శ్మశాన వాటిక' వెలువడింది.

చెన్నుభొట్ల వారు ఇనస్పెక్టరు దొరలా రాత్రి ఎనిమిది గంటలకు రివాల్వర్ పేల్చేవారు. మరి పిట్ట కూడా ఆయన ఉన్న గడప తొక్క కూడదు. తిరిగి ఉదయం ఎనిమిది గంటలకు దొరగారు రివాల్వర్ ధామ్మని పేల్చాకనే ఎవరైనా నవలల కోసం రావాలి. అలా ఎస్.పి.ఏ.ఎల్. ధామ్మయిపోయింది.

శాస్త్రి గారు ఆయుర్వేద వైద్యులు. అనేక ఆయుర్వేద గ్రంథాలు రాశారు. గణేశ్ ఫార్మసీ అని మందుల వర్తకం చేయబోయి, చేతులు కాల్చుకున్నారు. దాంతో ఆయన కలం పట్టి సాహిత్యానికి అంకితమయ్యారు.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు చిన్నకథల రచనలో, నాటికా నాటకాల రచనలో, పత్రికా సంపాదకత్వంలో ప్రసిద్ధి, సంఘసంస్కరణాభిలాష, ప్రగతిశీలత వీరి రచనలలో కనిపిస్తుంది.

జయపురం సంస్థానాధీశులు విక్రమదేవవర్మ గారు శాస్త్రి గారిని ఇతోధికంగా ఆదరించారు. శాస్త్రి గారు 'కళాభివర్ధనీ పరిషత్తు' పేర ప్రచురణ సంస్థ నెలకొల్పి, తమ రచనలను ప్రచురించారు. శాస్త్రి గారు 1916 నుంచి 1920 వరకు కళాభివర్ధనీ నాటక సమాజం నడిపించారు. వివిధ నాటకాలలో స్త్రీ, పురుష పాత్రలు ధరించారు.

1921లో 'ప్రబుద్ధాంధ్ర' పత్రికను స్థాపించి, తమ ఆశయాలు, సిద్ధాంతాలు ప్రచారం చేశారు.

ప్రేమపాశము, నిగళబంధనము, రాజరాజు, కలంపోటు, వీరపూజ, పునాది రాయి, చాణక్య శపథము, మహాభక్త విజయము, వీరాంగనలు, రామదేవ విజయము, లక్ష్యసిద్ధి, సాహసిక రాజపుత్రము, నీతిమంజరి, కర్ణ వధ, ఊరుభంగము, ఆత్మబలి, బొబ్బిలి యుద్ధము, రక్షాబంధనము, పాణిగ్రహిత, శ్రవణానంద శృంఖల, శ్రీమద్రామ యణము, అభిసారిక, అత్త-అల్లుడు, అనుభవాలు-జ్ఞాపకాలు (2 భాగాలు), గీతామంజరి, విషభుజంగము, ఆత్మబలి, అలంకృత మొదలగునవి రచించి కళాభివర్ధనీ పరిషత్తు గ్రంథమాల ద్వారా ప్రచురించారు.

చిన్నకథలు 12 భాగాలు అద్దేపల్లి అండ్ కో, రాజమండ్రి వారు ప్రచురించారు. ఓ రోజున శ్రీపాదవారు పురిపండ అప్పలస్వామిగారికి జాబు వ్రాస్తూ -

"పురిపండ అప్పలస్వామి గారికి!

ఇవాళ తెల్లవారేటప్పటికి నాకివాళ పక్షవాతం సందేహం కలిగింది. మీరు హైదరాబాదు నుంచి ఎప్పుడు వస్తారు ?

నాగేశ్వరరావు గారికి (అద్దేపల్లి అండ్‌కో) కథలు పుస్తకాలు ఇచ్చెయ్యదలచు కున్నాను. వెనుక ఒక మాటు వారు పేజీకి మూడు రూపాయల చొప్పున బేరం చేసి స్థిరపరచుకున్నారు. నేను కథలు పట్టుకు వెళ్ళి ఇవ్వబోతే, డబ్బులేదు ఇప్పుడు వద్దన్నారు. ఆ బేరం మొన్న జ్ఞాపకం చేశాను. నిజమే అప్పుడు డబ్బు లేకపోయిం దన్నారు. ఇప్పుడు ఆ రేటున పైసలు చెయ్యండి. కుదరకపోతే మీ ఇష్టం వచ్చినట్లు పైసలు చేయండి. తక్కిన పుస్తకాలున్నూ ఇప్పించేయండి. వారికి నాలుగువేల చిల్లర నేను బాకీ. నవలలు, నాటికాలు వగైరా కాపీరైట్లూ, స్టాకు అంతా ఇప్పించండి. మీకు సాధనమైన ధరకు ఇప్పించి ఋణం లేదనిపించి అదనంగా ఇస్తే, అది నా భార్య చేతికి ఇవ్వండి. నా కుటుంబానికి మీరే సాయం చెయ్యగలరు. కథలు సాపు రాసి ఉన్నాయి, పేపరు కటింగులున్నాయి. ముందు చికిత్సకూ, తిండికి డబ్బు కావాలి. ఇప్పించండి. ఈ నెల ఇంకా అద్దె ఇవ్వలేదు.

పుస్తకాల వ్యవహారం పూర్తిగా పరిష్కరించి మరీ వెళ్ళాలి మీరు. అనుభవాలు - రెండు విశాఖపట్నం పంపాలి, పోషకులకూ తక్కినవారికీ. రాజమండ్రిలో- మైలవరపూ, వింజమూరీ; రామచంద్రాపురంలో - దువ్వూరి, చావలీ, వేపావారికి మాత్రమే ఇచ్చాను. వేపా వారు రు. 116/- లు ఇస్తానన్నారు. ఇప్పుడే కొంత ఇవ్వవచ్చు. కాకినాడ సాహితీవేత్త గారంటే శ్రీ పార్థసారథి గారు. వారికి నా యెడ చాలా దయ. మీరు చెబితే నాకు గాని, నా కుటుంబానికి గాని వారేమైనా సాయం చేసి చేయించవచ్చు.

నా కుటుంబ చెట్టు క్రింద వుంది. మీరు సాయం చెయ్యండి. విశాఖలో కూడా ఏమైనా వీలవుతుందేమో చూడండి.

గుంటూరులో చావలి సూర్యనారాయణ గారు (ILTD లేబరు ఆఫీసరు) రు. 66/- లు ఇవ్వాలి, ప్రయత్నం చెయ్యండి. వారు రామచంద్రాపురం గాంధీ డాక్టరుగారి అన్నగారు. డాక్టరు గారి ద్వారా ప్రయత్నించండి. డాక్టరు గారున్నూ రామచంద్రాపురం మిత్రులచేత ఏమైనా చేయించవచ్చు. నెల్లూరి శివరామయ్య గారేమైనా పంపవచ్చు. డాక్టరు కనకరాజుగారూన్నూ చెయ్యవచ్చు.

శ్రీ నాగేశ్వరరావు గారి విషయం - వారికి అభ్యుదయం నా చేతనైనంతా కలిగించాలనుకున్నాను. భగవంతుడిలా చేశాడు. నేను వ్యర్థుణ్ణయి పోయాను. స్నేహితులైనందుకు మీకీ శ్రమ మాత్రం కలిగిస్తున్నాను.

నాగేశ్వరరావుగారి వ్యవహారం మీరే పరిష్కరించడం నా ఆశ. మీరు మిక్కిలీ ఘనంగా సన్మానించారు. మీకు శ్రమ మాత్రమే కలిగించాన్నేను. శ్రీ సింహాచలంగారి స్నేహం నాకు మహామేరువు. వారికి నా కృతజ్ఞత సరిగా చూపించలేకపోయాను.

మీకు నేను బరువైనట్టే నిశ్చయం. మీలాగ మనసిచ్చినవారు నాకు మరొకరు లేరు. మీ ఋణం తీర్చుకోలేను. అది తీర్చుకోడానికైనా మరోజన్మ యెత్తుతాను. ఒకటి కాదు, పది, వంద ఎత్తుతాను. ఒక సామాన్యుడికి మీరూ, సింహాచలంగారూ కనకాభిషేకం చేయించారు. ఇది నాకు పరమేశ్వరుడు చేయించలేనిది.

ఇలాంటి స్థితిలో నేను భారం అయిపోతున్నాను. విచారించను. అది తీర్చుకోవడానికైనా మరో జన్మ యెత్తుతాను కనుక నాకేమీ విచారం లేదు. నా భార్య నన్నేక విధాల కాపాడింది. చిన్నప్పణ్ణుంచి దాన్ని కష్టపెట్టాను గాని సుఖపెట్టలేక పోయాను. ఇప్పుడు ఇక ఆ వూసే లేదు కదా!

నిరర్థక జన్మ అయిపోయింది నాది. రచనలయినా సమర్పించుకోలేకపోయాను. పరమేశ్వరుడు మీకు సకల సుఖాలూ కలిగించాలి. మీ కలం జాతిని ఉద్ధరిస్తుంది.

మీ

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

శాస్త్రిగారికి పక్షవాతం రాగా, వారి కోరిక మేరకు వారి రచనల కాపీరైటు పురిపండా అప్పలస్వామి గారి ఆధ్వర్యంలో అద్దేపల్లి అండ్‌కో వారికి అమ్మి వైద్యానికి, ఋణాలు తీర్చడానికి పంచారు. శాస్త్రి గారు 1961 ఫిబ్రవరి 25 న మరణించారు. ●



# ఇతిహాస తరంగిణీ గ్రంథమాల

**చి**లుకూరి వీరభద్రరావు గారు 1872 అక్టోబరు 17 న పశ్చిమగోదావరి జిల్లా తణుకు తాలూకా రేలంగి గ్రామంలో జన్మించారు.

చరిత్ర పరిశోధకులు, భాషాకోవిదులు, సంస్కర్త. దేశోపకారి, విభుదరంజని, ఆంధ్ర దేశాభిమాని పత్రికలు నడిపారు. ఆంధ్రకేసరి పత్రికకు కొంతకాలం సంపాదకులు. సత్యవాదిని పత్రికలో పని చేశారు.

ఆంధ్రుల చరిత్రను పది సంపుటాలుగా రాయాలనుకున్నారు. ఆంధ్రుల చరిత్ర మొదటి భాగము, రెండవ భాగము కొమర్రాజు వెంకట లక్ష్మణరావు గారి నేతృత్వంలో 'విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి'లో ప్రచురించడం జరిగింది. తరువాత వీరభద్రరావు గారికి విజ్ఞాన చంద్రికా గ్రంథమండలితో విభేదం ఏర్పడింది. అప్పుడు వీరభద్రరావు గారు రాజమండ్రిలో మిత్రుల సాయము, సహకారంతో 1916లో 'ఇతిహాస తరంగిణీ గ్రంథమాల' ను స్థాపించారు. సత్యప్రకటనమే సత్పరిశోధక లక్షణమని నమ్మి తమ ఆస్తినీ, ఆరోగ్యాన్నీ, ప్రాణాలనూ అందుకు ధారపోశారు. వాదోపవాదాలలో వీరి కలం జంకుగొంకులు లేక విలయతాండవం చేసింది.

ఆంధ్రుల చరిత్ర - మూడు, నాలుగు, అయిదు భాగాలు; కర్ణసామ్రాజ్యము, నాయకురాలి దర్పము, తిమ్మరుసు, తిక్కన సోమయాజి, శ్రీనాథకవి, ఆళియ రామరాయలు, స్వయం సహాయం, శివాజీ చరిత్ర, జీర్ణకర్ణాట రాజ్య చరిత్రము, హాస్య తరంగిణి, ఆంధ్రరాజ్య యుగచరిత్ర, కల్లూరి వేంకట రామశాస్త్రి గారి జీవిత చరిత్ర మొదలగునవి రచించి, ప్రచురించారు.

వీరభద్రరావు గారు ఆంధ్రుల చరిత్ర అయిదవ సంపుటమును కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గారికి అంకితమిచ్చారు. 'స్వయం సహాయం' ఇంగ్లీషులో 'స్మైల్' రచించిన గ్రంథానికి అనువాదం.

చిలుకూరి వీరభద్రరావు గారు 1939 మే నెలలో మరణించారు. ●



# మత సాహిత్య వర్ధని సంఘము

రెబ్బాప్రగడ మందేశ్వర శర్మ గారు గోదావరి జిల్లా కాంగ్రెసు ప్రముఖులలో ఒకరు. సెకండరీ విద్య దశలో చదువుకు స్వస్తి చెప్పి, గాంధీజీ ప్రభావానికి లోనై దేశసేవ చేయాలని తలచారు.

రాజమహేంద్రవరం (రాజమండ్రి) నుండి 1919లో కొవ్వూరుకు మకాం మార్చారు. ఆ రోజుల్లో మతగ్రంథాల ప్రచారము సరిగా లేదని 'మత సాహిత్య వర్ధని సంఘము' పేరుతో ఒక సంఘం స్థాపించి, మత గ్రంథాల ప్రచురణకు కృషి చేశారు.

దేశ స్వాతంత్ర్యం నిమిత్తం మహత్తర త్యాగాలొనర్చిన వీరుల చరిత్ర, వారి చిత్ర పటములు ఒకచోట చేర్చి 'వీర సంస్మరణ మందిరము' అనే దాన్ని 1942 ఏప్రియల్ 22న స్థాపించి, దేశభక్త కొండా వెంకటప్పయ్య చేత ప్రారంభోత్సవం చేయించారు. ఆ మందిరములో ఆంధ్ర దేశమంతటి నుంచీ స్వాతంత్ర్య వీరుల చిత్రపటములు అనేకం లభించినంత వరకు తెప్పించి నెలకొల్పడమే కాకుండా, శర్మ గారు 'అఖిలాంధ్ర వీర సంస్మరణ కుసుమాంజలి' అను 215 పేజీల గ్రంథము ప్రకటించారు. అఖిల భారతదేశంలో ఇలాంటి ప్రయత్నం ఇదే ప్రధమము.

వివిధ దేశ సమస్యల గురించి రెబ్బాప్రగడ మందేశ్వర శర్మ గారు - భారత వస్త్ర పరిశ్రమ చరిత్ర, రీసెటిల్‌మెంట్ విధానమేవిధముగా అక్రమము, జమీన్ రైతు సమస్యలు, , రాజ్యాంగ వివేక టిపికం, నేటి రాజ్యాంగ స్వరూపము (1935 రాజ్యాంగ చట్టమును గురించి వివరణ), వీర సంస్మరణ కుసుమాంజలి, శ్రామిక ధర్మరాజ్యము (3 భాగాలు), శ్రామిక ధర్మ రాజ్య (ఇంగ్లీషులో మూడు భాగాలు), 136 సంవత్సరాల జమీందారీ క్రింద (ఇంగ్లీషు), స్టేపీడర్డ్ సొసైటీ (ఇంగ్లీషు), శ్రామిక ధర్మరాజ్య ఎందుకు - ఏమిటి - ఎందుచేత (ఇంగ్లీషు) మొదలగునవి రచించి, ప్రచురించారు. ●



# సాహితీ సమితి

1920లో 'రవికిరణ్ మండల్' మహారాష్ట్ర కావ్యక్షేత్రం మీద ఆధిపత్యం వహించింది. మహారాష్ట్ర మంతటా కవులు విశేషంగా కావ్యపఠనం చేయడం వలన వారి కవిత్వం విస్తారంగా చలామణీ అయింది. రవికిరణ మండల్ సభ్యుల సంచార ప్రచారాలు, కావ్యపఠనములో వారు కనబరిచిన ప్రయోగకౌశలం పాఠకులలో విపరీతమైన ఉత్సాహాన్ని ప్రేరేపించాయి. 1920 ప్రాంతంలోనే బి.యం. శ్రీకంఠయ్య, డి.వి. గుండప్పల ఆధ్వర్యంలో తలిరుగుంపు; గోవిందపాయ్ మార్గదర్శకత్వాన మంగుళూరులో 'మిత్రమండలి'; బేంద్రే నాయకత్వాన ధార్వారులో గెలియర గుంపు ఆధునిక కన్నడ సాహిత్య ఉజ్జీవనానికి దోహదం చేశాయి.

ఇటువంటి సాహిత్య చైతన్యానికి కొంచెం ముందు 1919లో తెలుగు సాహిత్య ఉజ్జీవనానికై తల్లావఝల శివశంకరశాస్త్రి కొందరు సాహిత్య సమారాధకుల్ని

సమీకరించుకుని తెనాలిలో 'సాహితీ సమితి' అవతరణకు ముఖ్య కారకుడై, కొన్ని దశాబ్దాలు దానికి సారథ్యం వహించి, నవ్యసాహితీ వికాసానికి ఎనలేని సేవ చేసి 'సభాపతి' అనిపించుకున్నారు. ఒకరి నొకరు తిట్టుకునే సంప్రదాయానికి చెందిన తెలుగు కవులు వీరి స్నేహ ప్రభావముల మూలమున తిట్టుకొనుట మాని, తమ తమ రచనలలో నిమగ్నులైనారు. ధనవంతుల నాశ్రయించి, వారికి ప్రీతికరమైన రీతులలో కవనమల్లే కవి తన సౌందర్య దర్శనోత్సాహాన్ని, తన బాధను, తన నిర్వేదాన్ని వస్తువుగా చేసి కావ్య రచన చేశాడు. నవ కవిత్వానికి ధ్యేయము ఏర్పడింది.

శివశంకరశాస్త్రి, చింతా భీమశంకరం, కొడవటిగంటి వేంకటసుబ్బయ్య, నోరి నరసింహశాస్త్రి, చింతా దీక్షితులు, త్రిపురారిభొట్ల వీరరాఘవస్వామి, పెద్దిభొట్ల పూర్ణశర్మ, వజ్ఝల బాబూరావు, కొమ్మూరి హనుమంతరావు, కోపెల్ల శివకామేశ్వరరావు, చామర్తి రాజశేఖరరావు, కొత్తపల్లి సుబ్బన్నాచార్యులు మొదలైన సాహితీప్రియుల కలయికతో సాహితీ సమితి 1923వ సంవత్సరానికి స్ఫుటమైన రూపురేఖలు దిద్దుకున్నది. విశ్వనాథ సత్యనారాయణ, అడివి బాపిరాజు, పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వరరావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, వేదుల సత్యనారాయణ శాస్త్రి, కొడాలి ఆంజనేయులు, నండూరి సుబ్బారావు, నాయని సుబ్బారావు మొదలైన కవిమిత్రం చేరికతో సాహితీ సమితికి నిండుదనం కలిగింది. భారతి, శారద పత్రికల కంటే ముందుగా 1920లో ఈ సంస్థ 'సాహితి' పత్రిక నెలకొల్పింది. సాహితీమిత్రుల భావ ప్రకటనకు ఒక వాహిక ఏర్పడింది.

ఎవరి పుస్తకానికి వారే పెట్టుబడిదారులు. 1924 డిసెంబరు 24 న మొక్కపాటి నరసింహశాస్త్రి గారి 'బారిష్టరు పార్వతీశం' సాహితీ సమితి తరఫున వెలువడింది. అప్పుడొక గమ్మత్తు విషయం జరిగింది. పుస్తకం చివర ఎవరు వ్రాశారో ఏమో ప్రథమ భాగం సమాప్తం అని అచ్చుపడింది. ఈ రచన మొక్కపాటి వారు చెబుతుంటే, శ్రీనివాస శిరోమణి వ్రాశారు. ప్రథమభాగం అనేది వీరిద్దరూ వ్రాయనేలేదు. ప్రెస్ వారు చేసిన పొరపాటు. ఏమైతేనేం అది పార్వతీశానికి ఎంతో భవిష్యత్తు నిచ్చింది. నలభై ఏళ్ళ తరువాత నార్ల వెంకటేశ్వరరావు గారు ఆంధ్రజ్యోతి వారపత్రికలో ప్రచురిస్తూ, మిగిలిన నాలుగు భాగాలు వ్రాయమని ప్రోత్సహించారు. మొక్కపాటి వారు చెప్పగా, కప్పగంతుల రాజేశ్వరి, ఇంద్రగంటి శ్రీకాంతశర్మలు లేఖకులుగా మిగిలిన రెండు భాగాలు పూర్తయి, 1971లో మూడు భాగాలుగా వెలువడింది.

సమితి తొమ్మిదవ పుస్తకం దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి 'కృష్ణపక్షం' 1925 మార్చిలో వెలువడింది. దీనిని పిఠాపురం మహారాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరు వారికి అంకితమియ్యబడింది.

సాహితీ సమితి వార్షికోత్సవాలలో సమితి సభ్యులు కొందరు ఒత్తుగా టోపీ పెట్టినట్లుగా కనబడే జుట్టూ గిరజాలు పెంచేవారు. కండువాలను వల్లెవాటుగా వేసేవారు. ఇది కవికి ఒక విశిష్టవేషం అన్న అభిప్రాయం కలిగింది దేశంలో. వల్లెవాటు కండువాలు వేసుకుని పద్యాలల్లడమూ, కావ్యపఠనాలంటూ చేయడం ప్రారంభించారు. ఈ కోవలో రాజమండ్రిలో సారస్వత సమాజము, విశాఖపట్నంలో కవితా సమితి, హైదరాబాదులో సాధన సమితి ఏర్పడ్డాయి. జంటకవుల ఉద్యమం వెళ్ళిపోయి సమితు లేర్పడ్డాయి. విమర్శ ప్రతివిమర్శలనే కాలకూటాన్ని ఈ సమితి నిర్మాణోద్యమాలు మింగి వేశాయి. ఈ రకపు సంఘీ భావోద్యమానికి శివశంకరశాస్త్రి గారే పునాది వేశారనాలి. ●



## కామ గ్రంథమాల

పుదుచ్చేరిలో ఎన్. చిన్నయ్య గారు 'కామ గ్రంథమాల'ను స్థాపించారు. బ్రిటీషు ప్రభుత్వం ఏకాంత శృంగార పద్యాలు (ముదురు శృంగార పద్యాలు) ఉన్న తెలుగు ప్రబంధ కావ్యాలను నిషేధించింది. అందువలన ఫ్రెంచివారి ఆధిపత్యంలో ఉన్న పుదుచ్చేరిలో 'కామ గ్రంథమాల' పేరుతో 'Confidential Subscribers Edition' అని పుస్తకం మీద ప్రచురించి రహస్యంగా పంపేవారు.

బ్రిటీషు ప్రభుత్వం నిషేధించినవి సారంగు తమ్మయ్య రచించిన 'వైజయంతీ విలాసము', సముఖ వేంకట కృష్ణప్ప నాయకుడు రచించిన 'అహల్యా సంక్రందనము, ముద్దుపళని రచన 'రాధికా సాంత్వనము (ఇళాదేవీయము)', శేషం వేంకటపతి రచించిన 'శశాంక విజయము', వినుకొండ వల్లభరాయుడు రచించిన 'క్రీడాభిరామము' మొదలగునవి.

సెట్టి లక్ష్మీనరసింహం గారు బహుముఖ ప్రజ్ఞాశాలి, రాజా విక్రమదేవవర్మ గారి అంతరంగిక కార్యదర్శి. ఈయన కొన్ని పోకిరీ సాహిత్య రచనలు చేశారు. 'సరసోక్తి యుక్తి కృష్ణశతకము' అనే పేరుతో ఒక బూతు శతకం రచించారు. ప్రతి

పద్యంలోనూ కృష్ణుని చరిత్రకు ఒక బూతు సామెతను ముడిపెట్టడం ఇందులో చమత్కృతి. కామ గ్రంథమాల తమ నాలుగవ ప్రచురణ 'శృంగార' (శృంగార పంచకం) 1922 డిసెంబరు 10 న వెలువరించారు. ఈ సంపుటిలో 1. జాబులు - సెట్టి లక్ష్మీ నరసింహం, 2. సరసోక్తి యుక్తి కృష్ణ శతకము - సెట్టి లక్ష్మీనరసింహం, 3. రసికాభిలాషము - శ్రీనాథుడు (సెట్టి లక్ష్మీనరసింహం గారే రచించి శ్రీనాథుని పేరు పెట్టారని చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి స్వీయచరిత్రలో ఉన్నది), 4. సరస చాటువులు - సెట్టి లక్ష్మీ నరసింహం, 5. ప్రాచీన చాటువులు - పూర్వకవులవి ఉన్నాయి.

కామ గ్రంథమాల ద్వారా 1924లో 'బ్రహ్మానందము' వెలువడింది. దీనిలో కూడా అయిదు విభాగాలున్నాయి. 1. బ్రహ్మానంద శతకము - గోపీనాథ వెంకటకవి, 2. రామావధూటి తారావళి - మాడభూషి వేంకటాచార్యులు, 3. గణపతీయము - ప్రాచీనకవి, 4. శష్ప విజయము - తెనాలి రామకృష్ణుడు, 5. శృంగార శతకము - తోట విజయరాఘవనాయుడు రచనలు ఉన్నాయి.

ఎఱ్రన రచన రతి రహస్యము, కొక్కోకుని రచన కొక్కోకము, కూచిమంచి జగ్గకవి రచన చంద్రరేఖా విలాపము, కాళిదాసు రచన లంబోదర ప్రహసనము మొదలైనవి కూడా కామ గ్రంథమాల ద్వారా వెలువడినవి. ●



## ఆంధ్ర దేశీయేతిహాస పరిశోధక మండలి

1922 లో శ్రీయుతులు చిలుకూరి వీరభద్రరావు, చిలుకూరి నారాయణరావు, భావరాజు వేంకట కృష్ణారావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ గారలు 'ఆంధ్ర దేశీయేతిహాస పరిశోధక మండలి'ని రాజమహేంద్రవరం (రాజమండ్రి)లో నెలకొల్పారు. ఈ మండలి 'Journal of The Andhra Historical Research Society' అనే త్రైమాసిక పత్రిక నిర్వహించింది. ఈ పత్రికకు వరుసగా భావరాజు వెంకట కృష్ణారావు గారు, రాళ్లబండి సుబ్బారావు గారు, న్యాపతి కామేశ్వరరావు గారలు సంపాదకత్వం నిర్వహించారు. ఈ సంస్థను ప్రభుత్వం వారు తీసుకున్న తరువాత ఆర్. సుబ్రహ్మణ్యం, ఎన్. రమేశన్ గారలు సంపాదకత్వం వహించారు.

ఆంధ్ర దేశీయేతిహాస పరిశోధక మండలి ఆధ్వర్యంలో భావరాజు వెంకట కృష్ణారావు గారి సంపాదకత్వంలో 'రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక'; వడ్డాది అప్పారావు గారి సంపాదకత్వంలో 'రెడ్డి సంచిక'; రాళ్లబండి సుబ్బారావు గారి సంపాదకత్వంలో 'కళింగ సంచిక', 'వేంగి సంచిక'లు; మారేమండ రామారావు గారి సంపాదకత్వంలో 'విజయనగర సంచిక' ప్రకటించబడ్డాయి. ఈ సంస్థను ప్రభుత్వం వారు తీసుకున్న తరువాత ఆర్. సుబ్రహ్మణ్యం గారి సంపాదకత్వంలో 'మల్లంపల్లి వారి స్మారక సంచిక', 'నెలటూరి వారి స్మారక సంచిక' లు వెలువడ్డాయి.

ప్రస్తుతం ఈ సంస్థ రాజమండ్రిలో గోదావరి గట్టు ప్రక్కన రోడ్ కం రైలు బ్రిడ్జి దగ్గర 'శ్రీ రాళ్లబండి సుబ్బారావు ఆర్కియాలజికల్ మ్యూజియం'లో ఉన్నది. ●



## హిందుస్థాన్ పబ్లిషింగ్ హౌస్

శనివారపు సుబ్బారావు గారు 1896 ఫిబ్రవరి 26న పశ్చిమ గోదావరి జిల్లా తాడేపల్లిగూడెం తాలూకా ముద్దాపురంలో జన్మించారు. తల్లి మాణిక్యాంబ, తండ్రి రామయ్య. సుబ్బారావు గారు నిడదవోలులో డ్రాయింగు టీచరుగా పనిచేస్తూ 1920లో గాంధీ మహాత్ముని పిలుపు మేరకు, సహాయ నిరాకరణోద్యమంలో చేరే నిమిత్తం తమ ఉద్యోగానికి రాజీనామా చేశారు.

1922 జూలై 14న ఖాదీ ఉత్పత్తి విషయంలో స్థానిక నాయకులను సంప్రదించేందుకు టంగుటూరి ప్రకాశం పంతులు గారు ఏలూరు వచ్చారు. ప్రముఖుల వద్ద మూలధనం ప్రోగుచేసి ఖద్దరు ఉత్పత్తి చేసేందుకు రాజమండ్రిలో నాళం భీమరాజు గారు అవలంభించిన పద్ధతి, ఏలూరులో కూడా వీలవుతుందేమోనని మోతే గంగరాజు, మోతే నారాయణరావు, మోతే కృష్ణారావు గారలతో సంప్రతించారు. మోతే కుటుంబం వారు యాభై వేలు వరకు మూలధనం సమకూరుస్తామని వెల్లడించారు. ఈ పనిని ఒక జాయింట్ స్టాకు కంపెనీ ఏర్పరచి, దాని ద్వారా కొనసాగిస్తే బాగుంటుందని ప్రకాశం పంతులు గారు సూచించారు. అలా అయితే తామూ కొన్ని వాటాలు కొనగలమని దివాన్ బహదూర్ మోచర్ల రామచంద్రరావు గారు వాగ్దానం చేశారు.

ఖద్దరు ఉత్పత్తి సంస్థను స్థానిక కాంగ్రెసు నాయకులతో సంబంధం లేకుండా స్వతంత్రంగా ఉంచడం బాగుంటుందని ప్రకాశం గారి సలహా.

1922లో శనివారపు సుబ్బారావు గారు తణుకులో పదివేల రూపాయల షేరు ధనం వసూలు చేసి 'కో ఆపరేటివ్ ఖద్దరు స్టోర్స్' అనే సహకార సంఘాన్ని స్థాపించి, దాని ద్వారా పరిసర గ్రామాలలో ఖద్దరు ఉత్పత్తి చేయించి, ఈ సంస్థ ద్వారానే విక్రయించేవారు.

సుబ్బారావు గారు 1923లో ముదిగంటి జగ్గన్న శాస్త్రి గారితో కలసి 'పల్లెటూరు' అను పత్రిక స్థాపించి, ఒక సంవత్సరం నిర్వహించారు. తరువాత 'పల్లెటూరు గ్రంథ మండలి' అనే ప్రచురణ సంస్థ స్థాపించి - అకాలీల సత్యాగ్రహము, ప్రభుత్వము, రాజ్యపాలన శాస్త్రము, మాలవ్య పండితుని ఉపన్యాసములు అనేవి రచించి ప్రచురించారు.

1925లో చాగల్లులో తల్లాప్రగడ నరసింహశర్మ స్థాపించిన ఆశ్రమమునకు సుబ్బారావు గారు అయిదు ఎకరముల స్థలము సంపాదించి ఆశ్రమానికి స్థిరరూపం కల్పించారు.

శనివారపు సుబ్బారావు గారు 'హిందుస్థాన్ పబ్లిషింగ్ హౌస్' అనే ప్రచురణ సంస్థను నెలకొల్పి పల్లెటూరు కథలు, వయోజనవిద్య, గ్రామ పునర్నిర్మాణ తరగతులు-ఉపన్యాసాలు మొదలగునవి రచించి ప్రచురించారు. అంతేకాక ఈ సంస్థ ద్వారా భోగరాజు పట్టాభి సీతారామయ్య, అయ్యదేవర కాళేశ్వరరావు, ఎన్.జి. రంగా వంటి ప్రముఖుల చేత రాజకీయ గ్రంథాలు అనేకం రచింపజేసి, ప్రచురించారు. 1940 జూన్ 20న మరణించారు.

చర్ల గణపతి శాస్త్రి, తల్లాప్రగడ నరసింహశర్మ గారల సంపాదకత్వంలో 'శనివారపు సుబ్బారావు జీవితము - ప్రశంసలు' వ్యాస సంపుటిగా వీరి స్మారక సంచిక ప్రచురితమైంది. ●



# పల్లెటూరు గ్రంథమండలి

1923లో ముదిగంటి జగ్గన్నశాస్త్రి, శనివారపు సుబ్బారావు, తాడిమేటి రామకృష్ణా రావులు గాంధీజీ సిద్ధాంతాలను ప్రచారం చేసే నిమిత్తం ఒక పత్రికను స్థాపించాలను కున్నారు. ఆ సంకల్పమే 'పల్లెటూరు' అనే వారపత్రికను నిడదవోలులో ప్రారంభించారు. జగ్గన్నశాస్త్రి సంపాదకులుగా పత్రిక కొంతకాలం నడిచింది.

1924లో 'పల్లెటూరు గ్రంథమండలి' అనే పేరుతో గ్రంథ ప్రచురణ సంస్థను కూడా స్థాపించారు. శనివారపు సుబ్బారావు గారి రచనలు అకాలీల సత్యాగ్రహము, రాజ్యపాలన శాస్త్రము, మాలవ్య పండితుని ఉపన్యాసములు, ప్రభుత్వం అనేవి ప్రచురించారు. తరువాత ఆర్థికపరమైన ఇబ్బందులు కారణంగా పత్రిక, గ్రంథమండలి రెండూ నిలిచిపోయాయి.

కొంతకాలం తరువాత జగ్గన్నశాస్త్రి గారు 'పల్లెటూరు గ్రంథమండలి'ని తన యాజమాన్యం క్రిందకు తీసుకుని, స్వయంగా గ్రంథప్రచురణ ప్రారంభించారు. వీరి ప్రథమ ప్రచురణలుగా ఝాన్సీ లక్ష్మీబాయి, వీరసావర్కారుల చరిత్రలను ప్రచురించారు. అవి జనాదరణ పొందడమే కాకుండా, అనేకమంది యువకులు గ్రంథాలు చదివి ఉత్తేజితులై జాతీయ పోరాటంలో చురుకుగా పాల్గొన్నారు. తరువాత జగ్గన్నశాస్త్రి నెహ్రూ ఆత్మకథ, గాంధీజీ, రామతీర్థస్వామి జీవితం మొదలగు గ్రంథాలు రచించి ప్రచురించారు.

1930లో బ్రిటీషు ప్రభుత్వము ఝాన్సీ లక్ష్మీబాయి, వీరసావర్కార్, గాంధీజీ నీతి మంజరి గ్రంథాలను నిషేధించి, వాటి ప్రతులను స్వాధీనం చేసుకున్నారు. అంతటితో ఆగక వీరసావర్కార్ జీవితచరిత్రలో రాజద్రోహపూరితమైన వ్రాతలున్నాయని, జగ్గన్నశాస్త్రిపై భారత శిక్షాస్మృతి 124 సెక్షను క్రింద రాజద్రోహ నేరం ఆరోపించి, కాకినాడ జిల్లా మేజిస్ట్రేటు ఎదుట కేసు దాఖలు చేశారు. అప్పుడు జిల్లా మేజిస్ట్రేట్‌గా ఉన్న బెన్నెట్ ఐ.సి.ఎస్., ఐరిష్ జాతి వారు. గ్రంథంలో రాజద్రోహపూర్వకమైన వ్రాతలున్నాయని అంగీకరిస్తూ, ప్రస్తుతం వారు గ్రంథప్రచురణ జరిగిన ఆరు సంవత్సరములైన అనంతరం ఈ కేసు పెట్టడం సమంజసముగా లేదని, శాస్త్రి నామ మాత్రమైన నేరం మాత్రం చేసినట్లుగా నిర్ణయించి, వారికి వందరూపాయల జుల్మానా మాత్రం విధించారు. విచారణ చూడడానికి కోర్టుకు హాజరైన ప్రేక్షకులలో ఎవరో ఆ జుల్మానా అక్కడికక్కడే చెల్లించారు. ఈ గ్రంథాలపై నిషేధం 1937లో మద్రాసు రాష్ట్రములో కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడిన తరువాత తొలగించబడింది.

ముదిగంటి జగ్గన్నశాస్త్రి 1895లో తూర్పుగోదావరి జిల్లా ఏనుగుల మహల్ గ్రామములో జన్మించారు. ప్రముఖ రచయిత, జర్నలిస్ట్, జవహర్‌లాల్ నెహ్రూ ఆత్మకథ, సావర్కార్ జీవితము, గాంధీమహాత్ముని నీతిమంజరి, ప్రాచీన గ్రామపాలన, స్వామి రామతీర్థ బ్రహ్మ జ్ఞానోద్బోధనలు, తిరువళ్ళువర్ సూక్తులు, మహాత్మాజీ, మహారాణి ఝాన్సీ, మానవ యంత్రము మొదలైన ఇరవై గ్రంథాలు రచించి, ప్రచురించారు. గాంధీజీ ఆత్మకథను తెలుగులో రచించారు. తణుకులో ఒక జాతీయ కళాశాలను నడిపారు. స్వాతంత్ర్య సమరంలో పాల్గొని జైలు శిక్షలు అనుభవించారు. 1981లో మరణించారు. ●



## మాహిష్మతీ ముద్రాక్షరశాల

**ము**క్త్యాల జమీందారు వాసిరెడ్డి ఉమామహేశ్వర ప్రసాదు గారికి నలుగురు కుమార్తెలు. పుత్ర సంతానం లేదు. అందువలన తమ్ముడైన వెంకటాద్రి కుమారుని చంద్రమౌళీశ్వర ప్రసాదును దత్తత తీసుకున్నారు. చంద్రమౌళీశ్వర ప్రసాదు గారి భార్య చల్లపల్లి జమీందారు యార్లగడ్డ మల్లికార్జున ప్రసాదనాయడు బహద్దరుగారి కుమార్తె వేంకట దుర్గమాంబ. ఈమెకు సంతానం కలగనందున శాకమూరి వారి ఆడపడుచు కనకవల్లీ దేవిని రెండవ భార్యగా స్వీకరించారు. ఈమెకు 1918లో రామగోపాలకృష్ణ మహేశ్వర ప్రసాదు అనే కుమారుడు జన్మించాడు.

వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాదు బహద్దరు వారు అనేక తాళపత్ర గ్రంథాలను సేకరించి, పండితుల చేత అముద్రిత కృతులను పరిష్కరింపజేసి 'మాహిష్మతీ ముద్రాక్షరశాల'ను నెలకొల్పి, ప్రచురించారు.

కటికినేని రామయ కవి కృతమగు బ్రహ్మానంద చంద్రిక అనే తత్త్వశాస్త్రము, మాధవ పండిత కృతమగు కూటముద్గరమనే ఆయుర్వేద వైద్యం, మిట్టపల్లి సీతారామ చంద్ర సూరి కవి రచించిన కాలనిర్ణయ చంద్రిక అనే జ్యోతిషగ్రంథము, భోజకృతికి అప్పనమంత్రి చేసిన ఆంధ్రానువాదము 'చారుచర్య' అనే గ్రంథము, అమరవాది రామయ కవి రచించిన ద్రౌపదీ పరిణయము, తాతంభట్టు గురుమూర్తి శాస్త్రి రచన కృష్ణామాహాత్మ్యము, కొప్పరాజు సుబ్బరాయ కవి రచన కాంచీపుర మాహాత్మ్యము,

చర్ల వేంకటశాస్త్రి రచించిన వేంకటాద్రి గుణరత్నావళి అనే అలంకార గ్రంథము, ఆతుకూర పాపయామాత్యుని లలితాంబోపాఖ్యానము, మల్లమపల్లి బుచ్చికవి రచన హాలాస్యమాహాత్మ్యము అనే ఆరు ఆశ్వాసముల ప్రబంధము, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి రచించిన విజయవిలాసకృతి విమర్శనము, వేటూరి ప్రభాకరశాస్త్రి గారి నీతినిధి, విశ్వనాథ సత్యనారాయణ గారి రచన రామాయణ కల్పవృక్షము మొదలైన సంస్కృతాంధ్ర గ్రంథములను ముద్రింపించిన ఘనత చంద్రమౌళీశ్వర ప్రసాదు బహద్దరు వారిది.

అంతేకాక ఉద్భటారాధ్యచరిత్రము, నాచికేతూపాఖ్యానము మొదలైన గ్రంథాలు కూడా ప్రచురించారు. వీరు గొప్ప ఆయుర్వేద ఔషధాలయమును స్థాపించారు. ఆయుర్వేద వైద్యములో శాస్త్రీయ పరిశోధనలను ప్రోత్సహించారు. ఆయుర్వేదాచార్య ఆచంట లక్ష్మీపతి గారి 'ఆయుర్వేద దర్శనము'ను ప్రకటింప జేశారు.

సంగీతరత్న బిరుదాంకితులు పిరాట్ల శంకరశాస్త్రి గారు ముక్త్యాల సంస్థానాస్థాన సంగీత విద్వాంసులు. వీరు త్యాగరాయ ప్రశిష్యులైన తిరువత్తూరు నాగయ్య గారి శిష్యులు. సాహిత్యంలో ప్రవేశం కలవారు. అనేక కీర్తనలు, వర్ణములు రచించడమే కాకుండా శంకర శతకము కూడా రచించారు. వాటిని కూడా ముద్రించడం జరిగింది.

ఆంధ్ర రవివర్మ బిరుదాంకితులు, ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజులు గారి పుత్రులైన ఆత్మూరి రామమోహనరావు గారిని ముక్త్యాల సంస్థానాధీశులు పోషించారు. వీరి చేత భారతంలోని ముఖ్య ఘట్టములకు చిత్రములు వ్రాయించి, వానిని చేర్చి శ్రీకృష్ణ భారతమనే గ్రంథాన్ని సచిత్రముగా ముద్రింపించారు.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారి శ్రీకృష్ణ భారతము, విజయ విలాసకృతి విమర్శనము, వేదాద్రి మాహాత్మ్యము చంద్రమౌళీశ్వర ప్రసాదు బహద్దరు వారికి అంకితమైనాయి. ●



## సూర్యనారాయణీయ గ్రంథమాల

రెంటాల వేంకట సుబ్బారావు గారిని గురించి తెలియాలంటే వల్లూరి సూర్యనారాయణరావు గారి స్వీయచరిత్ర చదివితే తప్ప తెలియడం కష్టం. సూర్యనారాయణరావు గారు తమ స్వీయచరిత్రను రెంటాల వేంకట సుబ్బారావు గారికి అంకితమిచ్చారు.

సుబ్బారావు గారు మహామేధావి. దక్షిణ భారతదేశంలో గొప్ప మందుల సంస్థను స్థాపించి, విరివిగా ప్రకటన చేసి చాలా డబ్బు సంపాదించారు. కళాశాల తరగతుల పాఠ్యపుస్తక సహాయకులుగా ఆయన అనేక పుస్తకాలు రచించారు, విశేషవిత్తం ఆర్జించారు. ఒక్క స్కాట్లండ్‌లో తప్ప ప్రపంచంలో ఎక్కడా లేనంత పెద్ద ఫోటో స్టూడియోను మద్రాసులో స్థాపించి, భారతీయ సామాజిక జీవన సంబంధమైన ఛాయాచిత్రాలను తయారుచేసి, ప్రపంచ దేశాల మార్కెట్‌ను ఆకర్షించిన మేధావి. విద్యారంగంలో కూడా ప్రధానోపాధ్యాయ పదవిని చేపట్టి, యూరోపియనులతో సరిసమానమైన వేతనం తీసుకున్నారు. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు గారికి తమ మేనకోడలును ఇచ్చి వివాహం చేసింది సుబ్బారావు గారే!

రెంటాల వేంకట సుబ్బారావు గారు 'మనః స్వాతంత్ర్యము' అనే గ్రంథం నాలుగు సంపుటాలు వెలువరించారు. కొవ్వూరులో 'ఆంధ్రగీర్వాణ విద్యాపీఠం' స్థాపించి సంస్కృత విద్యను ప్రోత్సహించారు. వల్లూరి సూర్యనారాయణరావు ట్రస్ట్ (ధర్మనిధి) నెలకొల్పి చాలా తక్కువ ధరకు అంటే ఎంత పెద్ద పుస్తకమైనా ఆనాడు ఎనిమిది అణాలకు (అర్థ రూపాయి) మించకూడదు. స్వతంత్ర ఆలోచనలను ప్రోత్సహించే పుస్తకాలు, శాస్త్రీయ విజ్ఞానాన్ని, ఆధునిక రాజ్యాంగ వ్యవస్థను, వివిధ దేశాల చరిత్రలను ప్రచురించాలని 'వీలునామా' రాసి చనిపోయారు.

'సూర్యనారాయణీయ గ్రంథమాల' పేరుతో ఆంధ్రగీర్వాణ విద్యాపీఠం వారు అనేక గ్రంథాలను ప్రచురించారు. ●



# రామచంద్ర గ్రంథమాల

**ము**డియం సీతారామారావు 1897 మార్చి 19న చిత్తూరుజిల్లా వాయల్పాడు తాలూకా ముడియం గ్రామంలో జన్మించారు. తల్లి లక్ష్మమ్మ, తండ్రి కృష్ణారావు.

సీతారామారావు గారు సంస్కృతం, ఇంగ్లీషు భాషలలో పండితులు, ప్రధానోపాధ్యాయులుగా రాజమహేంద్రవరం వీరేశలింగం హైస్కూలులోను, చిత్తూరు బోర్డు హైస్కూలులోను పనిచేశారు. విద్యార్థులకు విజ్ఞానశాస్త్ర విషయాలు, దేశభాషలలో నేర్పాలన్న లక్ష్యంతో పాఠ్యపుస్తకాలు రచించారు. చిన్నతనంలో జాగ్రఫీలో తక్కువ మార్కులు వచ్చేవట ఆయనకి! అందుచేత పది జాగ్రఫీ పుస్తకాలు రచించారు. భూగోళ

శాస్త్రములో చిన్న, పెద్ద తరగతులకు కూడా పాఠ్య గ్రంథాలు రచించారు. తెలుగులో మొదట వచ్చిన భౌతిక, భూగోళశాస్త్ర గ్రంథాలలో వీరి రచనలు విశిష్టమైనవిగా పేరు పొందాయి.

బుద్ధుడు, జూలియస్ సీజర్, టిప్పు సుల్తాన్, హైదరాలీ వంటి చారిత్రక పురుషుల గురించి చక్కటి పుస్తకాలు రచించారు. ఇంగ్లీషు నవలలు అనువదించారు. సర్ వాల్టర్ స్కాట్ రచన 'కెనిల్‌వర్త్'ను సంగ్రహపరిచి అనువదించారు. 'పారిశ్రామిక హిందూదేశం' గ్లిన్ బార్లోగారి 'ఇండస్ట్రియల్ ఇండియా'కు అనుసరణ.

సీతారామారావు గారు 'రామచంద్ర గ్రంథమాల' పేరుతో తమ రచనలను అచ్చు వేసుకున్నారు.

రామాయణ కథలు, మహాభారత కథలు, ప్రపంచ భూగోళము, భీముడు, అర్జునుడు, భీష్ముడు, గరుడుడు సర్పయాగము, బలిచక్రవర్తి, పరశురాముడు, దుర్యోధనుడు, బొమ్మల భూగోళము, భౌతిక భూగోళశాస్త్రము, గంగానది, కర్ణుడు, హరిశ్చంద్ర చరిత్రము మొదలగునవి రచించి ప్రచురించారు. ఇంగ్లీషులో శ్రీరామచంద్ర, భీమసేన్ మొదలగునవి రచించి, ప్రచురించారు. ●



## జి.ఎస్. శాస్త్రి అండ్ కో, మరియు శృంగార గ్రంథమాల

గంటి సూర్యనారాయణ శాస్త్రి గారు 1904లో విజయనగరంలో జన్మించారు. విద్వత్కవి, పత్రికా సంపాదకులు, ఖాదీ ప్రచారకులు, చరిత్రకారులు, ప్రచురణకర్త, జాతీయవాది. కాశీలో పదమూడు సంవత్సరాలు తర్క, న్యాయ, మీమీంస, వ్యాకరణ శాస్త్రాలు అధ్యయనం చేశారు. కళ్యాణి పత్రిక సంపాదకులు. కొన్నాళ్లు ఆంధ్ర పత్రిక కార్యాలయంలో పని చేశారు. కళ్యాణి శాస్త్రిగా, ఖాదీ శాస్త్రిగా, శృంగార శాస్త్రిగా ప్రసిద్ధులు. ఎప్పుడూ ఖద్దరు వస్త్రాలే ధరించే వీరికి గాంధీగారు ఖాదీ శాస్త్రి అని పేరు పెట్టారట! దేశ వ్యాప్తంగా ఖాదీ వ్యాప్తికి కృషి చేశారు. కేరళ దేశంలో ఖాదీ వ్యాప్తికి కృషి చేస్తున్న కాలంలో వీరు 'గాంధీ అష్టకం' చెప్పారు.

శాస్త్రి గారు 1927లో మద్రాసులో 'జి.ఎస్. శాస్త్రి అండ్ కో' అనే ప్రచురణ సంస్థను నెలకొల్పారు. నండూరి సుబ్బారావు గారి 'ఎంకి పాటలు' తొలిసారిగా వీరే ప్రచురించారు. చాలా శృంగార గ్రంథాలను అందంగా అచ్చువేసి తెలుగు సాహిత్యాన్ని

సుసంపన్నం చేశారు. కళింగ విజయనగర చరిత్ర, బొబ్బిలి సంస్థాన చరిత్ర, పద్మనాభ చరిత్ర, సింహాచల చరిత్ర రచించి చరిత్ర చతురానన బిరుదు పొందారు.

శాస్త్రి గారు ఉపనిషత్‌సారం అయిన భగవద్గీతను తెలుగులో పదంగా రాసి పదకర్తగా పేరు పొందారు. భగవద్గీతా సారాన్ని పాడుకొనుటకు అనువుగా 'మేలుకొలుపు' పేరుతో రచించారు. రచయితగా సాహిత్యంలోని అన్ని ప్రక్రియలను చేపట్టారు. గుమస్తా (సాంఘికం), సింహాద్రి అప్పన్న (పౌరాణికం) నాటకాలను రచించారు. మిస్ మేయోను ఖండిస్తూ విమర్శ గ్రంథం రచించి, ప్రచురించారు.

శాస్త్రి గారు లండన్ సంకల్పం, సివిల్ కోర్టు మహామంత్రం వంటివి ఎన్నో చేర్చి 'తమాషా పంచాంగాన్ని' ముద్రించారు. తాతా సుబ్బరాయశాస్త్రి గారి జీవిత చరిత్రను రచించి, దానిలో వారి జాతక చక్రాన్ని కూడా పొందుపరిచారు. గాంధీ అష్టకం, ఖద్దరు పాట, కపట డాంబిక విద్వత్ప్రహసనము, విష్ణు దండకం, కృష్ణ జలక్రీడ నాటకం, భారత యోధులు, భగవద్గీత, బొబ్బిలి పాట, రామతీర్థం చరిత్ర, కృష్ణపక్షం (భావ కవిత్వం) మొదలగునవి రచించి, ప్రచురించారు.

సూర్యనారాయణ శాస్త్రి గారు 'శృంగార గ్రంథమాల' అనే పేరుతో అనేక శృంగార గ్రంథాలను ప్రచురించారు. నెల్లూరి శివరామకవి - కామ కళానిధి, వెలిదిండ్ల వెంకటపతి - శృంగార రాధామాధవ సంవాదము; చితారు గంగాధరకవి - శృంగార భల్లాణ చరిత్ర; రఘునాథరాయలు - శృంగారసావిత్రి; సముఖం వెంకట కృష్ణప్ప నాయకుడు- శృంగార అహల్యాసంక్రందనము; ఎడపాటి ఎర్రన - శృంగార మల్హణ చరిత్ర; రేవూరి అనంతయజ్వ - శృంగార గాధేయోపాఖ్యానము; వెణుతుర్ల ఒద్దెకవి- శృంగార రసాలవాలము, శృంగారము; ముద్దుపళని - అష్టపదులు మరియు శృంగార సత్యభామా స్వాంతనము, శృంగార కాళిదాసు కథలు, శృంగార రసతరంగిణి మొదలగు శృంగార గ్రంథాలు ప్రచురించారు. సమకాలిక కవులచేత శృంగార పద్యాలు రాయించి 'శృంగార కంఠాభరణము' అనే పేరుతో ప్రకటించారు.

గంటి సూర్యనారాయణశాస్త్రి గారు స్నేహితుడు బసవరాజు అప్పారావు గారిలా అల్పకాలంలో అనల్పమైన సాహిత్యసేవ చేసి, అల్పాయుష్కులుగా 1953లో మరణించారు. ●



# భాషాపోషక గ్రంథమండలి

కొత్త సత్యనారాయణ చౌదరి 1907 డిసెంబరు 31న గుంటూరు జిల్లా తెనాలి తాలూకా అమృతలూరు గ్రామంలో జన్మించారు. తల్లి రత్నమ్మ, తండ్రి బుచ్చయ్య చౌదరి. 1929లో ఉభయభాషా ప్రవీణ పట్టా ప్రథమ శ్రేణిలో పొందారు. నిడుబ్రోలు ఉన్నత పాఠశాలలో తెలుగు పండితులుగా పని చేశారు. ఉద్యోగం చేస్తూ రచనా వ్యాసాంగం చేపట్టారు.

1930లో 'భాషాపోషక గ్రంథమండలి' ప్రచురణ సంస్థను స్థాపించారు. దాని ద్వారా తమ రచనలను ప్రకటించారు. వైదిక వాఙ్మయ చరిత్ర, చంద్రాపీడుని చరిత్రము, చారుదత్తము, నైషధము, వసంతసేన, వాత్సాయనకామశాస్త్రము, ధర్మశాస్త్రము, విద్యార్థులకు - తెలుగు లక్షణము, బాలప్రౌఢ ప్రశ్నోత్తరమాల, వికృతి వివేకాలు రచించారు. నీతిచంద్రికను వ్యాఖ్యతో వెలువరించారు. చిన్నయసూరి జీవిత చరిత్ర, వరదాచార్యుల చరిత్ర (కులపతి), త్రిపురనేని రామస్వామి జీవితము, వాల్మీకము, రామరాజ భూషణము, త్యాగరాజు రచించారు. విశ్వనాథ సత్యనారాయణ గారి రామాయణ కల్పవృక్షము, విశ్వనాథ పంచశతిలపై విమర్శ గ్రంథాలు వెలువరించారు. సాహితి తెలుగు వెలుగులు, సాహితీ సమీక్ష, విద్యార్థుల కొరకు - కథావింశతి, కవుల కథలు, విక్రమ కథలు, బృహత్ కథలు, స్వరాజ్య కథలు, జాతక కథలు, కావ్య కథలు, చిత్ర కథలు, వినోద కథలు మొదలైన కథా సంపుటాలు ప్రచురించారు.

వరరుచి, వత్సరాజు, చాణక్యము, సైరంధ్రి, ప్రతాపసింహుడు, విక్రమాదిత్యము, ఈశ్వర సేవకులు, మహారథులు, కవిత్రయము, దివ్యమూర్తులు, సూక్తిముక్తావళి, మేవాడు విజయము, నవనాథము, సాలభంజికలు, వీరపూజ, సాహిత్య వ్యాసములు, కలిపురాణము - అయిదు భాగాలు, కావ్యమాల - రెండు భాగాలు ప్రకటించారు.

సత్యనారాయణ చౌదరి గారు బాపూజీ, మ్రొక్కుబడి, మాయా భిక్షువు, మాస్వామి, మంజరి, అంజలి, లోక తంత్రం, స్వరాష్ట్రము, మాలిక, పండితుడు శిశుఘ్ను, సతీసప్తతి మొదలైన పద్యకృతులు రచించి, వెలువరించారు.

పంచాదశి, శాకున్తలా సంస్కృత రచనలు. తమ ఉద్యోగ జీవితాన్ని 'నా ఉపాధ్యాయ గిరి' అనే గ్రంథం రచించారు. చౌదరిగారి అముద్రిత గ్రంథాలు ముప్పై వరకు ఉన్నాయి.

కొత్త సత్యనారాయణ చౌదరి 1974 డిసెంబరు 15న మరణించారు. ●



# ఆర్య భారతీ గ్రంథమాల

సంస్కృత, ప్రాకృత, ఆంధ్ర భాషలలో పండితులు పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి గారు. 1890 ఆగస్టు 9న ప్రకాశం జిల్లా ఒంగోలుకు సమీపములోని ముక్తి నూతలపాడు గ్రామంలో జన్మించారు. తల్లి అలమేలు మంగ, తండ్రి వేంకటేశ్వర శాస్త్రులు. వీరి అన్నయ్య దక్షిణామూర్తి శాస్త్రి.

ఆదినారాయణ శాస్త్రి గారు వాత్స్యాయన కామసూత్రాలు, వాటికి పలువురు పండితులు రాసిన వ్యాఖ్యానాలు తెలుగు చేశారు. సొంతంగా అచ్చు వేయించాలని నిర్ణయించారు. బరంపురంలో ఒక ఫారం (8 పేజీలు) అచ్చు వేసేసరికి పండిత మందేహులు అడ్డుపడ్డారు. ప్రెస్ యజమాని మెడలు వంచి అచ్చువేయడం మాన్పించారు. బరంపురం నుంచి బయలుదేరిన తరువాత ప్రతిచోటా ఇదే పద్ధతి. ఆ పద్ధతిని ఎదుర్కొంటూ ఊరికో ఫారం అచ్చు వేయించుకుంటూ, మద్రాసు వరకు అంచె అచ్చుల మీద పుస్తకం పూర్తి చేయగలిగారు.

ఆదినారాయణ శాస్త్రి గారు మద్రాసులోని పరశువాకంలో 'ఆర్య భారతీ గ్రంథమాల' ను 1930లో స్థాపించారు. సనాతనులు అన్నీ వేదాలలోనే ఉన్నాయని చెబుతూ బుకాయించే రోజులలో మన ధర్మశాస్త్రాలలో, ఇతర శాస్త్ర గ్రంథాలలో ఏమున్నదో సామాన్యులకు తేటతెల్లం చేయాలని శాస్త్రి గారి అభిలాష. అందుకోసం ఆయన గౌతముని ధర్మసూత్రాలు, వాత్స్యాయనుని కామసూత్రాలు, కౌటిల్యుని అర్థశాస్త్రము, రాజశేఖరుని కావ్యమీమాంస వ్యాఖ్యానాలతో అనువదించి, ప్రచురించారు.

యోగి వేమన జీవితం, హిందీ-తెలుగు బాలశిక్ష రచించి, ప్రచురించారు. ప్రాకృత సాహిత్యాన్ని మథించడం చేత 'జైనుల మత కథలు' తెలుగు పాఠకులకు తెలియజేశారు. తరువాత కొంతకాలానికి బరంపురం, కళ్ళికోట రాజా వారి కళాశాలలో ఆంధ్ర పండిత పదవి అలంకరించి, జీవితాంతం అక్కడే ఉన్నారు.

పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి గారు ఆంధ్ర లిపి పరిణామం, ఆంధ్ర సాహిత్య చరిత్ర రచించారు కాని, అవి ఏమైనాయో ఏమో! శాస్త్రి గారు 1951 జూన్ 21న కన్ను మూసారు. ●



# ఉషా గ్రంథావళి

పాటిబండ మాధవశర్మ 1910 ఏప్రియల్ 26న కృష్ణాజిల్లా తేలప్రోలు గ్రామంలో జన్మించారు. తల్లి మహాలక్ష్మి, తండ్రి వెంకటరామయ్య. సంస్కృతం, ఇంగ్లీషు భాషలలో పండితులు. సంస్కృతంలో, తెలుగులో గ్రంథాలు రచించారు. వీరి కలం పేరు 'విష్ణు ప్రియ'. విజయవాడలోని కళాశాలలో, ఉస్మానియా విశ్వవిద్యాలంలో అధ్యాపకులుగా, ఆచార్యులుగా పని చేశారు. ఉత్తమమైన ఆదర్శాలతో జాతీయ భావ బంధురంగా రచనలు చేశారు. ఆంధ్ర మహాభారతంలోని ఛందః శిల్పం మీద పరిశోధన చేసి డాక్టరేట్ పట్టా పొందారు.

చిన్నతనంలోనే కవిత్వం చెప్పి పండితులు మన్ననలు పొందారు. 'కుంతితో కర్ణుడు' అనే శీర్షికతో 29 పద్యాలు ఆంధ్ర భారతంలో ప్రచురించబడ్డాయి. 'శ్రీరామ విలాససభ' అనే నాటక సమాజానికి వీరు రాస్తుండేవారు. తెన్నేటి సూరి గారితో కలసి 'పూదోట' పద్యాలు రాశారు. సోమంచి యజ్ఞన్న శాస్త్రి గారితో కలసి 'ఉషస్సు' మాసపత్రిక నడిపారు.

1934లో 'ఉషా గ్రంథావళి' స్థాపించి నవ్యసాహిత్యం ప్రచురించారు. "వీణ" పత్రిక రెండున్నర సంవత్సరాలపాటు నడిపారు. 'బాలప్రభ' వారపత్రిక కూడా నడిపారు. తేలప్రోలులో 'ఉదయ భారతి' అనే గురుకులం స్థాపించి, సాహిత్య సాంప్రదాయాలను ప్రచారం చేశారు. 'ఉదయ భారతి' పేరుతో పత్రిక కూడా నడిపారు. భావకవిత్వం గురించీ, రస సిద్ధాంతం గురించీ, సాహిత్య తత్వం గురించీ ప్రామాణికమైన వ్యాసాలు రచించారు.

'విరహగోపి' వీరు విద్యార్థిదశలో రచించినది. 'చారుణి' భావనా గాంభీర్యం, ఉక్తి మాధుర్యంగల రచన. 'నాగానందం' నాటకాన్ని శ్రీహర్షుని హృదయానికి సన్నిహితంగా ఉండాలనే లక్ష్యంతో అనువదించారు. ఇది యం.ఆర్. అప్పారావు గారికి అంకితమిచ్చారు. 'రాజశిల్పి' కొండవీటి రాజ్యాన్ని పాలించిన కుమారగిరి కాలానికి సంబంధించిన ఇతివృత్తంతో చేసిన రచన. దీనికి ఆంధ్రవిశ్వవిద్యాలయం వారి బహుమతి లభించింది. రెడ్డిరాజుల కాలపు సాంఘిక రాజకీయ మత పరిస్థితులు దీనిలో ప్రస్తావించడం జరిగింది. దీనిని నీలం సంజీవరెడ్డి గారికి అంకితమిచ్చారు.

'ఇంద్రాణి' ని జె.వి. నర్సింగరావు గారికి అంకితమొసగారు. సంస్కృత సాహిత్యం లోని కావ్య శిల్పాన్ని అనువాద వ్యాఖ్యానాలతో తెలుగువారికి అందించడం వీరి విశిష్టత.

విక్రమోర్వశీయం నాటకాన్ని అనువదించి కరదీపికా వ్యాఖ్యానం రాశారు. రఘు వంశంలో దశమ సర్గకు, కుమారసంభవంలో షష్ఠ సర్గకు, కిరాతార్జునీయంలో మొదటి నాలుగు సర్గలకు తెలుగులో బాలసుధా వ్యాఖ్యానాలు రాశారు. రఘువంశంలోని మొదటి ఆరు సర్గలకు బాలసుధా టీక వ్రాశారు. గిరికపెండ్లి, రాజశిల్పి వంటి రచనలు, వ్యాసాలు విశ్వవిద్యాలయ విద్యార్థులకు పఠనీయాలుగా ఉన్నాయి.

అక్షరార్చన మాధవశర్మ గారి షష్టిపూర్తి సన్మాన సంచిక. ప్రసిద్ధ కవి పండితులు వివిధ విషయాలపై రాసిన వ్యాసాలు, మాధవశర్మ గారిని గురించి, వారి రచనలను గురించి రాసిన వ్యాసాలు, షష్టిపూర్తి మహోత్సవం రోజున కవులు చదివిన కవితా నీరాజనాలు దీనిలో చేరాయి. ఇది 328 పేజీల గ్రంథం.

మాధవశర్మ గారు 1978 జూన్ 29న మరణించారు. ●



# యువ ప్రచురణలు

**చ**క్రపాణి (ఆలూరి వేంకట సుబ్బారావు) 1908 ఆగస్టు 5న తెనాలిలో మధ్య తరగతి కుటుంబంలో జన్మించారు. తల్లి వెంకమ్మ, తండ్రి గురవయ్య. జాతీయోద్యమ ప్రభావానికి లోనై హైస్కూలు విద్యకు స్వస్తి చెప్పి, యలమంచిలి వెంకటప్పయ్య గారి దగ్గర హిందీ అభ్యసించారు. హిందీ భాషా వ్యాప్తికి గాఢ కృషి చేస్తున్న బిహారీ వ్రజనందన వర్మ వలన హిందీలో చక్కని ప్రావీణ్యం సంపాదించారు. వర్మగారే 'చక్రపాణి' అనే కలం పేరు సూచించారు.

క్షయ వ్యాధిగ్రస్తుడైన చక్రపాణికి మదనపల్లి శానిటోరియంలో చికిత్స చేసి, ఒక ఊపిరితిత్తును తీసివేశారు. సాటి రోగి అయిన కలకత్తా వాసి బెంగాలీబాబు ద్వారా బెంగాలీ నేర్చుకున్న పాండిత్యంతో ఉత్తరోత్తర శరత్ నవలలు అనువదించారు.

రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు కాలంలో జాతీయోద్యమం, దేశభక్తి భావాల ప్రచారానికీ, సాంఘికాచార సంస్కరణలకూ, ఆధునిక సాహిత్య విధానాలు, చరిత్ర పరమూ, సాహిత్య పరమూ అయిన పరిశోధనాంశాల వివరణలకు కృషి చేస్తున్న

రోజులలో - సంపాదకులు, యజమానులు అనేక కష్టనష్టాలకు ఓర్చి పత్రికలను నడిపారు. అంతటి ఉన్నతాశయాలు లేకపోయినా ప్రజలలో పఠనాశక్తిని పెంచి, అంతంత మాత్రమే చదువు నేర్చుకున్న వారు కూడా చదువుకునే విధంగా మరికొన్ని పత్రికలు - చిత్రగుప్త, వినోదిని, రూపవాణి, ఢంకా మొదలైనవి ప్రచారంలోకి వచ్చాయి. వాటికి కథలు, హాస్యం, సినిమా ప్రధానాంశంగా ఉండేవి.

ఆ రోజుల్లో చిత్రగుప్త, వినోదిని, రూపవాణి వంటి పత్రికలలో కథాసాహిత్య స్థాయి నానాటికి దిగజారసాగింది. మరవైపు సామాజిక స్పృహ, హేతువాదం, మానవ స్వభావ పరిశీలన గల కథ, నవలా సాహిత్యానికి అప్పటి కృష్ణా పత్రిక, ఆంధ్రవారపత్రిక, భారతి, గృహలక్ష్మి వంటి పత్రికలలో స్థానం లభించేది కాదు. అందువల్ల అట్టి సాహిత్యాన్ని ప్రజలకు అందజేయడం కోసం చక్రపాణి, కొడవటిగంటి కుటుంబరావు పూనుకున్నారు.

1935 యువ నామ సంవత్సరం 'యువ' మాసపత్రికను, 'యువ ప్రచురణలు' అనే పుస్తక ప్రచురణ సంస్థను నెలకొల్పారు.

1943, జూలైలో కె.వి.రెడ్డి గారు కబురు చేస్తే, చక్రపాణి మద్రాసు వెళ్ళారు. 'స్వర్గసీమ' చిత్రానికి ఇతివృత్తం చెప్పి వ్రాయమన్నారు. 1944 జనవరిలో కథ పూర్తయింది. కథ మొత్తం తీసుకువెళ్ళి కె.వి. రెడ్డి గారికి ఇచ్చి, తెనాలి బయలుదేరారు. కె.వి. రెడ్డి గారు 'చక్రపాణీ తెనాలి వెళ్ళి ఏం చేస్తావు, పుస్తకాలు ప్రింట్ చేయడానికి ఇక్కడి బి.ఎన్.కె. ప్రెస్ వుంది, ఇక్కడ లాడ్జీలో ఉండి, పుస్తకాలు వేసుకో' అని బి.ఎన్. రెడ్డి గారిని పరిచయం చేశారు. ఆ రోజుల్లో బి.ఎన్. గుప్తా గారి ఆంధ్రజ్యోతి వారపత్రిక ఆగిపోయింది. ఆంధ్రజ్యోతిని నాగిరెడ్డి సోదరులు కొన్నారు. 1945లో చక్రపాణి గారి సంపాదకత్వంలో 'ఆంధ్రజ్యోతి' మాసపత్రిక ప్రారంభమైంది.

1947 జూలైలో 'చందమామ' పిల్లల మాసపత్రిక స్థాపించారు. పదకొండు భారతీయ భాషలలో వెలువరించారు. 1949లో వాహినీ స్టూడియోను నాగిరెడ్డి, నాగిరెడ్డి బావమరిది రమణారెడ్డి గారలతో కలసి లీజుకు తీసుకుని, నిర్మాతగా సినీరంగ ప్రవేశం చేశారు.

చక్రపాణి గారి సంపాదకత్వంలో యువ మాసపత్రిక, విహారి పక్షపత్రిక, సంచారి మాసపత్రిక, ఆంధ్రజ్యోతి మాసపత్రిక, చందమామ మాసపత్రిక, సినిమా మాసపత్రిక మొదలైనవి వెలువడినాయి.

**యువ ప్రచురణలు తరఫున వెలువరించిన గ్రంథాలు :**

చక్రపాణి గారు అనువదించిన శరత్ రచనలు - వాగ్దత్త, సుభద, దేవదాసు, పల్లీయులు, నవవిధాన, చంద్రనాథ్, పరిణీత, బడదీదీ, పతివ్రత, హేమాంగిని, నిష్కృతి, మావారు, కాశీనాథ్, మహేశుడు, నారీర్మూల్య మొదలైనవి.

ఇతర రచయితల అనువాదాలు - నారీ ద్వేషిమైత్రా, పరాజయం, ఉదర నిమిత్తం, వల్లభపురం చిట్టడవిలో, హనుమంతుని స్వప్నం, మెట్టవేదాంతం, బెంగాలీ కథలు, ప్రగల్భప్రేతము, పాంచజన్యం, డిటెక్టివ్, లంబకర్ణ పరశురాం, సంధి మొదలైనవి.

చలం రచనలు - స్త్రీ, ప్రేమలేఖలు (2 భాగాలు), బిడ్డల శిక్షణ, విషాదం, ఆనందం, చిత్రాంగి, త్యాగం, మంగమ్మ, జయదేవ్, శశాంక, సావిత్రి, సత్యం-శివం-సుందరం, నాటికాగుచ్ఛం, కర్మమిట్లాకాలింది, కన్నీటి కాలవ, పాపం, దైవమిచ్చిన భార్య, మైదానం, అమీనా, వివాహం, బ్రాహ్మణీకం, అరుణ, హంపికన్యలు, అదృష్టం, పురూరవ, వాళ్లు నలుగురూ మొదలగునవి.

కొడవటిగంటి కుటుంబరావు రచనలు - నిలువనీరు, మొండివాడు, కాలభైరవుడు, వరప్రసాదం, కవిరాట్టు కల్పికలు, కులం లేని మనిషి, అరుణోదయం, మారుపేర్లు, నీకేం కావాలి, ప్రణయరోగులు, ఆరితేరిన ఘటం, రష్యన్ కథలు మొదలగునవి.

ధనికొండ హనుమంతరావు రచనలు - సంజీవి, గర్వభంగం, ప్రియురాలు, తీర్పు, పవిత్రులు, ఎర్ర బుట్టలు మొదలగునవి.

డిటెక్టివ్ నవలలు - కడపటి మాట, మాయమైన మణిహారం, తగినశాస్తి, తప్పిపోయిన పెళ్లికూతురు, పారిపోయిన యుద్ధఖైది, దివాలా ఎస్టేట్. అంతులేని ఆశ మొదలగునవి.

మరికొన్ని ఇతర ప్రచురణలు - కళ్యాణి, విశ్వంపెళ్ళి, జ్యోతిర్మయి, సిపాయి కథలు, ఈస్ట్‌లిన్, చచ్చిపోయిన మనిషి, కదంబం, పొగడ దండ, రూం టు లెట్, మూగజీవాలు, రాజూ-మంత్రి, చుక్కలూ గీతలూ, హర్ హైనెస్, పలితకేశాలు, స్వప్న వాసవదత్తము మొదలగునవి. ●



# విశ్వ సాహిత్యమాల

**తూ**ర్పుగోదావరి జిల్లాలో పవిత్ర గోదావరి ఒడ్డున గల గ్రామం ముంగండ. దీనికి మునిఖండం ప్రాచీన నామం. ముంగండ పండితరాయలవారి స్వగ్రామం.

మహీధర రామమోహనరావు, జగన్మోహనరావు, కృష్ణమోహనరావులు ముగ్గురు అన్నదమ్ములు. వీరి తల్లి సర్వలక్ష్మి, తండ్రి సూర్యనారాయణ. గోదావరి జిల్లాలోని 'ముంగండ' అనే మారుమూల అగ్రహారంలో 'విశ్వసాహిత్యమాల' అనే ప్రచురణ సంస్థను 1935లో స్థాపించారు. సోషలిస్టు సాహిత్యాన్ని తెలుగు పాఠకులకు అందించడం వీరి లక్ష్యం. మార్క్సిస్టు సిద్ధాంత గ్రంథాలను ప్రచురించారు. కథలు, నవలలు ప్రచురించడానికి 'అవంతి ప్రచురణలు' నెలకొల్పారు. 'అవంతి' రామమోహన రావు గారి కలం పేరు. ప్రజాశక్తి ప్రచురణాలయం వచ్చిన తరువాత విశ్వసాహిత్య మాల తాత్త్విక గ్రంథాలు, శాస్త్ర గ్రంథాలు ప్రచురించారు. 1979లో జగన్మోహనరావు గారు మరణించే వరకు విశ్వసాహిత్యమాల రమారమి వంద పుస్తకాలకు పైగా ప్రచురించారు.

**సిద్ధాంత గ్రంథాలు : ఏంగెల్సు రచనలు :** నరుడు-వానరుడు; సోషలిజం-ఊహాజనితం, శాస్త్రీయం; ప్రకృతి – గతితర్కము, తత్త్వశాస్త్రము.

**మార్క్సు రచనలు :** కమ్యూనిస్టులతో; Value - Price - Profit; Wage - Laour and Capital లకు అనువాదాలు.

మార్క్సు – ఏంగెల్స్ రచన ఇండియా.

లెనిన్ రచనలు : రాజ్యాంగ యంత్రం, పారిస్ కమ్యూన్, రష్యా విప్లవం, రష్యా విప్లవం – 1905.

క్రొపాట్కిన్ రచనలు : విప్లవ సందేశం: మార్క్సు జీవితం – ఉపదేశాలు.

పామీదత్తు రచనలు : లెనిన్ ఉద్దేశాలు; బ్రిటీషు కమ్యూనిస్టు పార్టీ – ప్రపంచ కార్మికోద్యమ చరిత్ర.

రెండవ ప్రపంచ యుద్ధం కాలంలో 1) కమ్యూనిస్టులతో, 2) సోషలిజం-ఊహాజనితం, శాస్త్రీయం రెండు పుస్తకాలను బ్రిటీషు ప్రభుత్వం నిషేధించింది.

బలివాడ కాంతారావు 'బూచి', భట్టిప్రోలు కృష్ణమూర్తి గారి గౌరి వంటి నవలలు, చాలా కవితా సంకలనాలు ప్రచురించారు. మావో–ఆచరణ, 1938లో 'విప్లవ గీతాలు' పేరుతో ఒక సంకలన గ్రంథాన్ని ప్రచురించారు.

నాడు - నేడు, బీళ్లు దున్నారు, నా బాల్యం, గోర్కీ జీవితం, గోర్కీ కథలు, టాల్‌స్టాయ్ జీవితం, టాల్‌స్టాయ్ కథలు, చెకోవ్ కథలు, ప్రతీకార జ్వాలలు, భయం, బలిదాన్, నాద్యా, విజ్ఞాని పాలోవ్, దక్షిణ పవనం, సోవియట్ స్త్రీ, పల్లెటూళ్లలో, లెనిన్ జీవిత కథలు, జ్ఞానం విజ్ఞానం, జనులు మహాజనులు, యక్షప్రశ్నలు, మానవులు మహీధరములు, ఉప్పొరవ్వ, వాంకా, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ చరిత్ర, విప్లవ సందేశం, డిప్యూటీ ఛైర్మన్, చీనా కథలు, సూక్తి ముక్తావళి మొదలైనవి ప్రచురించారు.

రామమోహనరావు గారు సైకిలుపై నెల్లూరు వరకూ, జగన్మోహనరావు గారు సైకిలుపై శ్రీకాకుళం వరకు పర్యటించి సోషలిస్టు గ్రంథాలను అమ్మేవారు ఆనాడు. ఈ సంస్థ రాజమండ్రికి మారిన తరువాత స్థాపకులలో ఒకరైన మహీధర జగన్మోహన రావు గారు సంపాదకత్వం, ప్రచురణ, విక్రయ బాధ్యతలు నిర్వహించారు.

అవంతి ప్రచురణలో - కొల్లాయి గట్టితేనేమి, ప్రేమలేఖ, జ్వాలాతోరణం మొదలగునవి ప్రచురించారు.

మహీధర రామమోహనరావు గారు - రథచక్రాలు, ఓనమాలు, దావానలం, స్వయంవరం, కొల్లాయి గట్టితేనేం, కత్తుల వంతెన, ఈ దారి ఎక్కడికి, పల్లెటూళ్ళలో, ప్రపంచ కార్మికోద్యమ చరిత్ర, అమృతత్త్వం, రేపేమిటి, లియో టాల్‌స్టాయ్, మబ్బుతెర, ఉమ్మడి కొంప, నూరేళ్ళ క్రితం, నాడు-నేడు, లెనిన్ ఉపదేశములు, పీతాంబరం, దయ్యం వచ్చిన రాత్రి, అసిధార, చీకటి భయాలు, దేశం కోసం, ప్రేమలేఖ మొదలగునవి రచించారు.

మహీధర జగన్మోహనరావు గారు - బలిదాన్, ఉప్పొరవ్వ, వాంకా, విజ్ఞాని పాలోవ్, విప్లవ సందేశం, యక్షప్రశ్నలు, గోర్కీ కథలు, లెనిన్ జీవిత కథలు టాల్‌స్టాయ్ కథలు, డిప్యూటీ ఛైర్మన్, చీనా కథలు, దక్షిణ పవనం, సూక్తి ముక్తావళి మొదలగునవి రచించారు.

రామమోహనరావు గారు 1909 నవంబరు 16న జన్మించారు, 2001 అక్టోబరు 6న మరణించారు. జగన్మోహనరావు గారు 1911 నవంబరు 26న జన్మించారు, 1979 మే 31న మరణించారు. ●



# 'భారత స్వాతంత్ర్య సమరం' ప్రచురణ

1936లో నేతాజీ సుభాష్ చంద్రబోస్ రచించిన 'ఇండియన్ స్ట్రగుల్ ఫర్ ఫ్రీడమ్' (భారత స్వాతంత్ర్య సమరం) అనే గ్రంథాన్ని బ్రిటీషు ప్రభుత్వం నిషేధించింది. దానిని కాళీపట్నం కొండయ్యగారు తెలుగులోకి అనువదించారు. ఆ పుస్తకం అచ్చు వేయడానికి ఏ ముద్రణాలయం సాహసం చేయలేకపోయారు. పశ్చిమ గోదావరి జిల్లా వాస్తవ్యులు వెలగల వెంకటరెడ్డి గారు రంగూన్‌లో 'ఐరావతి' అనే తెలుగు దినపత్రిక నడుపుతూ అక్కడే నివాసమున్నారు. 'భారత స్వాతంత్ర్య సమరం' గ్రంథాన్ని తాము అచ్చువేస్తామని, ప్రూఫులు దిద్దడానికి ఎవరైనా రంగూన్‌కు పంపవలసినదిగా కోరగా–కలిదిండి పెద సుబ్బరాజు, కస్తూరి సూర్యప్రకాశరావు, రామం, వెంకటరావులు ఈ నిమిత్తం రంగూన్ వెళ్ళారు.

పుస్తకాన్ని ఒక నెలలో అచ్చువేసి 1600 ప్రతులు మారుపేర్లతో ఆంధ్రాకు పంపారు. వాటిలో ఆరువందల ప్రతులు అమ్ముడైన తరువాత పోలీసు వారికి సమాచారం అందింది. వివిధ పుస్తకాల దుకాణాలను సోదాచేసి దాదాపు వెయ్యి కాపీలను స్వాధీనం చేసుకున్నారు. రంగూన్‌లో ఉండి అచ్చువేసిన సుబ్బరాజు వగైరాలను అరెస్టు చేసే నిమిత్తం, ఇక్కడ నుండి పోలీసుదళం ఒకటి రంగూన్ వెళ్ళింది.

రంగూన్‌లో ప్యాసింజరు సూపరెంటెండెంటుగా పనిచేస్తున్న దొమ్మేటి సూర్యనారాయణ ఈ సంగతి గ్రహించి, సుబ్బరాజు మొదలైన వారికి విషయం తెలియజేశారు. పోలీసుదళం రంగూన్ చేరగానే, రంగూన్‌లో రెడ్డి సంఘం తరపున నడపబడుతున్న పాఠశాలలో తెలుగు ఉపాధ్యాయుడిని అరెస్టు చేశారు. ఈలోగా సుబ్బరాజు, సూర్యప్రకాశం, రామం, వెంకటరావులు మాండలే పారిపోయారు. అక్కడ నుండి భారతదేశం వైపు ఉన్న అడవులలో గగ్గోలీ అనే ప్రదేశానికి బస్సు మీద వెళ్ళారు. వీరికి సహాయంగా బర్మా సోషలిస్టు పార్టీకి చెందిన యువకుడు గగ్గోలీ నుండి కలప లారీల మీద కొంతదూరం పంపాడు. ఆ తరువాత కిరాయికి లభించే గాడిదల మీద కొంతదూరం, అడవులలో ప్రయాణిస్తూ భారతదేశం చేరారు. తరువాత మూడు రోజులపాటు కాలినడకన డెబ్బై మైళ్లు ప్రయాణం చేసి భారతదేశంలోని షిల్లాంగ్ చేరి, అక్కడ నుండి ఇళ్ళకు వచ్చారు. ఇండియాను వదలి, మళ్ళీ ఇళ్ళకు చేరేసరికి దాదాపు ఆరునెలలు పట్టింది వారికి. ●



# ఇంటింటా విజ్ఞానమాల

విద్వాన్ విశ్వం (మీసరగండ విశ్వరూపశాస్త్రి) 1915 అక్టోబరు 21న అనంతపురం జిల్లా తరిమెల గ్రామంలో జన్మించారు. శతాధిక గ్రంథకర్త, విమర్శకులు, సమీక్షకులు, పత్రికా సంపాదకులు, అనువాదకులు. నవ్య సాహిత్య పరిషత్తు సభ్యులు. కొంతకాలం అభ్యుదయ రచయితల సంఘంలో ఉన్నారు. ప్రఖ్యాత కమ్యూనిస్టు నాయకులు తరిమెల నాగిరెడ్డి, నీలం రాజశేఖరరెడ్డి గారలు కాశీ విశ్వవిద్యాలయంలో విశ్వం గారికి సహాధ్యాయులు. ప్రాచ్య విద్యలు చదివి, సామ్యవాదం వైపు మొగ్గు చూపిన ప్రజ్ఞావంతుడు విద్వాన్ విశ్వం.

సాధన, మీజాన్, ప్రజాశక్తి, ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ పత్రికలలో పని చేశారు. 1933 నుండి రచనా వ్యాసాంగం ప్రారంభించారు. 1938లో 'నవ్య సాహిత్యమాల' అనే గ్రంథమాలను ప్రారంభించారు. తరువాత దానిని 'ఇంటింటా విజ్ఞానమాల'గా పేరు మార్చారు. ఫాసిజం, లెనిన్, స్టాలిన్, పాపం, సమీక్ష, రాతలు-గీతలు వెలువరించారు. 1940-41 లో స్వాతంత్ర్య సమరంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించారు. జైలులో రచనలు, గ్రంథ పఠనము సాగించారు. అనేక పుస్తకాలు ప్రచురించారు.

కాదంబరి, కిరాతార్జునీయం, దశకుమార చరిత్ర, మేఘసందేశం, రఘువంశం, కుమార సంభవం అనువదించారు. విశ్వసాహిత్యం నుంచి రోమారోలా, జాన్ క్రిస్టోఫర్, ఇబ్సన్, చెకోవ్‌ల రచనలు తెలుగువారికి అందించారు. ఇటాలియన్ విద్యావేత్త అయిన మేడమ్ మాంటిస్సోరీ రచనలు చాలావాటిని తెలుగు చేశారు.

పెన్నేటిపాట, విరికన్నె, పేదరాలు, ప్రజావిరోధి, నా హృదయం, ఒకనాడు, స్వతంత్రం, విలాసిని, ఇండోనేషియా, ప్రేమించాను, ఒక సాయంకాలం మొదలగునవి అనేకం రచించి, ప్రచురించారు.

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ప్రచురణలకు ప్రధాన సంపాదకులుగా అధర్వ వేదాన్ని తెలుగు చేశారు. కథా సరిత్సాగరం పన్నెండు భాగాలు వెలువరించారు.

విద్వాన్ విశ్వం గారు 1987 అక్టోబరు 19న పరమపదించారు. ●



# అణా గ్రంథమాల

కె.సి. గుప్తా (కల్వకుంట చంద్రసేన గుప్తా) 1919 సెప్టెంబరు 1న హైదరాబాదులో జన్మించారు. తల్లి లక్ష్మమ్మ, తండ్రి రామన్న. హైదరాబాదులో బి.ఏ., చదివారు. తెలంగాణా ప్రజలలో మాతృభాష తెలుగు పట్ల అభిమానాన్ని పెంపొందించి, తెలుగు భాషలో పుస్తకాలు ప్రచురించి, తద్వారా ప్రజల విజ్ఞాన వికాసాలకు అవిరళ కృషి చేసారు. 'ఆంధ్రా పబ్లిషింగ్ కంపెనీ' పేరుతో చిన్న చిన్న పుస్తకాలు ప్రచురించి, వాటిని అతి చౌక ధరలకు విక్రయించి, తెలుగు భాషాభివృద్ధికి పాటుపడ్డారు.

1939లో గుప్తా గారు వెల్దుర్తి మాణిక్యాలరావు, గుండవరం హనుమంతరావు గార్లతో కలసి 'అణా గ్రంథమాల' ను స్థాపించారు. వంద పుస్తకాలను ప్రచురించాలనే పథకం తయారు చేశారు. ప్రతి పుస్తకం క్రౌన్ సైజులో రమారమి 80 పేజీలు ఉండాలి. ఏ పుస్తకమైనా వెల అణా. ఆంధ్ర భాషా ప్రచారం బాగా జరగాలి, అత్యధిక సంఖ్యలో ప్రజలు పుస్తకాలు చదవాలి, తద్వారా విజ్ఞానాన్ని ఆర్జించాలి. ఇదే మా గ్రంథమాల ఆదర్శం అన్నారు ఆ ముగ్గురూ.

వంద పుస్తకాలు ఒకేసారి కొన్నవారికి అయిదు రూపాయలకే ఇచ్చేవారు. చందాదారులకు కూడా అయదు రూపాయలకు వంద పుస్తకాలు లభించేవి. నిజాం మండలములో అప్పట్లో హాలీ నాణాలు చలామణిలో ఉండేవి. ఈ హాలీ అణాకు ఆరు పైసలు. బ్రిటీషు ఇండియాలో చలామణిలో ఉండే అణాకు ఏడు పైసలు.

వీరసావర్కర్ జీవితచరిత్రను వెలువరించినందుకు, నిజాం ప్రభుత్వం ఆ పుస్తకాన్ని నిషేధించింది. గ్రంథకర్త రంగదాసు, ప్రచురణకర్త కె.సి. గుప్తాలపై క్రిమినల్ కేసు పెట్టి నానా యాతనలకు గురి చేసింది. అప్పటి ప్రముఖ న్యాయవాది బూర్గుల రామకృష్ణారావు కోర్టులో వాదించి, వీరు నిర్దోషులని ఋజువు చేసి, విడుదల చేయించారు.

1940 జనవరి 25న మాణిక్యాలరావు గారు రచించిన 'రైతు' రెండవ సాహితీ పుష్పంగా వెలువడింది. ఈ పుస్తకాన్ని కూడా నిజాం ప్రభుత్వం నిషేధించింది. అణా పుస్తకం చూచి అదిరింది ప్రభుత్వం. అణా గ్రంథమాల గ్రంథ ప్రచురణ రంగంలో ఆనాడు ఒక విప్లవం తెచ్చింది. ఉర్దూ విభాగంలో ముఖ్దూం మోహియుద్దీన్ గారి కవితా సంపుటిని తొలిసారిగా ప్రచురించిన గౌరవం కూడా అణా గ్రంథమాలదే!

మహర్షి దయానంద సరస్వతి, జవహర్‌లాల్ నెహ్రూ, ఎం.ఎన్.రాయ్. సుభాష్ చంద్రబోస్, వీరసావర్కార్ జీవితచరిత్రలతోపాటు హైదరాబాదు రాజ్యాంగ సంస్కరణలు,

జాగీరులు, ఖాదీ, సురవరం ప్రతాపరెడ్డిగారి మొగలాయి కథలు రెండు భాగాలు ప్రచురించారు. భోగరాజు పట్టాభి సీతారామయ్య గారు రచించిన కాంగ్రెసు చరిత్రను వెల్దుర్తి మాణిక్యాలరావు గారు సంగ్రహపరిచి రెండు సంపుటాలు వెలువరించారు. బమ్మెరపోతన, వెల్దుర్తి, నందగిరి వెంకటరావు, అడివి బాపిరాజు మొదలగువారు రాసిన కథలు, వ్యాసాలు కూడా చిన్న చిన్న పుస్తకాలుగా వెలువరిం చారు. ఈ గ్రంథమాల ఇరవై నాలుగో పుష్పంగా 'కాళోజీ కథలు' వెలువడింది. వంద పుస్తకాలను ప్రచురించాలనుకున్నారు కాని ఇరవై అయిదు మాత్రమే ప్రచురించారు.

గుప్తా గారు 1947లో హైదరాబాదు సంస్థాన విమోచనోద్యమములో పాల్గొని జైలుకు వెళ్ళి కఠిన కారాగార శిక్ష అనుభవించారు. 'గుప్త' అనే పేరుతో ఒక మాసపత్రికను కొంతకాలం నడిపారు. 2001 నవంబరులో మరణించారు.

వెల్దుర్తి మాణిక్యాలరావు 1912లో మెదక్ జిల్లా వెల్దుర్తి గ్రామంలో జన్మించారు. హిందీ, మరాఠీ, కన్నడం, ఉర్దూ భాషలలో పరిచయమున్న భావకవి. పత్రికా రచయిత. గోల్కొండ, మద్యపాన నిరోధక పత్రిక, గ్రామసుధాకర, తెలుగు తల్లి వంటి పత్రికల సంపాదకవర్గంలో ఉన్నారు. ఆంధ్ర మహాసభ, ఆంధ్ర యువజన సంఘం, అణా గ్రంథమాల, ఆంధ్ర సారస్వత సంస్థలతో వీరికి సంబంధమున్నది. సామాజిక ప్రయోజనం లక్ష్యంగా రచనలు చేశారు.

మా ప్రణయం, ముల్లు, హైదరాబాదు స్వాతంత్ర్యోద్యమ చరిత్ర, రైతు, దయానందుని జీవితం, రాజ్యాంగ సంస్కరణలు, ఖాదీ, బాలగేయాలు, హసీనా మొదలగునవి రచించారు. హైదరాబాదు స్వాతంత్ర్య పోరాట చరిత్ర ఇంగ్లీషులో కూడా రచించారు. 1987లో పరమపదించారు. ●



## దేశోద్ధారక గ్రంథమాల

**వ**ట్టికోట ఆళ్వారుస్వామి 1915 నవంబరు 1న నల్గొండ జిల్లాలోని నకిరేకల్లుకు సమీపములోని మాధవరం అనే గ్రామంలో ఒక పేద వైష్ణవ కుటుంబంలో జన్మించారు. తల్లి సింహాద్రమ్మ, తండ్రి రామచంద్రాచార్యులు.

పదకొండవ ఏట తండ్రి చనిపోవడంతో నకిరేకల్లు చేరి కాంచనపల్లి సీతారామా రావు అనే ఉపాధ్యాయుడిని ఆశ్రయించారు ఆళ్వారుస్వామి. ఆ ఇంట్లో పనిమనిషిగా పనిచేస్తూ, ఆయన వద్ద విద్యాభ్యాసం చేశారు. 1933లో ఆళ్వారుస్వామి హైదరాబాదు చేరారు. కోదాటి నారాయణరావు గారు 'గోలుకొండ' పత్రిక ఎడిటర్ సురవరం ప్రతాపరెడ్డి గారికి ఆళ్వారుస్వామిని గూర్చి చెప్పి, ప్రూఫ్ రీడర్ ఉద్యోగం ఇప్పించారు. నెలకు పదిహేను రూపాయల జీతం. ఆళ్వారుస్వామి తరువాత విజయవాడ వెళ్ళి వెల్‌కం హోటల్‌లో సర్వర్‌గా పనిచేసి, స్వయంకృషితో ఇంగ్లీషు నేర్చుకున్నారు. సాహిత్యంపై మక్కువ ఎక్కువ. 1938లో తిరిగి వచ్చి నిజాం రాష్ట్రాంధ్ర మహాసభలో సికింద్రాబాదు నగరానికి ప్రాతినిధ్యం వహించారు.

స్టేట్ కాంగ్రెస్, ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీ, అభ్యుదయ రచయిత సంఘం, ఆల్ హైదరాబాద్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, గుమస్తాల సంఘం, రిక్షా కార్మికుల సంఘం, గ్రంథాలయోద్యమం, పత్రికా రచన, పత్రికా నిర్వహణ, పౌరహక్కుల ఉద్యమం, పరిశోధన – ఇలా బహుముఖ ప్రజ్ఞాశాలి వట్టికోట ఆళ్వారుస్వామి.

కథ, నవల, విమర్శ, నాటకం, కవిత్వం, ఉపన్యాసం వంటి అనేక ప్రక్రియలలో తన ప్రతిభను ప్రదర్శించిన సాహిత్యోద్యమ జీవి, ప్రజల మనిషి ఆళ్వారుస్వామి. దేశోద్ధారకుడుగా పేరు గాంచిన కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారంటే ఆళ్వారు స్వామికి చాలా అభిమానం. 1938లో సికింద్రాబాదులో 'దేశోద్ధారక గ్రంథమాల' అనే ప్రచురణ సంస్థను స్థాపించారు. మొట్టమొదటి గ్రంథం సురవరం ప్రతాపరెడ్డి రచించిన 'హైందవ వీరులు'. కాళోజీ 'నా గొడవ', వానమామలై వరదాచారి 'పోతన చరిత్రము', భోగరాజు పట్టాభి సీతారామయ్య వంటి ప్రముఖుల రచనలతో పాటు 'టాల్‌స్టాయ్' వంటి పాశ్చాత్య పండితుల రచనలకు అనువాదాలు కూడా ఆళ్వారుస్వామి ప్రచురించారు.

1938–58 మధ్య కాలంలో సురవరం ప్రతాపరెడ్డి, ఖండవల్లి బాలేందు శేఖరం, భోగరాజు పట్టాభిసీతారామయ్య ప్రభృతుల రచనలు సుమారు 30కి పైగా ప్రచురించారు. ఇవన్నీ రాజకీయ సాహిత్య సాంస్కృతిక విజ్ఞానాన్ని అందించే రచనలు.

ఆళ్వారుస్వామి పుస్తకాలసంచీ భుజానవేసుకుని మారుమూల ప్రాంతాలకు సైతం వెళ్ళి, గ్రంథమాలకు చందాదారులను చేర్పించి, పుస్తకప్రియులకు గ్రంథాలను అందించేవారు. స్వయంగా ప్రజలమనిషి, గంగు (అసంపూర్తి నవల), రామప్ప రభస, జైలులోపల (కథా సంపుటి) రచించి, ప్రచురించారు.

వరంగల్‌లో ఉంటున్న కాళోజీ సోదరులతో ఆళ్వారుస్వామికి ఆత్మీయమైన సంబంధం ఉండేది. అలాగే వరంగల్ దగ్గరలోని తాటికాయల గ్రామంలో ఉంటున్న పొట్లపల్లి రామారావుతోనూ, సికింద్రాబాదులో ఉంటున్న దాశరథి సోదరులతోను ఆయనకు అపూర్వమైన స్నేహసంబంధాలు ఏర్పడ్డాయి. ఇంకా బిరుదురాజు రామరాజు, సి. నారాయణరెడ్డి, సురవరం ప్రతాపరెడ్డి, కోవెల సోదరులు, మాడపాటి హనుమంత రావు, బూర్గుల రామకృష్ణారావు, రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, రాజబహదూర్ గౌడ్, కొమరగిరి నారాయణరావు లాంటి ఎందరో మహామహులతో సన్నిహిత సంబంధాలుండేవి. చదలవాడ పిచ్చయ్య, ప్రయాగ, అడివి బాపిరాజు కూడా ఆయనకు సన్నిహితులే.

తరువాత తరానికి చెందిన ఇరివెంటి కృష్ణమూర్తి, కేతవరపు రామకోటి శాస్త్రి, కె.కె. రంగనాథాచార్యులు, పెండ్యాల చిన రాఘవరావు, గూడూరి సీతారాం, చంద్ర, పల్లా దుర్గయ్యలు కూడా ఆళ్వారుస్వామికి స్నేహితులే.

ఆళ్వారుస్వామి 'దేశోద్ధారక సూచీ గ్రంథాలయం' (రిఫరెన్స్ లైబ్రరీ) స్థాపించి, పాత పత్రికలు, సంచికలు పరిశోధకులకు అందుబాటులో ఉంచారు. 1942లో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించారు. 1947లో కమ్యూనిస్టు కార్యకర్తగా అరెస్టు అయి మూడేళ్ళపాటు జైలులో రాజకీయ డిటెన్యూగా శిక్ష అనుభవించారు. జైళ్ళలో సంస్కరణలు ప్రవేశపెట్టాలని ఆందోళన చేశారు.

కవి బలరామాచార్య, బిరుదురాజు రామరాజు, ఆళ్వారుస్వామి - ఈ ముగ్గురు కలసి 1961 ఫిబ్రవరి 5న హైదరాబాదులో జరుగుతున్న 'నుమాయిష్' (ఎగ్జిబిషన్) చూడడానికి వెళ్ళారు. అంతా తిరిగి చూచి, ఎవరి ఇళ్ళకు వారు వెళ్ళారు. ఆ రోజు రాత్రి ఆళ్వారుస్వామికి గుండెపోటొచ్చి 46 ఏళ్లకే కన్నుమూశారు. దిగ్భ్రాంతికి గురైన బిరుదురాజు రామరాజు గారు ఆనాటి నుండి 2010 ఫిబ్రవరి 18 న కన్నుమూసే వరకు ఎగ్జిబిషన్ చూడడానికి వెళ్ళలేదట!

ఆళ్వారుస్వామి 'ధర్మరాజు' కలం పేరుతో కొన్ని రచనలు చేశారు. ●



# ఆంధ్ర కల్పకము గ్రంథమాల

గాదే జగన్నాథస్వామి 1884 జూన్‌లో ఛత్రపురంలో జన్మించారు. తల్లి సుభద్రమ్మ, తండ్రి రంగారావు. టెక్కలి, బరంపురం, గంజాం జిల్లాలో నివసించారు.

సంస్కారదృష్టి, జాతీయ దృక్పథం ఉన్న భావకవి. ఆంధ్రుల గత వైభవాన్ని, విశిష్టతను జ్ఞప్తికి తెస్తూ, ఆంధ్ర రాష్ట్రోద్యమాన్ని ప్రేరేపిస్తూ చాలా రచనలు చేశారు. ఒరిస్సా రాష్ట్రములో గంజాం జిల్లా బోర్డు పాఠశాలలో తెలుగు పండితులుగా పని చేశారు. అనేక వేదాంత పండిత సభలలో పాల్గొన్నారు.

టెక్కలిలో 'ఆంధ్ర కల్పకము' అనే గ్రంథమాలను స్థాపించి, గ్రంథ ప్రచురణ చేసిన భాషాపోషకులు వీరు.

'ఆంధ్ర దేశ ప్రశంస' జాతీయతా ప్రబోధకంగా భావకవితా ధోరణిలో రచించారు. 'సంస్కార దర్పణం' బాలవితంతు వివాహం, రజస్వలా వివాహం, బ్రహ్మ సమాజం వంటి విషయాలు చర్చించిన నాటకం. ఇది విద్యార్థులకు పాఠ్య గ్రంథంగా ఉంది. 'ఆంధ్ర ముకుందమాల' మూలానుసారంగా ఉన్న అనువాదం. మూలశ్లోకాలు - టీక - వైరాగ్య పంచకానుబంధ కథా సంగ్రహము, కులశేఖరరాజు చరిత్ర, వైరాగ్య పంచకము, శ్రీకృష్ణాష్టకము, యతిరాజు భాస్కరమాల దీనిలో ఉన్నాయి. భరతఖండ వర్ణన పద్యాలు, వందేమాతరం శ్లోకాలు కూడా చేర్చారు.

'రాసభ విలాసము' ఈసపు నీతి కథల అనుసరణ. చమత్కారభరితంగా ఉన్నది. 'ప్రభావతి' చారిత్రక నవల. శ్రీ వేంకటేశ్వర విజ్ఞప్తి శతకంలో కర్త స్వవిషయంతో పాటు నారాయణ పరాత్పరత్వం, సనాతన మత ధర్మ ప్రశంస, కలికాల దురాచార నిరసనము ఉన్నాయి. 'బ్రహ్మపురీశ్వరా వేంకటేశ్వరా' అనేది మకుటం.

పూరీలో జరిగిన డోలోత్సవ సందర్భంగా వీరు 'జగన్నాథ దశకం' చెప్పారు. సంస్కార దర్పణము, జార్జి చక్రవర్తి స్తవము, గాదే వారి వంశావళి, శనైశ్చర తారావళి, గుణరత్న కోశము, భద్రాద్రిరామ శతకము మొదలగునవి రచించి, ప్రచురించారు. ●



# సుమనోహ్లాదినీ ప్రచురణలు

కవికొండల వెంకటరావు గారు 1898 జూలై 20న తూర్పుగోదావరి జిల్లా రాజమహేంద్రవరం తాలూకా శ్రీరంగపట్నములో జన్మించారు. తల్లి శేషమ్మ, తండ్రి నరసింహారావు. మద్రాసు విశ్వవిద్యాలయంలో బి.ఎల్., పూర్తి చేశారు. ఓ.జె. కూల్డ్రే దొరగారి శిష్యులు. దామెర్ల రామారావు, అడివి బాపిరాజుల సమకాలికులు. వీరి రచనలలో చాలావాటిని కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్, రాజమండ్రి వారు ప్రచురించారు. వేంకటరావు గారు 'సుమనోహ్లాదిని ప్రచురణలు' అనే ప్రచురణ సంస్థను స్వయంగా నెలకొల్పి, కొన్ని రచనలు చేసి ప్రచురించారు.

సుమనోహ్లాదినీ ప్రచురణలు తరపున వివిధ కుసుమావళి, జంటలు, ఆ గడపలు, పొట్టికత, చిట్టికత, కలరుతము, మాతృదేశ సంకీర్తనం, కుమారకంఠము, జనపదములు మొదలగునవి రచించి, ప్రచురించారు. కవికొండల వెంకటరావు గారు 1969 జూలై 4న మరణించారు.

ప్రకటన :

## దసరా తగ్గింపు ధరలు

*సగానికి సగం!* *త్వరపడండి!*

### కొండకొలకు విలసితోత్సల శీర్షిక

కవి : కవికొండల వెంకటరావు

| | | అసలు | తగ్గింపు |
|---|---|---|---|
| 1. | వివిధ కుసుమావళి | 0-8-0 | 0-4-0 |
| 2. | జంటలు | 1-0-0 | 0-8-0 |
| 3. | ఆ గడపలు | 0-8-0 | 0-4-0 |
| 4. | పొట్టికత | 0-8-0 | 0-4-0 |
| 5. | చిట్టికత | 0-6-0 | 0-3-0 |
| 6. | మాతృదేశ సంకీర్తనం | 0-4-0 | 0-2-0 |
| 7. | కలరుతము | 0-4-0 | 0-2-0 |
| 8. | కుమారకంఠము | 0-4-0 | 0-2-0 |
| 9. | జనపదములు | 0-4-0 | 0-2-0 |

మొత్తం తొమ్మిందింటికీ కలిపి ఆర్డరు ఇచ్చువారికి రు. 1-8-0 మాత్రమే. రు. 1-8-0 ముందుగా మనియార్డరు చేయుచో తపాలా ఖర్చులు తగలవు.

**వలయువారు :** కవికొండల వెంకటరావు

రాజమండ్రి

అని వ్రాయవలయును. ●



# ఆర్ష విజ్ఞాన పరిషత్తు

**చ**ర్ల గణపతి శాస్త్రి 1909 జనవరి 1న పశ్చిమ గోదావరి జిల్లా తణుకు తాలూకా కాకరపర్రు గ్రామంలో జన్మించారు. తల్లి వెంకమ్మ, తండ్రి నారాయణశాస్త్రి. నిడదవోలులో ఉండేవారు.

గణపతి శాస్త్రి గారు బహు శాస్త్రవేత్త, విద్వత్కవి. హిందీ, బెంగాలీ, ఆంగ్ల భాషలలో ప్రావీణ్యులు. సంస్కరణవాది, సర్వోదయ ఉద్యమ ప్రచారకులు. కొన్నాళ్లు సంస్కృత ఉపాధ్యాయులుగా పనిచేశారు. జాతీయోద్యమములో పాల్గొని జైలు శిక్షలు అనుభవించారు.

'ఆర్ష విజ్ఞాన పరిషత్తు' అనే ప్రచురణ సంస్థను స్థాపించారు. సామాన్యులకు అందుబాటులో ఉండేట్లు మతగ్రంథాలు, నీతి బోధకమైన రచనలూ ప్రచురించారు.

ఉపనిషత్తులను, బ్రహ్మ సూత్రాలను తెలిగించారు. కాళిదాసు, భవభూతిల రచనల సౌందర్యాన్ని తెలుగు పాఠకులకు అందించారు. ప్రాచ్య పాశ్చాత్య తత్త్వవేత్తల భావాలను ఆకళింపు చేసుకుని రచనలు చేశారు. వీరి రచనలు అన్నీ ధర్మోపదేశ ప్రధానమైనవి. భావకవిత్వాన్ని గురించి, వ్యాకరణాంశాలను గురించీ విస్తృతంగా వ్యాసాలు రాశారు. వీరి తండ్రిగారు రచించిన 'నారాయణీయాంధ్ర వ్యాకరణా'నికి వచనంలో వివరణ రాశారు. 'మహాభారత మీమాంస' అనే విమర్శనాత్మక గ్రంథాన్ని మూడు భాగాలలో ప్రచురించారు. 'అమృత గీతాంజలి' వచన గేయకవితా సంపుటి. 'చీకటి జ్యోతి' లియోటాల్‌స్టాయ్ నాటికకు అనుసరణ, సామ్యవాద భావాలతో కూడి ఉంది. 'సాహిత్య సౌందర్య దర్శనము' సమగ్రమైన అలంకారశాస్త్రంగా పండితుల మెప్పు పొందింది.

'బుద్ధ భగవానుడు–జీవితము' చంపూ కావ్యము. రఘువంశ లహరి పీఠికలో సూర్యవంశ చరిత్రను వివరంగా చర్చించారు. కాళిదాసు రచించిన మేఘసందేశ కావ్యాన్ని తెలుగులో 'మెయిలు రాయబారం' పేరుతో అనువాదం చేశారు. మూలంలోని ఒక్కొక్క శ్లోకానికి, తెలుగులో రెండేసి పద్యాలు చొప్పున రాశారు.

వాల్మీకి రామాయణాన్ని 'గణపతి రామాయణ సుధ'గా విశిష్టమైన రీతిలో అనువదించారు. దశరథుని కూతురు శాంత, సీతారాముల వయసు వంటి రామాయణంలోని వివాదాస్పద విషయాలను పీఠికలో ఉపపత్తులతో చర్చించారు. తమ గ్రంథాలకు తామే స్వయంగా పీఠికలు వ్రాసుకున్నారు. భాషలో తత్సమాలూ, దేశీపదాలూ ఎక్కువ.

గ్రంథ రచన విజ్ఞానాత్మకంగా, కర్తవ్యోపదేశ పూర్వకంగా ఉండాలని ఆశించిన రచయిత శాస్త్రి గారు. కావ్యమంజరి, సరళ సంగ్రహగీత, దమ్మపదము, భక్తి తత్త్వ దర్శనము మొదలగునవి కూడా రచించి, ప్రచురించారు. శాస్త్రి గారు 1996 ఆగస్టు 16 న మరణించారు. ●



# ప్రభాత ప్రచురణ సమితి

**కో**దాటి నారాయణరావు గారు 1914 డిసెంబరు 15న నల్గొండజిల్లా రేపాల గ్రామంలో జన్మించారు. తల్లి మంగమ్మ, తండ్రి రంగారావు.

గాంధీ సాహిత్యాన్ని ప్రామాణిక స్థాయిలో ప్రచురించిన రచయిత, పత్రికా సంపాదకులు. స్వాతంత్ర్య సమరలో పాల్గొన్నారు. గ్రంథాలయోద్యమం, అస్పృశ్యతా నివారణం, గ్రామ పునర్నిర్మాణం వంటి ప్రజాహిత కార్యక్రమాలలో నిర్విరామంగా కృషి చేశారు. హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు, సంస్కృత భాషలలో ప్రావీణ్యం ఉంది. ఆంధ్ర భాషా సాహిత్యాల పట్ల ప్రజలకు ఆసక్తిని కలిగించి, సాంస్కృతిక చైతన్యానికి దోహదం చేసిన దేశభక్తులు.

ప్రాథమిక విద్యాభ్యాసం కాలంలోనే రేపాలలో 'శ్రీ వేంకటేశ్వర మనోహర బాలభారతీ పుస్తక భాండాగారాన్ని' స్థాపించారు. ప్రగతి, భాగ్యనగరం, గోలకొండ,

ఆనందవాణి, ఆంధ్రకేసరి, సుజాత, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ వంటి పత్రికలకు వందల కొలది వ్యాసాలు రాశారు. 'ప్రభాత ప్రచురణ సమితి' నెలకొల్పి అనేక పుస్తకాలు ప్రచురించారు. చాలా పుస్తకాలకు పీఠికలు రచించారు. విషయవివరణలో, సిద్ధాంతీకరణంలో, నిర్ధారణలో, పరిశీలనలో వీరి పీఠికలు విశిష్టమైనవి.

ఇంద్రధనస్సు, జాతీయ పతాకము, చిన్ననాటి జ్ఞాపకాలు, కాంగ్రెసు టిక్కెట్టుకై ఇదంతా, గాంధీ - గాంధీతత్త్వము, కాంగ్రెసు చరిత్ర, హైదరాబాదులో రాజ్యాంగ సంస్కరణలు, శాసనసభ మొదలగునవి రచించి, ప్రచురించారు.

నారాయణరావు గారి అనువాదాలు మౌలిక రచనలవలె స్పష్టంగా, సరళంగా ఉంటాయి. 1975లో వెలువడిన వీరి షష్టిపూర్తి సంచిక విభిన్న రంగాలలో వీరు చేసిన కృషిని ప్రతిబింబిస్తున్నది.

పాతూరి నాగభూషణం గారు 'పౌర గ్రంథాలయాలు - వాని విధులు' అనే గ్రంథం రచించి నారాయణరావు గారికి అంకితమిచ్చారు. ●



## సనాతన ధర్మ ప్రబోధిని

వేదము వేంకట కృష్ణశర్మ 1899లో చిత్తూరుజిల్లా కార్వేటి నగరంలో జన్మించారు. తల్లి సుబ్బనరసమ్మ, తండ్రి రామయ్య.

తెలుగు, సంస్కృత భాషలలో గొప్ప పండితులు. వీరి పూర్వులు కార్వేటి నగర సంస్థానాధీశులకు కులగురువులు, ఆస్థాన విద్వత్కవులు. శర్మ గారు దాదాపు యాభై గ్రంథాలు రచించారు. శతక వాఙ్మయంపై కృషి చేశారు. ఆంధ్ర మహాసభ కార్యకలాపాలలో ఆసక్తిచూపు 'ఆంధ్ర మహాసభా నవరత్నమాలిక' రాశారు.

కార్వేటి నగరంలో 'ఆమ్నాయ నిలయ' మనే గ్రంథాలయాన్నీ, 'జ్ఞానోదయ నిలయ' మనే గ్రంథాలయాన్ని నెలకొల్పారు. కోడూరులో బాలభటోపాధ్యాయ శిక్షణా శిబిరాన్ని నెలకొల్పారు. జాతీయోద్యమ ప్రచారంలో పాల్గొన్నారు. 'సనాతన ధర్మ ప్రబోధిని' అనే గ్రంథ ప్రచురణ సంస్థను స్థాపించారు. కొంతకాలం ఉపాధ్యాయ వృత్తిలో

ఉన్నారు. వర్తమాని పత్రికలో సహాయ సంపాదకులుగా ఉన్నారు. ఆంధ్రవాణి, మాతృసేవ, ఆంధ్ర మహిళ పత్రికల సంపాదకవర్గంలో పని చేశారు.

శర్మగారి సాహిత్యకృషికి 'శతక వాఙ్మయ సర్వస్వం' తలమానికం. క్రీ.శ. 1160 నుండి 1860 వరకు జీవించిన 52 మంది శతక కవుల గురించీ, వారి శతకాలలోని విశేషాలను గురించి సమగ్రంగా తెలుపుతున్న రచన ఇది. ఆ యా శతకాలలో ఆ యా కవులు వాడిన తెలుగు పలుకుబడులు, జాతీయాలు, సామెతలు, నుడికారాలు మొదలగునవి విశదీకరించారు.

అభినవాంధ్ర కాదంబరి, కుందమాల, భామినీ విలాసము, ఊరుభంగం, శ్రీకృష్ణ శాస్త్రీయం, శ్రీ సోమశేఖరీయం, శ్రీ ఆంజనేయ కవీయం, నెహ్రూ కావ్యం, తేనెసోనలు, శ్రీరామ స్వభావము, సుధర్మ బోధిని, శిష్య బోధినీ శతకము మొదలగునవి రచించి, ప్రచురించారు.

శర్మ గారి రచనలు కొన్ని విశ్వవిద్యాలయాలకు పాఠ్యపుస్తకాలుగా ఎన్నిక చేయబడినాయి. 1970లో మరణించారు. ●



# నరేంద్రనాథ సాహిత్యమండలి

పశ్చిమ గోదావరి జిల్లా ఉండ్రాజవరము ఎస్టేటుదారులు ముళ్ళపూడి తిమ్మన్న గారు. తిమ్మన్న గారికి సంతానం లేరు. దొమ్మేరు జమీందారు పెండ్యాల రాయణిం గారి కూతురు కొడుకు వెంకటరాయణిం గారిని దత్తత చేసుకున్నారు తిమ్మన్న గారు. వెంకటరాయణిం గారికి పెండ్యాల అచ్యుతరామయ్య గారి అమ్మాయి అక్కమాంబ (అక్కాయమ్మ) నిచ్చి వివాహం చేశారు. వారికి ఆరుగురు కూతుళ్లు, ఒకే ఒక కొడుకు తిమ్మరాజు గారు 1901 అక్టోబరు 10న జన్మించారు.

ముళ్ళపూడి తిమ్మరాజు గారి మొదటి భార్య సంతాన అచ్చాయమ్మకు హరిశ్చంద్ర ప్రసాదు జన్మించారు. తిమ్మరాజు గారి రెండవ భార్య గుంటూరు జిల్లా కాట్రగడ్డ శ్రీరాములు నాయనిం గారి అమ్మాయి కమలాదేవి. కమలాదేవికి ముగ్గురమ్మాయిలు, ఒక అబ్బాయి నరేంద్రనాథ్. నరేంద్రనాథ్ ఋషీవాలీ స్కూలులో చదువుతూ చిన్నతనం లోనే అకాలమరణం చెందాడు. ఆ పిల్లవాని పేరు చిరస్థాయిగా ఉండాలని భావించిన

తిమ్మరాజు గారు తణుకు పట్టణములో 1947 జనవరి 29న 'నరేంద్రనాథ సాహిత్య మండలి' ని స్థాపించారు. దాని కొరకు 'రాయల ముద్రణాలయము'ను నెలకొల్పారు.

నరేంద్రనాథ సాహిత్యమండలి కేవలం గ్రంథాలను వెలువరించే సంస్థ మాత్రమే కాదు. వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి గారి నాయకత్వాన, శ్రీ పూసపాటి కుమారస్వామిరాజా గారి చేతుల మీదుగా అవతరించిన సాహితీ సంస్థ. ప్రతివారం సాహిత్య చర్చగాని, శాస్త్ర సంబంధమైన గోష్ఠిగాని, కవి సమ్మేళనం గాని ఏదో ఒకటి జరిగేది. ఈ మండలి తాతాసుబ్బరాయశాస్త్రి, మల్లాది సూర్యనారాయణశాస్త్రి, వేదుల రామ శాస్త్రి, కాశీకృష్ణాచార్యులు, వెంపరాల సూర్యానారాయణ శాస్త్రి, తల్లావజ్ఝల శివశంకర శాస్త్రి, ఏటుకూరి వెంకట నరసయ్య, తుమ్మల సీతారామమూర్తి చౌదరి, జమ్మలమడక మాధవరామ శాస్త్రి, భారతుల మార్కండేయ శాస్త్రి, పుట్టపర్తి నారాయణా చార్యులు, రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ, దివాకర్ల వెంకటావధాని, అమ్మిశెట్టి లక్ష్మయ్య, పెన్మెత్స సత్యనారాయణరాజు, వేదుల సూర్యనారాయణ శర్మ, నాదెళ్ళ కృష్ణమూర్తి, వద్దమాని సోమశేఖరము మొదలైన కవి పండితులను సన్మానించి సత్కరించింది.

నరేంద్రనాథ సాహిత్యమండలి తరఫున బద్దె భూపాలుని నీతిశాస్త్ర ముక్తావళి, కొలని గణపతిదేవుని శివయోగసారము - పూర్వభాగము (ప్రథమాశ్వాసము), కూచిమంచి జగ్గకవి సోమదేవరాజీయము, గోగులపాటి కూర్మనాథకవి సింహాద్రి నారసింహ శతకము, కార్యమపూడి రాజమన్నారు కవి రచించిన కారముచేటి మాధవ శతకము, కొత్త భావాయ్యచౌదరి గారి కమ్మవారి చరిత్రము, పశ్చిమ చాళుక్య రాజ్య చరిత్ర (పద్యకావ్యము); యం.వి.ఎస్. కృష్ణమూర్తి గారి రచన ముసునూరి కాపయ నాయకుడు, శ్రీహర్ష శీలాదిత్యుడు, రాజా బీరబల్ అనే చారిత్రక నవలలు; ఈదుపుగంటి రాఘవేంద్రరావు గారి ఆర్య చాణుక్యుడు, బుద్ధగీత, నృత్త రత్నాకరము మొదలగునవి వెలువడ్డాయి.

తిమ్మరాజు గారు కృతిపొందిన అనేక గ్రంథాలు ఈ మండలి తరఫున ప్రచురించ బడ్డాయి. సాహితీ వల్లభ్యము (సాహితీ వల్లభ, ఆంధ్రభోజ శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు గారి అభినందన సంపుటి) రెండు భాగాలు నరేంద్రనాథ సాహిత్య మండలి వెలువరించినది.

సాహిత్య సేవకుడు తిమ్మరాజు గారు 1978 ఆగస్టు 14న పరమపదించారు. ●



# తెలుగు భాషా సమితి

'తెలుగు భాషా సమితి' 1947 అక్టోబరు 10న మద్రాసులో స్థాపించబడింది. బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షులు. మోటూరి సత్యనారాయణ, డాక్టర్ డి.వి. సుబ్బారెడ్డి కార్యదర్శులు. ఉపాధ్యక్షులు - రాజా భోప్పరాజు రామకృష్ణరాజు, డాక్టర్ ఎస్.బి.పి. పట్టాభి రామారావులు. పర్వతనేని బ్రహ్మయ్య కోశాధికారి. అయ్యదేవర కాళేశ్వరరావు, మర్రి చెన్నారెడ్డి, ఉప్పులూరి ఎంబెరుమన్నారు, యం.ఆర్. అప్పారావు, పందిరి మల్లికార్జునరావు సభ్యులు.

విధాన నిర్ణయ సమితిలో సర్ ఆర్కాటు లక్ష్మణస్వామి మొదలియార్, టి.ఎస్. అవినాశలింగం చెట్టియార్, మామిడిపూడి వెంకట రంగయ్య, విస్సా అప్పారావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, గిడుగు వెంకట సీతాపతి, మాగంటి బాపినీడు, వసంతరావు వెంకటరావు ప్రభృతులు ఉండేవారు.

ఈ సంస్థ మొదట మద్రాసు విశ్వవిద్యాలయావరణలో కార్యాలయం ఏర్పాటు చేసి కృషి ప్రారంభించింది. కొంతకాలం విశాఖపట్నంలోను, ఆ తరువాత హైదరాబాదుకు మారడం జరిగింది.

సాహిత్య, విజ్ఞానశాస్త్రం వంటి అంశాలపై బహుమతులు ప్రకటించి, ఉత్తమ స్థాయికి చెందిన గ్రంథాలు వెలువడడానికి ప్రోత్సహించింది ఈ సమితి. ఈ పరంపరలో సుమారు నలభై గ్రంథాలకు పైగా ప్రచురించారు. 1900 నుండి 1953 వరకు భారతదేశంలో ప్రధాన భాషలలో ముద్రిత గ్రంథ సూచి కూడా ప్రచురించింద. భారతీయ భాషా సాహిత్యాల తులనాత్మక అధ్యయనానికి, పరిశోధనాకృషికి ఈ గ్రంథసూచి ప్రధాన ఆధారగ్రంథంగా తోడ్పడుతుంది.

తెలుగు భాషా సమితి రూపొందించిన విశిష్టమైన ప్రణాళిక విజ్ఞాన సర్వస్వం నిర్మాణము. అకారాది క్రమంలో ఒకొక్క విజ్ఞాన శాస్త్రానికి ఒక్కొక్క సంపుటము చొప్పున, ఆ యా రంగాలలో నిష్ణాతులైన పండితుల వ్యాసాలతో విజ్ఞాన సర్వస్వం సంపుటాలు 16 ఈ సమితి వెలువరించింది. 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత ఈ సమితి ఆంధ్రవిశ్వవిద్యాలయపు ఉపాధ్యక్షులు వి.ఎస్.కృష్ణ గారి ఆహ్వానం మేరకు

విశాఖపట్టణానికి మారింది. 1963లో మర్రి చెన్నారెడ్డి మొదలైనవారి ప్రోద్బలంతో హైదరాబాదుకు మారింది. ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆవరణలో ఈ సమితికి సొంత భవనం నిర్మాణమైంది. ●



## ఇంటింటా విజ్ఞానమాల ప్రచురణలు

దర్శి చెంచయ్య గారు – 1950లో "రాజకీయ రంగాల్లో నుండి విరమించుకున్నాక ఏ పనీ పాటా లేకుండా కాలం గడపటం కష్టంగానే ఉంది – ఏదైనా సులభమైన పని చేస్తుండాలి. నా చిరకాల వాంఛితమొకటి నెరవేరలేదు. ప్రపంచ వాఙ్మయములో నుండి ఓ వంద, ఉత్కృష్ట గ్రంథాలను తెలుగులోకి తర్జుమా చేయించాలని ఎన్నాళ్ళగానో అనుకొంటున్నాను. ఆ విధంగా మన వాఙ్మయాన్ని సుసంపన్నం చేయాలని నా అభిలాష. 'హోం యూనివర్సిటీ లైబ్రరీ', 'థింకర్స్ లైబ్రరీ'ల మాదిరిగా మన వాఙ్మయాన్ని సుసంపన్నం చేసి ప్రజలను సంస్కృతీ సంపన్నులుగను, అభ్యుదయ దేశాల ప్రజలతో సమానంగా ముందుకు నడవగలిగేటట్లున్నూ చేయవలెననుకొన్నాను. 1925–26 సంవత్సరాలలో ఈ ప్రయత్నాన్నే గుంటూరులో శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ, శ్రీ జి.వి. కృష్ణారావు గార్లతో ప్రయత్నించి విఫలుడనైతిని. ఈ సంకల్పాన్ని నెరవేర్చుకోవాలనుకొన్న ఒక సంవత్సరానికి సరియైన వ్యక్తి – ఈ పనికి పూనుకుని జయప్రదం చేయగలరనే వారు – విద్వాన్ విశ్వం (మీసరగండ విశ్వరూపశాస్త్రి) గారు లభించారు. అటు తరువాత కొన్ని వారాలలోనే ప్రజాసేవ తప్పక చేయాలని కోరే నలుగురు పాతమిత్రులు ముందుకొచ్చారు. ప్రజలకు వాస్తవంగా సహాయం చేయగలిగితే, డబ్బు సేకరించ గలమనే దృఢ నమ్మకం గల ఈ స్నేహితులు ఈ పనిని తక్షణం ప్రారంభించేటట్లు ప్రోత్సహించారు. ఏ తత్ ఫలితంగా మద్రాసులో 'ఇంటింటా గ్రంథమాల' అను ప్రచురణ సంస్థను 1951 మే 21 న రిజిస్టర్ చేయించాము. దీనిని ఆంధ్రులు ఆదరిస్తారని, జయప్రదంగా నెరవేర్చగలరనే నమ్మకం ఇప్పటికి కలిగింది" అని తమ స్వీయచరిత్ర 'నేనూ–నా దేశం'లో వ్రాశారు.

చెన్నపట్నంలో 1951 నవంబరు 11న నార్ల వెంకటేశ్వరరావు అధ్యక్షులుగా, దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, కొడవటిగంటి కుటుంబరావు, విద్వాన్ విశ్వం, పందిరి

మల్లికార్జునరావులు 'తెలుగు రచయితల సంఘం' ఏర్పాటు చేశారు. ఈ సంఘ సమావేశాలు కిన్నెర కార్యాలయంలో జరుగుతుండేవి. 'ఇంటింటా విజ్ఞానమాల ప్రచురణలు' స్థాపించి కొన్ని మంచి పుస్తకాలను ప్రచురించారు. ●



## ఆంధ్ర గ్రంథమాల

**కా**శీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు 1867 మే 1 న కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా ఎలకుర్రు గ్రామంలో ఆచార సాంప్రదాయాలు గల బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. తల్లి ఇవటూరి సోమనాథశాస్త్రి గారి కుమార్తె శ్యామలాంబ, తండ్రి బుచ్చయ్య. పంతులు గారి బారసాల నాటి పేరు నాగలింగం.

నాగేశ్వరరావు పంతులుగారు ఉన్నత విద్యకు చెన్నపట్నం వెళ్ళారు. అక్కడ రెంటాల వెంకట సుబ్బారావు గారు హైకోర్టు న్యాయవాది. అనేక రచనలు చేసిన మేథావి. విక్టోరియా డిపో అనే పేరుతో మందుల వ్యాపారమే కాక, ఇతర వ్యాపారాలు కూడా చేస్తున్న సంపన్నులు. సుబ్బారావు గారు నియోగి బ్రాహ్మణులు, లింగధారణ లేనివారు (ఆ రోజుల్లో ఆరాధ్య కుటుంబంలో ధారణలేనివారిని భోజనాలలో మడికి పనికిరానివారుగా దూరంగా ఉంచేవారు). బుద్ధిమంతుడు, స్ఫురద్రూపి అయిన నాగేశ్వరరావు గారు సుబ్బారావు గారి దృష్టిలో పడ్డారు. తమ మేనకోడలు రామాయమ్మని వివాహం చేసుకోమన్నారు. కొండా వెంకటప్పయ్య మొదలైన మిత్రుల సలహాతో వివాహానికి అంగీకరించారు నాగేశ్వరరావు గారు. మిత్రులే పెళ్ళి పెద్దలుగా 1890లో చెన్నపట్నంలో వివాహమైంది. ఆ వివాహానికి తల్లి గాని, బంధువులు గాని ఎవరూ రాలేదు. తల్లి గారికి కొడుకు కళ్ళముందు ఉండి ఏదో ఒక ఉద్యోగం చేస్తూ సంసారం గడుపుతూంటే చూడాలని ఆమె కోరిక. కాని నాగేశ్వరరావు గారు స్వతంత్ర జీవనంలో బాగా డబ్బు సంపాదించి లోకకళ్యాణానికి వినియోగించాలని వారి ఆశయం. అందుకు వ్యాపారమే సాధనమని నమ్మారు.

నాగేశ్వరరావు పంతులు గారు ఆంధ్రపత్రిక, భారతి మాసపత్రిక కాకుండా 'ఆంధ్ర గ్రంథమాల' అనే ప్రచురణ సంస్థను కూడా నెలకొల్పారు. ప్రాచీనార్వాచీన

గ్రంథాలు, వివిధ ప్రక్రియలకు సంబంధించిన గ్రంథాలు సవిమర్శక పీఠికలతో ప్రచురించిన సంస్థ.

శతకాలు, శాస్త్ర గ్రంథాలు, మత సంబంధమైన గ్రంథాలు, యోగశాస్త్ర గ్రంథాలు, నాటకాలు, నవలలు, అనువాద గ్రంథాలు ప్రచురించబడినాయి. శతకమంజరి, పాల్కురికి సోమనాథుని - బసవపురాణము, పండితారాధ్య చరిత్ర; రాయసం వెంకటశివుని - కమలాక్షి; మడికి సింగన - సకల నీతిసమ్మతము; పోసెట్టి లింగకవి - నవచోళ చరిత్ర; వేటూరి ప్రభాకరశాస్త్రి - నీతినిధి, తెలుగు మెరుగు; పసుమర్తి కృష్ణమూర్తి శాస్త్రి - త్యాగరాజస్వామి చరిత్రము; తిక్కన - ఉద్యోగపర్వము; కిళాంబి రంగాచార్యులు - ధమ్మపదము; పొణకా పిచ్చిరెడ్డి - భీష్ముడు; కుందూరి ఈశ్వరదత్తు - జీర్ణ విజయనగర చరిత్ర; కోరాడ రామకృష్ణయ్య - ఆంధ్ర భారత కవితా విమర్శనము; తలిసెట్టి రామారావు - భారతీయ చిత్రకళ; కాశీనాథుని నాగేశ్వరరావు గారి ఆంధ్ర వాఙ్మయ సూచిక వంటి గ్రంథాలు ప్రచురించి సాహిత్య సేవ చేసిన ప్రముఖ సంస్థ.

విశ్వనాథ సత్యనారాయణ గారి స్వర్గానికి నిచ్చెనలు; నోరినరసింహశాస్త్రి గారి రుద్రమదేవి, నారాయణభట్టు; ఉన్నవ లక్ష్మీనారాయణ గారి మాలపల్లి ఈ సంస్థ పక్షాన ప్రచురించారు. వావిలాల గోపాలకృష్ణయ్య గారి మొదటి రచన శివాజీ; వేలూరి శివరామశాస్త్రి గారు అనువదించిన 'గాంధీజీ ఆత్మకథ' కూడా ప్రచురించారు.

రెండు మహానగరాలు, టామ్‌సాయర్, హకల్ బెరీఫిన్, రాజు-పేద, డాన్‌క్విక్సోట్, కాంచనద్వీపం, మనిషిలో మనిషి, ఘంటారావం, 80 రోజుల్లో భూప్రదక్షిణం మొదలైన అనువాదాలు కూడా ప్రచురించారు.

ఆంధ్రపత్రిక, భారతి మాసపత్రిక, ఆంధ్ర గ్రంథమాల, విజ్ఞాన సర్వస్వం రెండు సంపుటాలు పునర్ముద్రణలు, సంవత్సరాది సంచికలు నాగేశ్వరరావు పంతులు గారి సాహిత్య విజ్ఞానదీక్షకు ప్రత్యక్ష చిహ్నాలు. పంతులుగారు 1938 ఏప్రియల్ 11న దివంగతులయ్యారు.

కాశీనాథుని నాగేశ్వరరావుగా తరువాత శివలెంక శంభుప్రసాద్ గారు కొంతకాలం నడిపారు. కాశీనాథుని వారి జీవిత చరిత్రను వ్రాసే సూర్యనారాయణ మూర్తి సంస్కృతంలో రచించారు. ●



# కవి తిలక గ్రంథమాల

మద్రాసులో ఆర్షవిజ్ఞాన బీజసంరక్షణ, పోషణ, పరిశోధన ధ్యేయాలుగా అమృతానందనాథులు స్థాపించిన శ్రీ తిరుముల శ్రీనివాస త్రిలింగ విద్యాపీఠమునకు అనుబంధంగా కవితిలక విద్వాన్ కాంచనపల్లి కనకమ్మగారు 1925లో బెజవాడ (విజయవాడ)లో 'కవితిలక గ్రంథమాల' ప్రారంభించారు.

ప్రధానంగా అమృతానందస్వామి ప్రబోధాలను ఆంధ్రదేశంలో వ్యాప్తి చేయడానికి ఈ సంస్థ ఏర్పడింది.

లోకకళ్యాణం కోసం ఆర్షవిజ్ఞానాన్ని కాపాడాలనీ ధర్మనిర్వహణోత్సాహం కల వారంతా యథాశక్తి ప్రాచీన విద్యలను కాపాడి ప్రచారం చేయాలని బోధించిన అమృతానందనాథుల వారి సందేశానికి అనుగుణంగా ఈ గ్రంథమాల గ్రంథాలను ప్రచురిస్తూ వచ్చింది.

కాంచనపల్లి కనకాంబ, దంటు సుబ్బావధాని, దంటు శ్రీనివాసశర్మ ప్రభృతుల గ్రంథాలు ఈ సంస్థ తరఫున ప్రకటితమైనాయి. ఈ గ్రంథమాల సభ్యత్వం అప్పట్లో పదిరూపాయలు. కాంచనపల్లి కనకాంబ గారు స్వామివారి ప్రబోధాలను పద్యరూపంలో రాసి, ఈ గ్రంథమాల తరఫున ప్రచురించారు.

కాంచపల్లి కనకాంబ గారి రచనలు – శ్రీ జీవయాత్ర, అమృతసారము, ఆనంద సారము, శ్రీ రామాయణ కథా సంగ్రహం, గౌతమబుద్ధ చరిత్రము, పద్యకుసుమాంజలి, పద్యరత్న, అభిజ్ఞాన శాకుంతలము, రాధ, చక్కని కథలు, తోమాలియ, బోధకథా సంధి, రంగ శతకం.

దంటు సుబ్బావధాని రచనలు – ఆంధ్ర భామినీ విలాసము, చిత్రమాధవ నాటకము, దానగీత, అంబికాచరణ సరోజపూజ, ఆంధ్ర వైద్య విజ్ఞానము, అమృతానందనాథ స్వామి చరిత్రము.

దంటు శ్రీనివాస శర్మ రచనలు – నాగభూషణ శతకము, తులసీదాస చరిత్ర మొదలగునవి ఈ గ్రంథమాల ప్రచురించిన గ్రంథాలు. ●



## ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ

ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ 1895 గుంటూరుజిల్లా ఇనగల్లు గ్రామంలో జన్మించారు. మధ్యతరగతి కుటుంబం. కొంతకాలం ట్యూషన్లు చెప్పారు. గుమాస్తాగా పనిచేశారు. పుస్తకాలు బాగా చదివేవారు. 1925లో తెనాలిలో పుస్తకాలషాపు ప్రారంభించారు. దాంతో ఉపాధ్యాయులతో, కవి, పండితులతో పరిచయాలు ఏర్పడ్డాయి. 1930లో పాఠ్యపుస్తకాలు ప్రచురించాలనుకొని 'ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ' నెలకొల్పారు. సంస్థ దినదినాభివృద్ధి చెందింది. ఆంధ్రదేశంలో ప్రముఖ పట్టణాలలో శాఖలు ఏర్పడ్డాయి. మద్రాసులో ఒక కార్యాలయం స్థాపించారు.

సుబ్రహ్మణ్య శర్మ గారు ముద్రణారంగంలో పలు ప్రయోగాలు చేసి, ఉన్నత విలువలు కాపాడారు. శర్మ గారికి వేటూరి ప్రభాకర శాస్త్రి, గిడుగు సీతాపతి మొదలైన ఉద్దండులతో పరిచయాలుండేవి. వారు రచించిన కొన్ని పుస్తకాలను ప్రచురించారు.

అప్పట్లో ఆంధ్రదేశంలో ఎక్కడా లేనటువంటి స్టీరియో ప్లేటు తయారుచేసే ఉపకరణాలు శర్మ గారి ప్రెస్‌లో ఉండేవి. రీప్రింట్ చేయవలసిన పుస్తకాలను ప్లేటు సహాయంతో అచ్చు వేసేవారు. 1958లో కృష్ణాపత్రికను కొన్నారు. వీరి ఆధ్వర్యంలో కృష్ణాపత్రిక వారపత్రికగా 15 సంవత్సరాలు నడిపారు. తెలుగులిపి సంస్కరణలపై పలు ప్రయోగాలు చేశారు. వృద్ధాప్యం కారణంగా పత్రిక నిలిపివేశారు. ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మ గారు 1979లో 85 వ ఏట మరణించారు. ●



## పురాణ గ్రంథమాలిక

నడకుదుటి వీరరాజు గారు 1871లో తూర్పుగోదావరి జిల్లా కాకినాడ తాలూకా శాహపురంలో జన్మించారు. తల్లి సీతమ్మ, తండ్రి రామన్న కవి. వీరరాజు గారు విద్వత్కవి. చిన్నతనంలోనే కవిత్వం చెప్పారు. ఏకసంధాగ్రాహి. అష్టావధానలు చేసి పండితుల మన్ననలు పొందారు. గ్రంథ విమర్శనంలోను, శిలాతామ్ర శాసనాల పరిశీలనలో పరిశ్రమ చేసి పత్రికలలో అనేక వ్యాసాలు ప్రచురించారు.

'విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల'ను స్థాపించి, అనేక గ్రంథాలు ప్రచురించారు. అముద్రిత గ్రంథాలను సంస్కరించి పీఠికలు రాసి ప్రచురించారు. ఈదురుపల్లి భవానిశంకర కవి - రాధామాధవము, ధర్మఖండము; మద్దిరాల వెంకటరాయ కవి - ఏకాంత సేవా విలాసము; ఎల్లనార్యుని విష్ణుమాయా నాటకం మొదలగునవి వీరరాజుగారు పరిష్కరించిన గ్రంథాలలో ముఖ్యమైనవి.

విభ్రమ తరంగిణి, జానకీ పరిణయము, వీరమహిమ, సకలజన మనోభి రంజనము, విదురుడు, లక్ష్మీనారాయణ విలాసము, విమర్శన తరంగిణి మొదలగునవి రచించి, ప్రచురించారు.

1929లో వీరరాజుగారు 'పురాణ గ్రంథ మాలిక' స్థాపించారు. రెండు నెలలకు ఒక సంపుటిగా, సంపుటానికి 200 నుండి 250 పుటల వంతున $\frac{1}{8}$డెమ్మీ సైజులో ప్రచురించాలనుకుని 18 పురాణాలను, ఉపపురాణాలను సంస్కృతం నుండి అనువదించి, తెలుగు పాఠకులకు సరళమైన వచనంలో అందించాలనే లక్ష్యంతో ఏర్పరచారు.

1937లో మరణించారు. ●



# ఆంధ్ర భారతీ ప్రకాశన మందిరం

కర్ల వీర నాగేశ్వరరావు గారు 1900 అక్టోబరు 22న చీరాల తాలూకా జాండ్రపేటలో జన్మించారు. తల్లి సీతమ్మ, తండ్రి కోట నాగయ్య. సంస్కృత హిందీ భాషా సాహిత్యంలో పండితులు. యారాసు నీలకంఠస్వామి గారి దగ్గర పంచకావ్యా ధ్యయనం చేసి, చాలాకాలం హిందీ ప్రచారక్‌గా ఉన్నారు. బండ్ల బాపయ్య హిందూ హైస్కూలులో హిందీ పండితులు. 1937లో చీరాలలో 'ఆంధ్ర భారతీ ప్రకాశన మందిరం' అనే గ్రంథ ప్రచురణ సంస్థను స్థాపించారు. హిందీ, సంస్కృత భాష ప్రచారం, నిఘంటు ప్రచురణ ధ్యేయాలు. హిందీ, సంస్కృత గ్రంథాలనేకం ప్రచురించారు.

నాగేశ్వరరావు గారు దేశనాయకుల చరిత్రలను కథా వస్తువులుగా సేకరించి, సంఘ సంస్కారానికి, జాతీయతా భావ ప్రేరణకూ దోహదం చేసే రచనలు చేశారు.

కథామంజరి, దళితోం కీ వినత్, సరళ హిందీ బోధ, సాహిత్య సౌరభ్, చండికా తారావళీ, హిందీ-తెలుగు బోధినీ, జాతీయగీతాని (2 భాగాలు), పొట్టి శ్రీరాములు మహోదయస్య, పవిత్ర బలిదాన్, తాతా సుబ్బరాయశాస్త్రి మహోదయః, మృత్యుంజయ తారావళి, రాష్ట్రపతి శతకమ్, వజ్రపాతః, వాణీ వీణీ స్వాతంత్ర్య సందేశః, వాణీ నిబంధ మణిమాల, వెంకటేశ్వర తారావళీ, స్వాతంత్ర్య సందేశః, సంస్కృత శతకమ్ (5 భాగాలు), సంస్కృత పత్రావళీ, సంస్కృతాంధ్ర హిందీబోధిని, ఆదర్శ్ వివాహ్, పడమరగాలి, అస్పృశ్యుల విజ్ఞప్తి, కన్నీరు, గోమాతృరక్షణం, కథా చతుష్టయం, వ్యాయామ శతకము, మోతీలాల్జీ నిర్యాణం మొదలగునవి రచించి, ప్రచురించారు.

కర్ల వీర నాగేశ్వరరావు గారు 1961 సెప్టెంబరు 26న మరణించారు. ●



## గ్రామ సేవా గ్రంథమాల

గోటటి జోగిరాజు గారు 1884 సెప్టెంబరు 29న పశ్చిమ గోదావరి జిల్లా తణుకు తాలూకా బుల్లిపాడు గ్రామంలో జన్మించారు. తల్లి కామేశ్వరమ్మ, తండ్రి వెంకట శివరావు.

జోగిరాజు గారు జాతీయ సముద్ధరణ, గ్రామపునరుద్ధారణ చేసిన రచయిత. గ్రామోద్ధరణ పత్రికను స్థాపించారు. వ్యవసాయ శాఖలో పనిచేశారు. వ్యవసాయ శాస్త్ర రచనలో అభినివేశం ఉన్నది. 1918లో విద్యార్థుల కోసం వ్యవసాయశాస్త్ర ప్రథమ పాఠశాల అనే గ్రంథం రచించారు. విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి వారికి వ్యవసాయశాస్త్రం (2 భాగాలు) వ్రాసి అందించారు.

జోగిరాజు గారు 1933లో గ్రామసేవా ముద్రణాలయాన్ని స్థాపించి, గ్రామసేవా గ్రంథమాలను నెలకొల్పారు. వ్యవసాయశాస్త్రంపై పెక్కు రచనలు చేశారు. 1937లో కొండవరంలో స్వయంపోషక కృషాశ్రమం నెలకొల్పారు. 1938లో ఉద్యోగ విరమణ చేశారు.

1947 తరువాత వీరి రచనల ప్రచురణ బాధ్యతను ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు తీసుకుంది. గ్రామసేవా గ్రంథమాల తరపున వీరి రచనలు పాతిక వరకు ట్రస్టు ప్రచురించింది.

గోటేటి జోగిరాజు గారు 1954 నవంబరు 7న మరణించారు. ●



# ఆంధ్రీ కుటీరం

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు 1920 మార్చి 5న కాకినాడ తాలూకా పల్లిపాలెంలో జన్మించారు. తల్లి లచ్చమ్మ, తండ్రి సూర్యనారాయణ. శాస్త్రి గారు పల్లిపాలెం గ్రామంలో యువకులను పోగుచేసి 1938 జనవరి 13న ఆంధ్రీ కుటీరం ప్రారంభించారు. ఈ సంస్థ ద్వారా 'ఆంధ్రీ' అనే సాహిత్య పత్రిక వెలువడేది. గ్రామసీమలో తెలుగు సాహిత్యం ప్రచారం ఆశయంగా ఏర్పడిన సంస్థ ఇది. ఈ సంస్థ నుంచి చిన్న చిన్న గ్రంథాలు చాలా ప్రచురించింది.

ఆంధ్రీ మాసపత్రికలో మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారి 'ఆంధ్ర రచయితలు' వ్యాసాలు, ఓలేటి వెంకటరామశాస్త్రి గారి వ్యాసాలు, కుందూరి ఈశ్వర దత్తు గారి 'శ్రీనాథుని కవిత్వతత్త్వము' మొదలైన రచనలు, ప్రముఖుల వ్యాసాలు ప్రచురితమయ్యేవి. గ్రాంథికభాషకు ప్రచారం ఇచ్చిన పత్రిక. ప్రకటించిన ప్రతి రచనకూ క్రింద సంపాదకుని సంగ్రహవ్యాఖ్య లేదా అభిప్రాయం ఇవ్వడం ఈ పత్రిక ప్రత్యేకత. సంపాదకుడు 'తెలుగు బిడ్డడు' అనే పేరుతో ఆంధ్రాభిమానాన్ని ఉద్దీపింపజేసే పద్యాలు రాసి, ప్రచురించేవారు. ఈ పత్రిక పిఠాపురంలోని ఓలేటి వెంకటరామశాస్త్రి గారి 'విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల'లో ముద్రితమయ్యేది. 1948లో దశమ వార్షికోత్సవం జరుపుకొని దశమ వార్షిక సంచికను వెలువరించారు.

సత్యనారాయణశాస్త్రి గారు ఆంధ్రపురాణము, ఆంధ్ర రచయితలు, శ్రీఖండం, తోరణము, చైత్రరథము, రత్నపంచాలిక, షడ్దర్శన సంగ్రహము, సూర్యసప్తతి, పార్థివాభ్యు

దయమ్, పతంజలి చరిత్ర, ధన్వంతరి చరిత్ర, కేళాకుళి, సదాశివ పంచాశిక, రత్నావళి, కళ్యాణతార మొదలగునవి రచించారు. 1992 నవంబరు 7న మరణించారు. ●



## సాధన సమితి
### (ప్రత్యూష ప్రచురణలు)

హైదరాబాదులో సరిపెల్ల విశ్వనాథశాస్త్రి, కురుగంటి సీతారామయ్య గార్ల ఆశీస్సులతో 1939లో సాధన సమితి స్థాపించబడింది. హైదరాబాదు సంస్థానములో తెలుగుభాషా సాహిత్యాల అభివృద్ధి కోసం శ్రీయుతులు నెల్లూరి కేశవస్వామి, భాగి నారాయణమూర్తి, బూర్గుల రంగనాథరావు, ఎం.ఎస్. రాజలింగం, జమ్మలమడక సూర్యప్రకాశరావు, చక్రవర్తి వేణుగోపాలరావు, వెల్దుర్తి మాణిక్యరావు, పిల్లలమర్రి హనుమంతరావు మొదలగువారు సాధన సమితిలో సభ్యులై సాహిత్య కృషి చేసి సంస్థకు పేరు తెచ్చారు. ఆ తరువాత దేవులపల్లి రామానుజరావు, సింగరాజు లింగమూర్తి, సురమౌళి మొదలైనవారు సభ్యులైనారు.

ఈ సంస్థ తరఫున హైదరాబాదులో కవులు, రచయితలు నెలకొకసారి సమావేశమై తమ తమ రచనలు చదివి వినిపించి వాటిమీద శ్రోతల అభిప్రాయాలు తెలుసుకుంటూ ఉండేవారు. ఒక లిఖిత పత్రికను నిర్వహించడం మరో విశేషం. 'ప్రత్యూష ప్రచురణలు' ద్వారా సమితి సభ్యుల రచనలను ప్రకటించేవారు. 1950 వరకు షుమారు 17 పుస్తకాలు వెలువడ్డాయి. ఈ సంస్థ అప్పటికి పేరు పొందిన 28 మంది కవుల రచనలను సంకలనంగా 'ప్రత్యూష' అనే పేరుతో 1950లో ప్రచురించారు. పుస్తకం చివర క్లుప్తంగా కవుల పరిచయం ఇచ్చారు.

1946లో అఖిలాంధ్ర తొలి కథానికల పోటీ, 1947లో అఖిలాంధ్ర తొలి నాటికల పోటీని, 1955లో తెలుగు నవలారచనలో రాష్ట్ర స్థాయి పోటీని నిర్వహించిన తొలి సాహితీసంస్థ సాధన సమితి. ●



# హైదరాబాదాంధ్ర సాహిత్య పరిషత్తు

1941 లో 'హైదరాబాదాంధ్ర సాహిత్య పరిషత్తు' అనే సాహిత్య సంస్థ హైదరాబాదులో స్థాపించబడినది. సాహిత్య ప్రచారం, పరిశోధన ఆశయాలుగా ఏర్పడిన సంస్థ. దీనికి రాయప్రోలు సుబ్బారావు అధ్యక్షులు, ఖాసిం ఖాన్ కార్యదర్శి.

హైదరాబాదులో ఆంధ్ర సాహిత్య ప్రచారానికీ, ఆంధ్రేతరులకు కూడా తెలుగు సాహిత్యం పట్ల అభిరుచి కలిగించడానికి కృషి చేసిన సంస్థ. కపిల కాశీవతి గారి ప్రేరణతో కురుగంటి సీతారామయ్య గారు రచించిన 'ఏడవ అసఫజా పంచవింశతి వర్ష రాజ్య చరిత్ర' ఈ సంస్థ మొదటి ప్రచురణ.

కురుగంటి వారి రచనలు, మహమ్మద్ ఖాసింఖాన్ గారి రచనలు, తిరువేంగళా చార్యుల వారి రచనలు చాలా ఈ సంస్థ ప్రచురించింది.

ఆదర్శ ప్రభువు నిజాము చరిత్ర, ఆంధ్ర వాఙ్మయ చరిత్ర, ఆంధ్ర ధ్వన్యాలోకము, డాక్టర్ టోపాగారి 'ఇస్రారెహయత్', వేమన తత్త్వం మొదలగునవి ఈ సంస్థ ప్రచురణలలో కొన్ని.

ఈ సంస్థ విజ్ఞాన సర్వస్వం ప్రచురించాలని ప్రయత్నించింది. ఒక త్రైమాసిక పత్రికను కూడా నడిపింది. కురుగంటివారు ఈ పత్రిక సంపాదకులు. ●



# ఆంధ్ర చంద్రికా గ్రంథమండలి

మాడపాటి హనుమంతరావు గారి షష్టిపూర్తి సందర్భంగా 1945లో ఆయన సన్నిహితులు ఆయనకు సమర్పించిన నిధి (రు. 6400/-)తో 'ఆంధ్ర చంద్రికా గ్రంథ మండలి'ని స్థాపించారు. నిజాం రాష్ట్ర ఆంధ్రోద్యమానికి వెన్ను తట్టిన అనేక గ్రంథాలను వెలువరించారు. ప్రజల విజ్ఞాన వ్యాప్తి కోసం కృషి చేసిన సంస్థ. ప్రధానంగా చరిత్ర, సాహిత్య గ్రంథాలను ప్రచురించారు.

మాడపాటి వారు స్వయంగా రచించిన తెలంగాణా ఆంధ్రోద్యమ చరిత్ర రెండు భాగాలు; ఖండవల్లి బాలేందు శేఖరం గారి విస్మృత సామ్రాజ్యములు; ఖండవల్లి లక్ష్మీ

రంజనం గారి ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము; ఆదిరాజు వీరభద్రరావు గారి ప్రాచీనాంధ్ర నగరములు; బి.వి. రమణారావు గారి వైజ్ఞానికుల జీవితాలు; రాంపల్లి విశ్వేశ్వరరావు గారి పౌర ధర్మములు మొదలగునవి ప్రచురించారు.

ఆంధ్ర చంద్రికా గ్రంథమండలికి వచ్చిన ధనాన్ని బ్యాంకులో వేసేవారు. అది ఇరవైవేల రూపాయల వరకు పెరిగిన తరువాత మాడపాటి హనుమంతరావు గారు 'రాజా బహద్దరు వెంకటరామరెడ్డి మహిళా కళాశాల స్థాపనకు విరాళంగా ఇచ్చి, గ్రంథమండలిని ఆపివేశారు. ●



# భారతీ సమితి

**జాస్తి** వెంకట నరసయ్యగారు 1910 ఆగస్టు 2న గుంటూరుజిల్లా తెనాలి తాలూకా పెదపూడిలో జన్మించారు. తల్లి శేషమ్మ, తండ్రి సుబ్బయ్య.

కృష్ణాజిల్లా పామర్రులో 1945 నవంబరు 10న జాస్తి వెంకట నరసయ్య గారు 'భారతీ సమితి' స్థాపించారు. 1950 నవంబరు 20 నుండి సన్మానసంఘం అనే ఒక ప్రత్యేక శాఖ ఏర్పరిచారు.

సాహిత్యసేవ దీని ప్రధాన ఆశయం. కావ్య ముద్రణలు, గ్రంథావిష్కరణ సభలు నిర్వహించడం, మహాకవుల జయంతి ఉత్సవాలు నిర్వహించడం, లలిత కళారాధకులకు సన్మానాలు జరిపి ప్రోత్సహించడం వంటివి ఈ సంస్థ కార్యకలాపాలలో ముఖ్యమైనవి.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, మల్లాది సూర్యనారాయణశాస్త్రి, షేక్ దావూదు కవి, శ్రీరాం వీరబ్రహ్మకవి మొదలగువారు ఈ సంస్థ తరపున సన్మానాలు పొందిన వారిలో కొందరు.

ఈ సమితి సభ్యుల గ్రంథాలు చాలా వరకు సమితి పక్షాన ప్రచురించారు. శ్రీరాం వీరబ్రహ్మకవి, కోగంటి దుర్గామల్లికార్జునరావు, వాకాటి పెంచలరెడ్డి, షేక్ దావూదు కవి, చలసాని లక్ష్మీనారాయణ శర్మ ఈ సమితి కార్యవర్గ సభ్యులుగా ఉన్నారు. నరసయ్యగారు డి.వి. సుబ్రహ్మణ్యం గారితో కలసి కాంగ్రెసు విజయము, ప్రజారాజ్యం, ఉపాధ్యాయుడు రచించారు. ఢిల్లీ ఛలో, వైతాళిక కథలు, జాతీయ

కథలు, ఆచార్యరంగా, దసరాగీతాలు, నవగీతాలు, జయభేరి, వ్యాసవాణి నాలుగు భాగాలు మొదలగునవి రచించి, ప్రచురించారు. ●



# ఆంధ్ర రచయితల సంఘం

1951 సెప్టెంబరు 6న హైదరాబాదులో తెలంగాణా రచయితల సంఘం స్థాపించబడింది. దాశరథి కృష్ణమాచార్య, సి. నారాయణరెడ్డి సారథులుగా ఈ సంఘం తెలంగాణాలో సాహిత్య సంచలనం రేకెత్తించింది. డి. రామలింగం, బిరుదురాజు రామరాజు, దేవులపల్లి రామానుజరావు, కాళోజీ నారాయణరావు, వట్టికోట ఆళ్వారుస్వామి, వెల్దుర్తి మాణిక్యరావు, బూర్గుల రామకృష్ణారావు మొదలగువారి తోడ్పాటుతో అనేక కార్యక్రమాలు నిర్వహిస్తూ 'మంజీర' పత్రికను వెలువరించేవారు.

తెలంగాణా రచయితల సంఘం ప్రచురించిన అఖిలాంధ్ర కవుల కవితా సంపుటి 'ఉదయ ఘంటలు' ప్రసిద్ధి పొందింది. తెలంగాణా రచయితల సంఘం ఆంధ్రప్రదేశ్ అవతరణ తరువాత 1957లో ఖండవల్లి లక్ష్మీరంజనం గారి ఆధ్వర్యంలో 'ఆంధ్ర రచయిత సంఘం'గా ఏర్పడింది. 'ఆంధ్రప్రదేశ్ చరిత్ర - భూగోళ సర్వస్వము' వంటి ప్రామాణిక గ్రంథాలను ప్రచురించి, ఆంధ్ర ప్రాచ్య కళాశాలను స్థాపించిన ఈ సంఘం తన ఉనికిని కోల్పోవడం దురదృష్టకరం. ●



# వరంగల్ మిత్రమండలి

హనుమకొండ శ్రీ రాజరాజ నరేంద్ర భాషానిలయం మిత్రమండలి అయిదు దశాబ్దాలకు పైగా నిర్విరామ సాహితీ కృషి జరుపుతున్నది. సాహితీ మిత్రుల కేంద్రంగా భాషానిలయం విలసిల్లింది. సాహితీ సంస్థలన్నింటికీ మూలాధారమైనది శ్రీ రాజరాజ నరేంద్రాంధ్ర భాషానిలయం. భాషానిలయంలో కలుసుకునే మిత్రులు కలసి మిత్రమండలిని ఏర్పాటు చేసుకోవడం జరిగింది. అనేక మధురస్మృతుల మేలు కలయిక మిత్రమండలి. మొదటి సమావేశం ఆర్ట్స్ కాలేజీలో పనిచేసే జి.వి. సుబ్రహ్మణ్యం,

ఇరువెంటి కృష్ణమూర్తిల సహకారంతో కాళోజీ నారాయణరావు గారి లోగిలిలో మిత్రమండలి ప్రారంభింపబడింది. 1957లో అలా ప్రారంభమైన మిత్రమండలిలో పదవులు, హోదాలు లేవు. ఇలా ఉండవలెనని కాళోజి రామేశ్వరరావు గారి సూచన. పదిహేనురోజులకొకసారి – ఆతిథ్యమిచ్చిన వారింట్లో కవులు కలుసుకునేవాళ్ళు.

1963లో గుర్రం జాషువా వరంగల్ సందర్శించినపుడు – మిత్రమండలి ద్వారా 'జ్యోతిర్మయి' పత్రిక వెలువడడం చూచి ఆనందించారు. మిత్రమండలి మొదటి కన్వీనర్ వరవరరావు. రెండవ కన్వీనర్ 'అంపశయ్య' నవీన్. ఉదయరాజు శేషగిరిరావు, చొల్లేటి నరసింహశర్మ, సంస్కృతాచార్యులు లాలే ఆ రోజుల్లో క్రమం తప్పక మిత్రమండలికి వచ్చేవారు. మిత్రమండలి ప్రేరణతో అనేక సంస్థలు వెలిశాయి. ఉదాహరణకు – యువభారతి, నెలనెలా వెన్నెల, చైతన్యసాహితి, సాహితీసమితి మొదలగునవి. మిత్రమండలి ఒక సాహిత్య కార్ఖానా. జిల్లాగ్రంథాలయ సంస్థలోనూ, మర్కజి హైస్కూలు లోను మిత్రమండలి సమావేశాలు జరిగాయి. వే. నరసింహారెడ్డి, వైయాకరుణుడు భాస్కరశర్మ, కథకుడు శౌంఠి కృష్ణమూర్తి పాల్గొన్నారు. పింగళి రంగారావు, సంధ్యా రంగారావు, జి. దక్షిణామూర్తి కన్వీనర్లుగా ఉన్నారు. నేటితరంలో నమిలికొండ, పొట్లపల్లి సుధాకర్, సిరాజుద్దీన్, జితేంద్రరావు, వరికొండ కాంతారావు మొదలైన వారిని పేర్కొనవచ్చు.

మిత్రమండలికి సభ్యత్వం లేదు. చందాలు లేవు. గురజాడ వారి బొమ్మను ఇంగ్లీషు ప్రొఫెసర్ శివకుమార్ వేశారు. మిత్రమండలి ద్వారా ఆవిష్కరింపబడింది. చలం 'మ్యూజింగ్స్' పై సెమినార్ జరిగింది. నవీన్ తరువాత తిరుపతయ్య కన్వీనర్. రాయప్రోలు సుబ్బారావు మిత్రమండలిలో ప్రసంగించారు. కె. వరదరాజులు కన్వీనర్గా ఉన్నప్పుడు మిత్రమండలి వార్షికోత్సవాలు – టౌన్‌హాలులో జరిగాయి. అనుముల కృష్ణమూర్తి తమ సరస్వతీ సాక్షాత్కారం చదవి వినిపించారు. మహీధర రామమోహనరావు, శ్రీశ్రీ కూడా మిత్రమండలిలో ప్రసంగించారు. దృక్పథాలు స్నేహానికి అడ్డం రానివాడు వే. నరసింహారెడ్డి. చివరి నిమిషం వరకు స్నేహాన్ని శ్వాసించిన వ్యక్తి. ఆయన మిత్ర మండలికి చాలాకాలం కేంద్ర బిందువుగా ఉన్నారు.

కాళోజి – పరాభవనామ సంవత్సరంలో ఋతువుకొకటి చొప్పున 'నా గొడవ' ప్రచురించారు. మిత్రమండలి ద్వారా ఈ పని జరిగింది. ఇందులో బాధ్యత మొత్తం వే. నరసింహారెడ్డిదే. 'పరాభవ వసంతం' శ్రీ రాజరాజ నరేంద్రాంధ్ర భాషానిలయంలోనే

విడుదల చేయబడింది. కొమరగిరి, కోదాటి, కాళోజి నారాయణ త్రయం ఆ సభలో పాల్గొన్నారు. వనం ప్రతాప్ రచించిన 'ఇదే ఓరుగల్లు, ఇదే ఇదే ఓరుగల్లు' అన్న పాట నగరమంతా మారుమ్రోగింది. బిట్ల నారాయణ, మధుసూధన్, డా॥ విశ్వనాథ, ఎన్.ఎన్. చారిల చిత్రప్రదర్శన జరిగింది. సూర్యదేవర సంజీవ్‌దేవ్ దీనిని ప్రారంభించారు. పొట్లపల్లి రామారావు 'చుక్కలు' మిత్రమండలి ద్వారా ఆవిష్కరించబడింది. రామప్పలోనూ, విడిగొండలోనూ, తాటికాయలలోను మిత్రమండలి సమావేశాలు జరిగాయి.

'మైత్రి' పేరుతో రెండు సంచికలు వెలువరించారు. సంపాదకులు - నాగిళ్ళ రామశాస్త్రి, కన్వీనర్ - సంధ్యా రంగారావు. 1979 నుండి 1986 వరకు మిత్రమండలి మూగవోయింది. 1986లో సంధ్యా రంగారావు కన్వీనర్‌గా మరల మొదలైంది. అప్పటి నుండి కాళోజి లోగిలి మిత్రమండలి సమావేశస్థలిగా నిర్ధారణ అయింది. ●



# మధురాంతకం రాజారాం సాహిత్య సంస్థ

ప్రసిద్ధ కథారచయిత మధురాంతకం రాజారాం దాదాపు అర్ధ శతాబ్దంపాటు ఎన్నో ఉత్తమ కథలను రచించి 1999 మర్చి 31 అర్ధరాత్రి పరమపదించారు. ఆ సందర్భంగా రాష్ట్రం నలుమూలల నుంచీ వచ్చిన రాజారాం అభిమానులు, సాహితీ వేత్తలు ఒకచోట చేరి వారి స్మృత్యర్థం ఒక ట్రస్టు ఏర్పాటు చేయాలని నిశ్చయించుకున్నారు. మూడు నెలలు ఏ కార్యాచరణ లేకుండా గడిచిపోయింది. కేతు విశ్వనాథరెడ్డి, మునిపల్లె రాజు, అక్కిరాజు రమాపతిరావు, సింగమనేని నారాయణ మొదలగువారి సూచనల ప్రకారం విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ మేనేజరు పి. రాజేశ్వరరావు తిరుపతి వెళ్ళి వి.ఆర్. రాసాని, రాజారాం గారి పెద్ద కుమారుడు నరేంద్రలను కలసి రాజారాం సాహిత్య సంస్థ నెలకొల్పాలి. ఈ పని మీరే చేయాలి అన్నారు. కాని నరేంద్ర - పోయిన సంవత్సరం తమ్ముడు మహేంద్ర మరణం, ఆ తర్వాత తండ్రి గారి మరణంతోను కలిగిన నిర్వేదంలో నా వల్ల కాదన్నాడు. అప్పుడు వి.ఆర్. రాసాని నిలబడగా, రాజేశ్వరరావు మిగిలినవారి సలహా ప్రకారం 1999 జూన్ 23న తిరుపతి గాంధీరోడ్‌లోని పాత భీమాస్ లాడ్జిలో రచయితలు చేరి 'మధురాంతకం రాజారాం

సాహిత్య సంస్థను ఏర్పాటు చేశారు. అధ్యక్షులుగా భూమన్, కార్యదర్శిగా పల్లేటి బాలాజీ, కోశాధికారి వి.ఆర్. రాసాని. పదమూడుమంది కార్యవర్గ సభ్యులు. సింగమనేని, పి. రాజేశ్వరరావు, కేతు, కొలకలూరి ఇనాక్ గౌరవ సలహాదార్లు.

తరువాత సింగమనేని, పి.రాజేశ్వరరావు గౌరవాధ్యక్షులు, వి.ఆర్. రాసాని కార్యదర్శి, నరేంద్ర సంచాలకులు. వి.ఆర్. రాసాని, వారి శ్రీమతి కె. ఉమాదేవి గారలు దాదాపు వెయ్యిమంది రచయిత(త్రి)లకు, సాహిత్య అభిమానులకు విరాళాల కోసం బ్రోచర్ పంపారు. దాదాపు అరవైమంది సాహితీవేత్తలు, సాహిత్యాభిమానులు దాదాపు అరవైవేల రూపాయలు పంపారు. ఆ డబ్బును ఫిక్సిడ్ డిపాజిట్ వేశారు. దానిమీద వచ్చే వడ్డీ డబ్బులతో 'కథాకోకిల' పురస్కారం ప్రారంభించారు. ప్రతి సంవత్సరం ఒక ఉత్తమకథా సంపుటికి అయిదువేల రూపాయల నగదు, జ్ఞాపిక, దుశ్శాలువతో ఆ రచయితను సన్మానిస్తూ వచ్చారు. అయితే మునిపల్లె రాజు, కాళీపట్నం రామారావు మొదలైన పెద్దల సూచన ప్రకారం ఆయా సంవత్సరాలలో వచ్చిన ఉత్తమ కథలను 'కథా వార్షిక' పేరుతో వెలువరిస్తే బాగుంటుందని పుస్తక ప్రచురణ కూడా ప్రారంభించారు.

ఈ పుస్తకాలు తేవడానికి మొదట ఆర్థిక సహాయం అందించి, పుస్తక ప్రచుర ఎలా ఉండాలో నిర్ణయించి నిర్దేశించినవారు అప్పాజోస్యుల సత్యనారాయణ గారు. వారు అమెరికాలోని తమ సంస్థ అజో.విభో. కందాళం ఫౌండేషన్ ద్వారా మొదటి మూడు సంవత్సరాలు ఆర్థిక సహాయం అందించారు. ఆ తరువాత నుండి అమెరికాలో ఉంటున్న డాక్టర్ బోయరెడ్డి సుబ్రహ్మణ్యం రెడ్డిగారు ఆర్థిక సహాయమందిస్తున్నారు.

కథాకోకిల పురస్కారాలు - 1999లో నందిగం కృష్ణారావు 'నాలుగు కాళ్ళ న్యాయం', 2000లో సి. సుజాత 'రెప్పచాటు ఉప్పెన', 2001లో కుప్పిలి పద్మ 'సాలభంజిక', 2002లో తోలేటి జగన్మోహనరావు 'లక్ష్మీకటాక్షం', 2003లో పెద్దింటి అశోక్‌కుమార్ 'ఊరబాయి', 2004లో స్వామి 'వీరగల్లు', 2005లో ఎ. అప్పలనాయుడు 'ఒక పొట్టివాడు కొందరు పొడుగువాళ్ళు' ●



# కడప జిల్లా రచయితల సంఘం

కడపలో 1967-68 ప్రాంతంలో అప్పటి కడప రెవెన్యూ డివిజినల్ ఆఫీసర్ కనములూరి వెంకట శివయ్య నేతృత్వంలో, జిల్లా కలెక్టర్ అధ్యక్షులుగా ఇరవైవేల రూపాయల మూలనిధితో 'సంస్కృతీ సంవర్ధక' పేరుతో ఒక సంస్థ ఏర్పడింది. కవులకు, రచయితలకు ఒక వేదిక అయినది. ఆ తరువాత ఈ సంస్థ సాహితీ సాంస్కృతిక మండలులకు ఆర్థిక సహాయం అందచేసింది. అదే సమయంలో చిత్తూరు జిల్లా రచయితలు ఒక సంఘంగా ఏర్పడి సహకార ప్రచురణ సంస్థను నెలకొల్పి, పుస్తకాల ప్రచురణ చేపట్టడం - కడప జిల్లాలోని పలువురు రచయితలలో స్పందన కలిగించింది. అప్పుడు 'మా సీమ' రాజగోపాలరెడ్డి గారు రచయితలు ఒకచోట చేరడానికి వసతి కల్పించారు. మా సీమ పత్రిక కార్యాలయంలో సాహితీ మిత్రులు కలసి సదస్సులు జరిపేవారు. వివిధ సాహిత్య ప్రక్రియలకు సంబంధించిన గోష్ఠులు నిర్వహించేవారు. ఆ విధంగా కవుల రచయితల ప్రేరణలు సంఘస్థాపనకు దోహదం చేశాయి. దాంతో 'కడప జిల్లా రచయితల సంఘం' ఆవిర్భవించింది. జిల్లా లోని పలువురు కవులు, రచయితలు సంఘంలో సభ్యులుగా చేరారు. ఆ సందర్భంగా సహకార ప్రచురణ సంఘాన్ని ఏర్పాటు చేసింది రచయితల సంఘం.

జిల్లా రచయితల సంఘానికి ప్రసిద్ధ కథా రచయిత పి. రామకృష్ణారెడ్డి (తులసీకృష్ణ) అధ్యక్షులు. మల్లెమాల వేణుగోపాలరెడ్డి, జూటూరు రమణయ్యలు ఉపాధ్యక్షులు, జానమద్ది హనుమచ్ఛాస్త్రి కార్యదర్శి, యం. జానకిరాం, కె. పుల్లారెడ్డి, జి. వీరశివారెడ్డి (కమలాపురం మాజీ యం.ల్.ఏ) సంయుక్త కార్యదర్శులు, జె.సి. సుబ్బయ్య కొశాధికారి.

1973 ఆగస్టు 11, 12 తేదీలలో కడపజిల్లా రచయితల మహాసభలు అత్యంత వైభవంగా జరిగాయి. రచయిత సంఘం ఇనుమడించిన ఉత్సాహంతో ప్రామాణిత సంతరించుకున్న అనేక కార్యక్రమాలు చేపట్టింది. సాహిత్య విలువలు కలిగిన విశేష సంచికలను ప్రచురించింది. 'చేతన' పేరుతో వెలువడిన గాంధీ సంస్మరణ సంచిక, కవితా కౌముది, సి.పి. బ్రౌన్ -వేమనల సంచిక మొదలగునవి వెలువరించింది. ●



# శైవ ప్రచారిణి గ్రంథమాల

ముదిగొండ వీరేశలింగశాస్త్రి 1904 డిసెంబరు 5న గుంటూరు మండలం ఈమనిలో జన్మించారు. సాహిత్య విద్యా ప్రవీణులు. విద్వత్కవి. వరంగల్ కళాశాలలో తెలుగు, సంస్కృత పండితులు. స్వయంకృషితో ఇంగ్లీషు, తమిళం నేర్చుకున్నారు. సంస్కృతం, తెలుగు, తమిళ భాషలో అనర్గళంగా ఉపన్యసిస్తారు.

శైవ ప్రచారిణి పేరుతో ఒక పక్ష పత్రికను, గ్రంథమాలను నిర్వహించారు. ఈ గ్రంథమాల ద్వారా యాభైకి పైగా గ్రంథాలను అచ్చు వేశారు. ఆయుర్వేదం పైన కూడా ఆసక్తి మెండు.

ఒద్దిరాజు శేషగిరిరావుతో కలసి 'పూలోయమ్మ పూలు' వంటి గేయాలు రచించారు.

తత్వత్రయార్థ ప్రకాశిక, వేదాంతశాస్త్ర హృదయము, వేదాంత పంచవింశతి, కాశీసారము, శంకరారాధ్య చరిత్ర, శైవ సిద్ధాంత దర్శిని, రాజరాజేశ్వరి శతకము, కాళేశ్వర మాహాత్మ్యము, ఆచార్య విజయము, అగస్త్యేశ్వర శతకము, హరిహర తారతమ్యము, సుందరి, శివపురాణము, పర్ణశాల సుప్రభాతమ్, శ్రీరామచంద్ర సుప్రభాతమ్, చన్నూరు వెంకటేశ్వర సుప్రభాతమ్, కాళేశ్వర ఖండము మొదలగునవి రచించి, ప్రచురించారు.

ముదిగొండ వీరేశలింగశాస్త్రి గారు 1967 సెప్టెంబరు 15న మరణించారు. ●



# శివ వేంకటీయ గ్రంథమాల

నందగిరి వెంకట అప్పారావు పంతులు గారు 1868 ఆగస్టు 19 న కృష్ణాజిల్లా అంగలూరులో జన్మించారు. తల్లి శేషమాంబ, తండ్రి వేంకట నరసింహులు.

పంతులు గారు విద్వత్కవి. అష్టావధాని. కురుపాల సంస్థానాధీశ్వరుల దర్బారులో జరిగే సాహిత్య చర్చలలో పాల్గొని విశేష సన్మానాలు, బహుమతులు పొందారు.

అడివి సాంబశివరావు గారితో కలసి 'శివ వేంకటీయ గ్రంథమాల'ను స్థాపించారు. వీరు దాదాపు పాతిక గ్రంథాలు రచించినట్లు తెలుస్తున్నది. ఆంధ్ర మేఘసందేశము,

శ్రీమద్రామాయణాద్యుత్తరకాండము, నిర్గద్యచతురముఖీ విలాసము, మైరావణ చరిత్ర, గంగిరెద్దు, శుద్ధాంధ్ర భీమసేన విజయము, బాలతొడవు, గోపికాప్రియ, సీతారామ, చండమార్తాండ, దీనసంరక్షణ, రామలింగేశ్వర, శ్రుతశైల, హనుమత్ శతకాలు, విప్రపురి ఆదికేశవ సీస శతకము, బ్రహ్మపుత్రాభ్యుదయము మొదలగునవి రచించి, ప్రచురించారు.

అడివి సాంబశివరావు గారు 1864 లో కృష్ణాజిల్లా కైకలూరు తాలూకా బొమ్మినంపాడు గ్రామంలో జన్మించారు. తల్లి సీతమ్మ, తండ్రి పాపయ్య. విద్వత్కవి. భాషా సాహిత్యాలపై మక్కువ. అచ్చతెనుగు, ఆంధ్ర భాషా చరిత్ర వంటి విషయాలపై వ్యాసాలు రాశారు. పురాణాలలోని విషయాలను ఆధునిక విజ్ఞానదృష్టితో పరిశీలించి విశ్లేషించారు. భుజంగ నృపాలశేఖర శతకము, అశ్వలక్షణ సారసంగ్రహము, శుద్ధాంధ్ర మేఘసందేశము, అంగలూరు గ్రామ భూగోళము, జగన్నాథీయము, ఆంధ్ర మత్స్య పురాణము, బిల్వనాథీయము, సాత్రాజితీ పరిణయము, హైమవతీ పరిణయము, సత్యనారాయణ చరిత్ర, అద్వైతమతాదర్శము మొదలైన పాతిక గ్రంథాలు రచించారు, ప్రచురించారు. ●



## ఆర్ష వాఙ్మయ ముద్రణాలయం

పరవస్తు వేంకట రంగాచార్యులు గారు 1822 లో విశాఖపట్నంలో జన్మించారు. తల్లి మంగతాయారమ్మ, తండ్రి శ్రీనివాసాచార్యులు. బహుభాషావేత్త, శతావధాని. తర్క వ్యాకరణ వేదాంత శాస్త్రాలలో, షట్శాస్త్రాలలో, షడ్దర్శనాలలో నిష్ణాతులు. ఎనిమిదవ ఏటనే 'కుంభకర్ణ విజయమనే' సంస్కృత కావ్యం రచించారు. భారతదేశంలో మహా మహోపాధ్యాయ బిరుదు పొందిన మొదటి నలుగురులో ఒకరు. సంగమవలస సంస్థాన విద్వత్కవులు. చీకటి, విజయనగరం మొదలైన సంస్థానాలలో సన్మానాలు పొందారు.

విశాఖపట్నంలో 'ఆర్ష విద్యా పాఠశాల', 'ఆర్ష వాఙ్మయ ముద్రణాలయం' నెలకొల్పి ఆర్ష వాఙ్మయ ప్రచారం చేశారు. ఉపనిషత్తులను ఆంధ్రీకరించి ఆర్ష ధర్మ ప్రచారం కావించారు. కాళిదాసు అభిజ్ఞాన శాకుంతల నాటకాన్ని మొట్టమొదట అనువదించినది రంగాచార్యులు గారే! ఇంగ్లీషులో విజ్ఞానసర్వస్వాన్ని సంకలనం చేశారు.

శ్రీమన్నిశ్శంక చరిత్రము - రాజామృత్యుంజయ నిశ్శంక బహద్దరు వారి వంశ చరిత్రను తెలిపే ప్రబంధము - పరవస్తు శ్రీనివాసాచార్యులు గారు సర్వ శబ్ద సంబోధిని అనే నిఘంటువు తయారుచేస్తూ మరణిస్తే, రంగాచార్యులు గారు దానిని పూర్తి చేశారు.

కుంభకర్ణ విజయమ్, అభిజ్ఞాన శాకుంతలం, మంజుల నైషధమ్, శ్రీమన్నిశ్శంక చరితము, కమలినీ కలహంసము, ఆంగ్లాధిరాజ్య స్వాగతము, సృష్టి సంగ్రహము, ప్రవృత్తి వాదము, శబ్దార్థ సర్వస్వ నిఘంటువు, గుణసంగ్రహము, ఆర్ష మత సంగ్రహము, కళా సంగ్రహము మొదలగునవి రచించి, ప్రచురించారు.

1900 లో ఆచార్యులు గారు మరణించారు. ●



## అజంతా ప్రింటర్స్

నల్లాన్ చక్రవర్తి శ్రీనివాస పార్థసారథి, శ్రీనివాస వేంకటాచార్యులు గారలు శ్రీనివాస సోదరులుగా ప్రసిద్ధి. తిరుపతి వేంకట కవుల శిష్యులు. కృష్ణాజిల్లా జగ్గయ్యపేటలో జన్మించారు. తల్లి అలమేలు మంగతాయారమ్మ. తండ్రి వెంకట్రామ నరసింహాచార్యులు. సోదరులిద్దరూ హిందీ, సంస్కృతం, ఇంగ్లీషు భాషలలో పండితులు. అనేక అష్టావధానాలు, శతావధానాలు చేశారు. సాంఖ్య, న్యాయ, వేదాంత, దర్శన శాస్త్రాలలోనూ, అలంకార వ్యాకరణాది శాస్త్రాలలోనూ ప్రవీణులు. సంస్కృతంలో కూడా కొన్ని రచనలు చేశారు.

'అజంతా ప్రింటర్స్' పేరుతో అనేక పుస్తకాలు ప్రచురించి సాహిత్య సేవ చేశారు. వీరి రచనలు ప్రాచీనులను, నవీనలను కూడా అలరించాయి. సంస్కృతం నుండి, తమిళం నుండి అనువాదాలు చేశారు. పండితరాయల 'భామినీ విలాసం'లోని అన్యాపదేశం (సెటైర్) లోని కొన్ని శ్లోకాలు; 'తిరువాయ్ మొళి', 'తిరుపల్లాండు' ప్రబంధాలలోని కొన్ని పాశురాలు అనువదించారు. 'విచిత్ర రాఘవం' 'రామభద్ర దీక్షితుడు సంస్కృతంలో రాసిన జానకీ పరిణయానికి స్వేచ్ఛానుసరణ. ఈ రచన మద్రాసు, ఆంధ్ర విశ్వవిద్యాలయాలలో భాషాప్రవీణకు పాఠ్యంగా ఉండేది.

విచిత్ర రాఘవము, ఓరుగల్లు కోట, ఉపాహారము, ఆంధ్రరాష్ట్రం, శబరి, ఈశ్వర విజయము, సంస్కృత వ్యాకరణ శాస్త్ర చరిత్ర, అమరవాణి, శ్రీరామ విరూపాక్ష శాసనాల ఆంధ్ర వ్యాఖ్యానం, కాతన్త్ర వ్యాకరణ వృత్తి, శబ్దసిద్ధి, శ్రీ యాదగిరి లక్ష్మీ నృసింహ

ప్రపత్తి, మహాత్మాగాంధీ, దాదాభాయి నౌరోజీ, వల్లభాయి పటేల్, లాల్ బహదూర్ శాస్త్రి మొదలగునవి రచించి, ప్రచురించారు.

శ్రీనివాస పార్థసారథి 1914 డిసెంబరు 24న జన్మించారు. శ్రీనివాస వేంకటాచార్యులు 1916 అక్టోబరు 22న జన్మించారు, 1980 జూలై 21న మరణించారు. ●



# కవితా సామ్రాజ్యము

మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి (శర్మ) 1900 ఆగస్టు 23న నెల్లూరు జిల్లా పట్టాభిరామాపురంలో జన్మించారు. తల్లి వెంకట సుబ్బమ్మ, తండ్రి నృసింహ సిద్ధాంతి. తెలుగు, సంస్కృత భాషలలో పేరున్న పండితులు. వావిళ్ళ ముద్రణాలయంలో పండితులుగా చాలా గ్రంథాలు పరిష్కరించారు.

నంద్యాల మునిసిపల్ హైస్కూలులో ప్రధానాంధ్ర పండితులుగా పనిచేశారు. భాషా సాహిత్యాల గురించి పత్రికలలో అనేక వ్యాసాలు వ్రాశారు. నంద్యాలలో 'కవితా సామ్రాజ్యము' అనే ప్రచురణ సంస్థను స్థాపించి చాలా గ్రంథాలు ప్రచురించారు. హంసవింశతికి పీఠిక వ్రాశారు. మహిష శతకానికి తాత్పర్యం వ్రాశారు. దక్షిణామూర్తి స్తోత్రాన్ని ఆంధ్రీకరించారు. ప్రియదర్శిని నాటకాన్ని అనువదించారు. వాడుకభాషలో చంద్రశేఖర శతకం రచించారు. సత్యనారాయణ మాహాత్మ్యాన్ని తెలుగులోనూ, సంస్కృతంలో కూడా రచించారు.

మద్దులపల్లి వారు ప్రముఖుల జీవితచరిత్రలను గ్రంథస్తం చేశారు. గాదేపల్లి వీరరాఘవ శాస్త్రి జీవితము, బ్రహ్మస్వామి జీవితచరిత్ర, మేడవరం సుబ్రహ్మణ్య శాస్త్రి జీవితచరిత్ర, గోకర్ణం రామాభట్టువారి చరిత్ర, ఇంద్రగంటి శేషావధానులు చరిత్ర మొదలైనవి సమాచార సంపన్నంగా ఉన్నాయి.

కావ్యతీర్థ, దక్షిణామూర్తి స్తోత్రం, ఖద్దరు, అమృత సందేశం, కుక్కల మొర, భక్తపోతరాజీయము, కవితా రచన, పెండ్లి రాయబారము, దైవ ప్రార్థన, శమంతకోపాఖ్యానము, త్యాగరాజు మొదలగునవి రచించి, ప్రచురించారు.

మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు 1972 అక్టోబరు 2న మరణించారు. ●



# సావిత్రీ గ్రంథమండలి

శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి 1888లో జన్మించారు. నాటకకర్త, సంస్కృతాంధ్ర భాషలలో మంచి పండితులు. మొదట విజయవాడలోని మైలవరం కంపెనీ కోసం, తరువాత ఏలూరులోని మోతేవారి కంపెనీ కోసం నాటకాలు రచించారు. అపూర్వమైన దృశ్య పరికరాలతో ప్రదర్శించిన వీరి నాటకాలకు మంచి పేరు వచ్చింది.

'సావిత్రీ గ్రంథమండలి' ని స్థాపించి నాటకాలు ప్రచురించారు. 'సావిత్రి' నాటకం మొదట మైలవరం కంపెనీ వారికోసం రచించారు. దీనినే తరువాత మోతే వారి కోసం దానిని తిరిగి కొత్త కల్పనలతో రచించారు. దీనినే తరువాత చలనచిత్రంగా తీశారు. 'లలిత' పది అంకాల నాటకం. ఇతివృత్తం కాల్పనికం. సనాతన మతానికి ఆధునిక నాగరికతకు జరిగే సంఘర్షణ ఇందులో చక్కగా చూపారు. 'బృంద'లో తొమ్మిది అంకాలున్నాయి. బృంద కాలనేమి పుత్రిక, జలంధరుని భార్య. ఈమెను విష్ణుమూర్తి వంచించగా, అతన్ని శపించి, తనను తాను దహించుకుంటుంది. బృంద భస్మమైన చోట గింజలు చల్లగా, తులసిమొక్కలు మొలిచాయని పురాణ కథనం. ఈ కథను కొమ్మూరి బాలబ్రహ్మానంద దాసు 'బృందాదేవి చరిత్ర' అనే హరికథగా రాశారు. దీనిని 'తులసీ మాహాత్మ్యము' అనే పేరుతో త్వరకవి రామకృష్ణయ్య యక్షగానం వ్రాశారు. 'దివోదాసు' సనాతన ధర్మ ప్రశస్తిని చాటే పది అంకాల నాటకం. మానవుడు అత్యంత శక్తి సంపన్నుడైనా దేవుని చేతిలో కీలుబొమ్మ అని దానిలో వివరించారు.

శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి గారు 1954లో మరణించారు. ●



# నిగమార్థ చంద్రోదయ గ్రంథమాల

రాప్తాటి సుబ్బదాసు అనంతపురం జిల్లా ధర్మవరంలో జన్మించారు. తల్లి లక్ష్మమ్మ, తండ్రి నారప్ప. దేశభక్తి పరాయణులు. హరికథకులు. హఠయోగాశ్రమం స్థాపించిన యోగి. సంఘసంస్కరణ భావాలు గలవారు. దేశం కోసం సత్యాగ్రహంలో పాల్గొని 1941లో జైలుశిక్ష అనుభవించారు.

'నిగమార్థ చంద్రోదయ గ్రంథమాల' ను స్థాపించి, తమ రచనలను ప్రచురించారు. దేశభక్తి, అహింసాతత్త్వ ప్రచారం లక్ష్యంగా రచనలు చేశారు. పశు యజ్ఞ ఖండం

అహింసా సిద్ధాంతాన్ని బోధించే రచన. ఆత్మారామ గేయాలు స్త్రీలు పాడుకోవడానికి అనువుగా రచించారు.

ధర్మవరంలో 'వాణీ మనో వినోదిని' అనే నాటక సంస్థను స్థాపించి, అభిజ్ఞాన జయదేవ నాటకాన్ని రచించి, తామే నాయకపాత్ర ధరించి ప్రదర్శించారు. దీనికి శ్రీ మహాభక్త విజయంలోని కథ మూలం. సతీమణి కోరిక మీద 'పరమేశ్వర శతకం' రాయడం ప్రారంభించి, ఆమె మరణించిన తరువాత పూర్తి చేసి ఆమెకి అంకిత మిచ్చారు.

పశుయజ్ఞ ఖండం, ఆత్మారామ గేయాలు, అభిజ్ఞాన జయదేవ, పరమేశ్వర శతకం, మానస గీతావళి, హితబోధిని మొదలగునవి రచించి, ప్రచురించారు. ●



# కమల కుటీర్ ముద్రణాలయం

**వం**గూరి సుబ్బారావు గారు 1886లో పశ్చిమగోదావరి జిల్లా తణుకు తాలూకా సిద్ధాంతం గ్రామంలో జన్మించారు. తల్లి ముత్యమాంబ, తండ్రి నరసయామాత్యుడు. కథారచయితగా, నవలాకర్తగా, సాహిత్య విమర్శకులుగా, పత్రికా సంపాదకులుగా, వాఙ్మయ పరిశోధకులుగా సుప్రసిద్ధులు. పానుగంటి లక్ష్మీనరసింహం గారి శిష్యులు.

'కమలకుటీర్ ముద్రణాలయం' స్థాపించి, గ్రంథ ప్రచురణలు చేశారు. సువర్ణలేఖ పత్రికలో తెలుగు కవులను గురించి విమర్శనాత్మకమైన వ్యాసాలు వ్రాసి, పండితుల మన్ననలు పొందారు. కొంతకాలం వసుంధర అనే పత్రిక నడిపారు. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము రెండు సంపుటాలు, శతక కవుల చరిత్ర, వేమన జీవిత చరిత్ర, ఆంధ్ర క్షత్రియులు సుబ్బారావు గారి పరిశోధనా పాటవానికి నిదర్శనాలు. తెలుగులో వచ్చిన మొట్టమొదటి ఆంధ్ర వాఙ్మయ చరిత్రము వీరిదేనని కట్టమంచి రామలింగారెడ్డి గారు ప్రశంసించారు. ఆంధ్రుల చరిత్ర, ఆంధ్ర సాహిత్య చరిత్ర దీనిలో ప్రధానంగా ఉన్నాయి.

వసంతలేఖ, కమలామణి లేఖలు రాసి లేఖా సాహిత్యాన్ని పెంపొందించారు. వీరు రచించిన మణిమేఖల కథలోని వీరపత్నిని స్ఫూర్తిగా గ్రహించి బోడేపూడి వెంకటరావు గారు 'ఆంధ్ర తేజము' రాశారు.

ఆంధ్ర వాఙ్మయ చరిత్ర, శతక కవుల చరిత్ర, ప్రభాతము, వేమన, ఆంధ్ర క్షత్రియులు, గుల్‌బహారు, మణిమేఖల, దుర్గేశనందిని, ఇందిర, కాంచనమాల, రాయల రాజనీతి, పన్నుల పద్ధతులు, వ్యవహార చంద్రిక, లలితకుమారి, ఈసపు నీతి కథలు, అరేబియన్ నైట్స్ కథలు, రోహిణి, రత్నపురి, మాయ, బసివిరెడ్డి, చంద్రవదన, తారా శశాంకం, తిరుమల మొదలగునవి రచించి, ప్రచురించారు.

వంగూరి సుబ్బారావు గారు 1923లో పరమపదించారు. ●



## స్నేహలతా కవితా సమితి

వాజపేయయాజుల రామసుబ్బారాయుడు గారు 1933లో మహబూబ్‌నగర్ జిల్లా ఉరవకొండ దగ్గరలోని కొల్లాపురంలో జన్మించారు. తండ్రి వెంకటరమణయాజుల. జటప్రోలు సంస్థానకవి.

రామసుబ్బారాయుడు, వెంకట నారాయణలు కలసి జటప్రోలులో 'స్నేహలతా కవితా సమితి' అనే ప్రచురణ సంస్థను స్థాపించారు. కొల్లాపురం స్నేహలతా కవితా సమితిగా ప్రసిద్ధమైంది.

జటప్రోలు రాజా సురభి వెంకట జగన్నాథరావు బహద్దరు ఈ సంస్థను ప్రోత్సహించారు. ఈ సంస్థ ద్వారా దాదాపు 130 గ్రంథాలు వెలువడినవి. ఏటేటా వార్షిక సంచికలు ప్రచురించేవారు. ఈ వార్షిక సంచికలలో గద్య పద్య రచనలు, ప్రత్యేక వ్యాసాలు ఉండేవి. దీనిని 'వైజయంతి' పేరుతో ప్రచురించేవారు.

రామసుబ్బారాయుడు గారు కాశీయాత్ర, చిత్ర ప్రశంస, రామామృతము, పళ్ళమాంబికా తారావళి, కవితా కాంతా విహారము, సీతాకళ్యాణము, ఆరోగ్య వేంకటేశ్వర, ఆరోగ్య రాజేశ్వరీ శతకాలు, జానకీపతి శతకము, మాయాదేవి కల, ఆరోగ్య మాధవము, శ్రీకృష్ణ భారత ప్రాశస్త్యము, శివతారావళి, శ్రీ రాజా వెంకట కృష్ణారావు బహద్దరు వారి జీవితము, జటప్రోలు రాజా వెంకట లక్ష్మారావు జీవిత చరిత్ర మొదలగునవి రచించి, ప్రచురించారు. ●



# సాహిత్య లతా గ్రంథాలయం

కర్లపాలెం కృష్ణారావు గారు 1904లో ప్రకాశం జిల్లా చీరాలలో మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. కందుకూరి వీరేశలింగం గారి ప్రభావానికి లోనై సంఘ సంస్కరణకు పాటుపడ్డారు. వితంతు వివాహాది విషయాలలో ఆచరణ శీలంగా ప్రవర్తించిన కొంతమందిలో ఒకరు. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి ప్రభావానికి ఆకర్షించి జాతీయోద్యమంలో పాల్గొని 1930లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని పదమూడు నెలలు జైలుశిక్ష అనుభవించారు. 1927 నుండి సాహిత్య రంగంలో కృషి చేశారు. 1935 జనవరిలో చీరాలలో 'సాహిత్యలతా గ్రంథాలయం' స్థాపించారు. 1942లో మకాం గుంటూరుకు మార్చారు. వీరు స్వయంగా రచించిన పుస్తకాలు, కొంతమంది యువ రచయితలను ప్రోత్సహించి, వారి రచనలను గ్రంథాలయం పేర ప్రచురించారు.

కృష్ణారావు గారు హిందూ మతం, మల్లెపూలు అనే ఖండకావ్యం, ప్రణయ సామ్రాజ్యం, హైమవతి, విద్యార్థి విపత్తు, మంత్రి తిమ్మరుసు, నాయకురాలు, ఆంధ్రదేశము మొదలైన నవలలు; మతసేవ, పరీక్ష, వివేకానంద మొదలైన నాటకాలు దాదాపు ఇరవై వరకూ రచించి, ప్రచురించారు.

కర్లపాలెం కృష్ణారావు గారు 1951 మార్చిలో గుంటూరులో మరణించారు. ●



# కవిచంద్ర గ్రంథమాల

కోట సుబ్రహ్మణ్య శాస్త్రి, కోట సత్య రంగయ్య శాస్త్రి అన్నదమ్ములు. ప్రకాశం జిల్లా కనిగిరిలో జన్మించారు. కోట సోదర కవులు పేరుతో జంటకవులుగా ప్రసిద్ధి. సంస్కృతాంధ్రాలలో పండితులు. అష్టావధానాలు చేశారు. మద్రాసులో 'కవిచంద్ర గ్రంథమాల' ను స్థాపించి చాలా గ్రంథాలను అచ్చువేశారు.

సోదరులిద్దరూ కలసి గద్య పద్య రచనలు, నవలలు, నాటకాలు ఎనభైకి పైగా రచించారు. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సోదరునితో కలిసి రచించినవి, విడిగా రచించిన

వీరి రచనలు మొత్తం 156 వరకు ఉన్నాయి. జాతీయ నాయకుల చరిత్రను సులభశైలిలో రచించి ప్రచారం చేయటం, సారస్వత వైజ్ఞానిక విషయాలను పాఠకులకు అందించడం లక్ష్యంగా వీరు గ్రంథరచన చేపట్టారు.

పొట్టి శ్రీరాములు జీవితాన్ని 'త్యాగమూర్తి' కావ్యంగా చాలా సభలలో శ్రావ్యంగా చదివి శ్రోతలను మెప్పించారు. ఆంధ్ర విష్ణువు చరిత్రను 'ఆంధ్రశ్రీ'గా, కన్యకాపరమేశ్వరి శతకం 'కన్యకాపురాణము' గా రచించారు.

సోదరులిద్దరూ కలసి – ఆంధ్రశ్రీ, కన్యకాపురాణం, కుమారవిలాసము, గీతానవనీతము, గోదా కళ్యాణము, త్యాగమూర్తి, శ్రీరామచంద్ర నీరాజనము మొదలగునవి రచించారు.

సుబ్రహ్మణ్య శాస్త్రి గారు – ఆంధ్ర సాహిత్య సర్వస్వం (నిఘంటువు), కలువకొలను, గులాబిరేకులు, ఏరువాక, కనకవర్షం, మల్లెమొగ్గలు, శబరిబాల, విశ్వనాథ నాయకుడు, వీర తెలంగాణా, వరూధిని, రాయలనాటి కవులు మొదలగునవి రచించి, ప్రచురించారు. ●



# శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల

**ఘూ**ళీ కృష్ణమూర్తి, దేవదానం, కల్లూరు అహోబలరావు అనే కవిత్రయం 1931లో బళ్ళారిలో 'శ్రీకృష్ణ దేవరాయ గ్రంథమాల'ను స్థాపించారు. రాయలసీమ కవి పండితుల గ్రంథాలను ప్రచురించి ప్రచారం చేయాలని వీరి ఆశయం. అభిమానుల నుండి, వదాన్యుల నుండి సేకరించిన విరాళాలే ఈ గ్రంథమాల మూలధనం.

సంవత్సరానికి మూడు పుస్తకాలను ప్రచురించాలి. ఆ పుస్తకాలను ఒక్క రూపాయికి చందాదారులకు ఇవ్వడం వారి ధ్యేయం. 1933 నాటికి తొమ్మిది పుస్తకాలను ప్రచురించారు. కల్లూరు అహోబలరావు గారు ఉద్యోగరీత్యా 1934లో అనంతపురం వెళ్ళవలసి వచ్చింది. గ్రంథమాల కూడా అనంతపురానికి తరలింది. దేవదానం గారు కడపకు మకాం మార్చారు. గ్రంథ ప్రచురణ కుంటుపడింది.

ఉగాది కానుకలు గ్రంథమాలకు అనుబంధంగా ప్రతి సంవత్సరం వెలువడేవి. 1953 నాటికి మరో నాలుగు పుస్తకాలు అచ్చయ్యాయి. 1956లో అహోబలరావు గారు హిందుపురం చేరుకున్నారు. 1957లో గ్రంథమాలను మరల ఉద్ధరించి 1975 నాటికి పదిగ్రంథాలను ప్రకటించారు.

స్వార్థత్యాగము, భావతరంగములు, ప్రేమసుందరి రెండు సంపుటాలు, వేమభూపాల విజయము, విప్రనారాయణ నాటకము, మాధవాశ్రమము రెండు భాగాలు, కుముదవల్లి, పూదోట, రాయలసీమ, రత్నరాశి, స్వప్న వల్లభుడు, భక్తమందారము, జ్ఞానవాశిష్ట రత్నములు, అమృతాభిషేకము, షాజహాన్, తపోవనము, మయూర ప్రహసనము, భక్తపోతరాజీయము, వివేకానందము, ఉగాది స్వర్ణ భారతి, రాయలసీమ రచయితల చరిత్ర మొదలగునవి ప్రచురించారు. ●



# విశ్వేశ్వర గ్రంథమాల
## (శివాగమ గ్రంథమాల)

కోటీశ్వరులైన ఆకారపు నరసింగం గుప్తాగారు ఓరుగల్లు (వరంగల్)లో విశ్వేశ్వర ఆలయమును నిర్మించడమే కాకుండా, 'విశ్వేశ్వర గ్రంథమాల'ను స్థాపించి, శైవమతానికి సంబంధించిన అనేక గ్రంథాలను ప్రకటించారు.

నీలకంఠారాధ్యులవారి బ్రహ్మసూత్ర భాష్యము; ముదిగొండ కోటయ్య శాస్త్రి గారి శైవ సర్వస్వము; ముదిగొండ నాగలింగశాస్త్రి గారి శంభు శతకము, నలవిలాసము; ఉమానందనాథుని నిత్యోత్సవ నిబంధము; మల్లంపల్లి జ్వాలా వీరభద్ర శాస్త్రి గారి శివ సందర్శన విధి; మల్లంపల్లి కనకదుర్గా వరప్రసాద్ గారి శైవమతం అతి ప్రాచీనం; ముదిగొండ వీరభద్రారాధ్యుల వారి గౌరీ కళ్యాణము, పుత్రప్రదాన లీల; ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రి గారి కుమార కళ్యాణము, శివతాండవలీల, శైవకల్పద్రుమము; ఋషభ యోగి గారి శివ కవచము; జ్ఞాన సుధారసము, లింగాష్టోత్తర శతనామాబ్జ మాలిక; మల్లంపల్లి వీరేశ్వర శర్మ గారి శంకరారాధ్య చరిత్ర, కాంచీఖండము; ముదిగొండ వీరలింగశాస్త్రి గారు సంపాదించిన స్త్రీల పాటలు, శివభజన శ్లోకములు, గురుభజన శ్లోకములు, కాశీ విశ్వేశ్వర భజన కీర్తనలు మొదలగునవి ప్రచురించారు.

విశ్వేశ్వర గ్రంథమాల స్థాపకులైన ఆకారం నరసింగం గుప్తా గారే 'శివాగమ గ్రంథమాల'ను స్థాపించి, మల్లంపల్లి జ్వాలా వీరభద్రశాస్త్రి గారి రచనలు శివసందర్శన విధి, శివమహోత్సవ విధి, శివప్రతిష్ఠా విధి, శైవాగమకారిక, శివసంప్రోక్షణ విధి మొదలగునవి ప్రచురించారు. ●



## ఇతిహాస పరిశోధక గ్రంథమాల

కొడాలి లక్ష్మీనారాయణ గారు గుంటూరు జిల్లా మోపర్రు గ్రామంలో జన్మించారు. వృత్తిరీత్యా ఉపాధ్యాయులు, ప్రవృత్తి రీత్యా చారిత్రక పరిశోధకులు. 1940లో 'ఇతిహాస పరిశోధక గ్రంథమాల'ను స్థాపించారు. దాదాపు ముప్పైఅయిదు గ్రంథాలు ప్రచురించారు.

భారత విదుషీ రత్నాలు, అల్లూరి సీతారామరాజు, వీరబ్రహ్మేంద్రస్వామి, ప్రాచీన యోగులు, ప్రాచీన భారత ప్రజాస్వామికులు, వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు, నాగార్జున, సూర్యదేవర రాజస్య చరిత్ర, మోదుకూరు గ్రామచరిత్ర, మోపర్రు గ్రామచరిత్ర, విస్మృత ఆంధ్రనాయకుల చరిత్ర, ముసునూరు వీరులు, భద్రాచల రామదాసు చరిత్ర, వాల్మీకి రామాయణ విమర్శనము, మహాభారత విమర్శనము, ప్రాచీన భారతీయ గ్రంథాలయ చరిత్ర, వ్యాసావళి, ప్రాచీన ప్రజాప్రభుత్వ రాజ్యములు - ఎన్నికలు, ప్రాచీన విద్యావిధానము, దాస్యచరిత్రము మొదలగునవి రచించి, ప్రచురించారు.

ఇంగ్లీషులో - ఇంగ్లీషు ఎడ్యుకేషన్, నెహ్రూఇజమ్ ఇంటర్‌ప్రిటెడ్ మొదలగునవి రచించి, ప్రచురించారు.

కొడాలి లక్ష్మీనారాయణ గారు 1985 ఫిబ్రవరి 26న మరణించారు. ●



## అంబా దర్శన గ్రంథమాల

కావూరి గోపదేవ్ 1896 గుంటూరు జిల్లా కూచిపూడి గ్రామంలో జన్మించారు. తల్లి అంబ, తండ్రి రామయ్య. స్వయంగా సంస్కృతం నేర్చుకున్నారు. లాహోర్, ఢిల్లీ నగరాలలో వేద, వేదాంగాలు అభ్యసించి స్వగ్రామం చేరారు. 1939లో పండిత గంగాప్రసాద్ ఉపాధ్యాయ ప్రేరణతో సంఘంలో గల మూఢాచారాలను, అంధ విశ్వాసాలను తొలగించి వైదికధర్మాన్ని, వైదికసంస్కృతిని ప్రచారం చేయాలని కూచిపూడిలో 30 మంది సభ్యులతో ఆర్య సమాజాన్ని స్థాపించారు. 1945లో 'అంబా దర్శన గ్రంథమాల'ను స్థాపించి దాదాపు వంద గ్రంథాలు ప్రచురించారు. స్వయంగా వారే అరవై అయిదు గ్రంథాలు రచించారు.

సత్యార్థ ప్రకాశిక, నిరుక్తం, మనం హిందువులమా, ఆస్తికవాదం, ఆర్షధర్మ మీమాంస, శ్రీమద్భగవద్గీత, ఋగ్వేద భాష్య భూమిక, షోడశ సంస్కార విధి, ఈశావ్యాసోపనిషత్తు, కేనోపనిషత్తు, కఠోపనిషత్తు, ప్రశ్నోపనిషత్తు, ముండకోపనిషత్తు, మాండూక్యోపనిషత్తు, తైత్తిరీయోపనిషత్తు, ఐతరేయోపనిషత్తు, ఛాందోగ్యోపనిషత్తు, బృహదారణ్యకోపనిషత్తు, శ్వేతాశ్వతరోపనిషత్తు, కౌషీతకోపనిషత్తు, మైత్రాయణీయ ఉపనిషత్తు మరియు దర్శనాలు మొదలగునవి సుమారు 70 వైదిక గ్రంథాలను రచించి, ప్రచురించారు.

1996 అక్టోబరు 21న విజయదశమినాడు తనువు చాలించారు. ●



## సారస్వత కుటీర గ్రంథమాల

తిమ్మావజ్ఝల కోదండరామయ్య గారు 1925 ఫిబ్రవరి 2 న నెల్లూరుజిల్లా గునుపాటివారి పాలెంలో జన్మించారు. తల్లి కామాక్షమ్మ, తండ్రి శివరామయ్య.

కోదండరామయ్య గారు చెన్నై (మద్రాసు)లో 'సారస్వత కుటీర గ్రంథమాల' అనే ప్రచురణ సంస్థను స్థాపించారు. వారు రచించిన, అనువదించిన, సంపాదించిన రచనలను ప్రచురించారు.

స్వప్నవాసవదత్తము, పాలవెల్లి, కవిరాజశిఖామణి, కళాపూర్ణోదయ ప్రశంస, కేయూరబాహు చరిత్ర, అన్నమాచార్యోదాహరణము, భువనవిజయ నాటకము, తెనుగు





మఱుగులు, కావ్యవిశేషాలు, సారంగధర, తమిళ సాహిత్య చరిత్ర, తొల్కాప్పియమ్, శిలప్పదికారమ్ మొదలగునవి ప్రచురించారు.

తిమ్మావజ్ఝల కోదండరామయ్య గారు 1981 మే 26న కీర్తిశేషులైనారు. ●



# అముద్రిత గ్రంథ చింతామణి

పూండ్ల రామకృష్ణయ్య గారు నెల్లూరుకు దగ్గరలోని దువ్వూరు గ్రామంలో 1860 జూలై 14న జన్మించారు. నెల్లూరులో రమానిలయ ముద్రాక్షరశాలను నెలకొల్పి అముద్రిత గ్రంథ చింతామణి పత్రికను నడిపారు. ఇది నెల్లూరు మండలములో తొలి తెలుగు పత్రిక. రామకృష్ణయ్య గారు ఒకవైపు పత్రికను నడుపుతూ, మరొకవైపు తాళపత్రాలను సేకరించి, పరిష్కరించి పుస్తక ప్రచురణ చేస్తూ వచ్చారు. మిత్రవింద పరిణయము, హరిశ్చంద్ర నలోపాఖ్యానము, వసుంధరా పరిణయము, యాదవ రాఘవ పాండవీయము మొదలైన ప్రాచీన గ్రంథాలను పరిష్కరించి, చక్కని పీఠికలు చేర్చి అచ్చువేశారు. ఈ విధంగా అముద్రిత గ్రంథాలను ముద్రించడమనే తమ పత్రిక ప్రధాన ఆశయాన్ని సార్థకం చేసుకున్నారు. రామకృష్ణయ్య గారికి చాటుపద్యాల సేకరణపై మంచి ఆసక్తి. వందకు పైగా చాటు పద్యాలను సేకరించి అముద్రిత గ్రంథ చింతామణిలో ప్రచురించారు. వాటిలో కొన్ని వేటూరి ప్రభాకరశాస్త్రి గారి సంకలనంలో, కొన్ని దీపాల పిచ్చయ్యగారి సంకలనంలో చోటు చేసుకున్నాయి. కాని పూండ్ల వారిని మాత్రం చాటుపద్య సంకలనకర్తగా ఎవరూ స్మరించలేదు.

అముద్రిత గ్రంథ చింతామణి పత్రిక పేజీలలో మండపాక పార్వతీశ్వర కవి గారి పద్యమాలికలు నాలుగోవంతు ఉండేవంటే అతిశయోక్తి కాదు. పార్వతీశ్వర కవికి, పూండ్ల వారికి తటవర్గ బిందుపూర్వక యతి విషయంలో అభిప్రాయ భేదం వచ్చి వారి మిత్రత్వానికి భంగం కలిగింది. కొక్కొండ వెంకటరత్నం పంతులు గారి 'బిల్వేశ్వరీయాన్ని' రామకృష్ణయ్య గారు ఎంతో సహృదయంతో సమీక్షించినా, ముందుగానే తమకు కలిగిన సందేహాలను కొక్కొండ వారి సముఖంలో వినిపించగా, పంతులు గారు ఏ సమాధానం చెప్పక, పరుషంగా 'సంజీవని' పత్రికలో కొక్కొండ వారు సమాధానం చెప్పడంతో అది పెద్ద సాహిత్య యుద్ధంగా మారింది.

రామకృష్ణయ్య గారి జీవితం సాహిత్యసేవకు, పత్రికా నిర్వహణకు అంకితమైంది. మండపాక పార్వతీశ్వర శాస్త్రి గారి జీవిత సంగ్రహము, ఉకారాది సంధి విషయం, 'అమృత లలితగీత తారావళి మొదలగునవి రచించారు. 1904 సెప్టెంబరు 1న మరణించారు. ●



# చంద్రికా గ్రంథమాల

**బ**లిజేపల్లి లక్ష్మీకాంతం గారు 1881 డిసెంబరు 23 న గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా ఇటికలపాడు గ్రామంలో జన్మించారు. తల్లి ఆదిలక్ష్మమ్మ, తండ్రి నరసింహశాస్త్రి.

కవిగా, దేశికులుగా, నాటకకర్తగా, నటులుగా, సంగీతజ్ఞులుగా ప్రసిద్ధులు. అనేక సంస్థానాలు సందర్శించి అవధానాలు చేశారు. స్వాతంత్ర్య సమరాన్ని గురించి గానం చేసిన కవులలో ఒకరు. గుంటూరులో వివిధ రకాలైన ఉద్యోగాలు చేశారు. 1922లో చల్లపల్లి సంస్థానాధిపతి యార్లగడ్డ అంకినీడు ప్రసాదరాయనిం వారి సహాయంతో 'చంద్రికా గ్రంథమాల'ను నెలకొల్పి అనేక ఉత్తమ గ్రంథాలను ప్రచురించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని రెండు సంవత్సరాలు జైలుశిక్ష అనుభవించారు. 'గుంటూరు ఫస్టు కంపెనీ' అనే హిందూ నాటక సమాజం స్థాపక సభ్యులు. ఈ కంపెనీ కోసం నాటకాలు రాశారు. సత్యహరిశ్చంద్ర నాటకం చాలా ప్రసిద్ధి. సి. పుల్లయ్యగారి సహాయంతో చలనచిత్ర రంగంలో ప్రవేశించారు.

సత్రాజితీయ నాటకము, శివానందలహరి శతకము, బుద్ధిమతీ విలాసము, ఉత్తర రాఘవము, స్వరాజ్య సమస్య లేక స్వరాజ్యరథము, రామాయణ సుందరకాండ, బ్రహ్మరథము, మణిమంజూష, విజ్జిక మొదలగునవి రచించి, ప్రచురించారు.

పౌరాణిక, జానపద, సాంఘిక చలన చిత్రాలకు కథ, సంభాషణలు, పాటలు రచించి, నటించారు. లక్ష్మీకాంతంగారు 1953 జూన్ 30న మరణించారు. ●



# వ్యాస ప్రచురణాలయం

ఉప్పులూరి కాళిదాసు గారు 1915 డిసెంబరు 4న విజయనగరంలో జన్మించారు. తల్లి భూదేవి, తండ్రి లక్ష్మీకాంతం. దాసుగారు - ఖాసా సుబ్బారావు వంటి ప్రముఖ పత్రికా సంపాదకులకూ, మల్లాది రామకృష్ణశాస్త్రి వంటి రచయితలకు, న్యాయమూర్తి సర్ ముత్తా వెంకట సుబ్బారావు వంటి ప్రముఖులకు, చక్రవర్తుల రాజగోపాలాచారి వంటి స్వాతంత్ర్యోద్యమ రాజకీయ నాయకులకూ ఆంతరంగికులు. వీరు సంపన్న కుటుంబంలో పుట్టినా, పత్రికారంగానికి అంకితమైనారు.

తెలుగు పాఠకులకు విజ్ఞానం, వినోదం, వికాసం కలిగించే రచనలు అందించే పత్రిక స్థాపించాలని, యువ రచయితలనూ, కళాకారులను ప్రోత్సహించాలనే ఉద్దేశంతో 1939లో మద్రాసులో గరిమెళ్ళ సత్యనారాయణ గారితో కలసి 'ఆనందవాణి' వారపత్రికను స్థాపించారు. 1939 జనవరి 2 న రాజాజీ ముఖచిత్రంతో తొలిసంచిక వెలువడింది. 1945లో వారపత్రికను మాసపత్రికగా మార్చారు. 1960లో మకాం మద్రాసు నుండి హైదరాబాదుకు మార్చారు.

హైదరాబాదులో 'వ్యాస ప్రచురణాలయం' స్థాపించి రాజాజీ రచించిన రామాయణం, భారతం, భాగవతం గ్రంథాలను ప్రచురించారు.

సంపాదక ప్రముఖులు యం. చలపతిరావు గారి 'ఆల్ ఇన్ ఆల్' రచనకు అనువాదంగా 'ఎందరో మహానుభావులు' గ్రంథంగా అనువదించి, ప్రచురించారు. శ్రీ వేంకటేశ్వరస్వామి అనే పుస్తకం రచించి, ప్రచురించారు. కాళిదాసు గారు 1995 అక్టోబరు 27 న మరణించారు. ●



# విజ్ఞాన వల్లికా గ్రంథమాల

సీపిరి ఆంజనేయులు గారు 1891 జూన్ 1న ధర్మవరంలో జన్మించారు. అనంతపురం, బళ్ళారిలలో అధ్యాపకులుగా పనిచేశారు. ప్రజలలో విద్యా విజ్ఞాన వికాసాలకి పాటుపడాలని సంకల్పించి తమ ఇంటిలో 'శ్రీ క్రియాశక్తి యొడయరు గ్రంథాలయం' స్థాపించారు. ధర్మవరం చెరువును శ్రీ క్రియాశక్తి యొడయరు నిర్మించి,

తన తల్లి ధర్మాంబ జ్ఞాపకార్థం గ్రామనిర్మాణం గావించి, ధర్మవరం అనే పేరు పెట్టారు. ఆ మహనీయుని పేరుతో ఆంజనేయులు గారు గ్రంథాలయం స్థాపించారు.

'విజ్ఞాన వల్లికా గ్రంథమాల'ను స్థాపించి, దాని ద్వారా 36 గ్రంథాలను ప్రచురించి, ఎందరో పండితులను ప్రోత్సహించి, రచింపచేసి ప్రచురించారు. విజ్ఞానవల్లిక పత్రిక నడిపారు.

ఆంజనేయులు గారు రాయలసీమ కథలు, విద్యానగర చరిత్ర, ధ్రువోపాఖ్యానము, ధర్మవరం చరిత్ర, కబీరుదాసు చరిత్ర, స్వర్ణఖని, అన్యాపదేశము, రామదాసు చరిత్ర, గౌతమ బుద్ధ చరిత్ర, శారద, కుముదవల్లి, వధువు, జీర్ణ విజయనగర దర్శిని మొదలగునవి రచించి, ప్రచురించారు.

ఆంజనేయులు గారు 1974 నవంబరు 27న మరణించారు. ●



## సరస్వతీ గ్రంథ మండలి

అద్దేపల్లి లక్ష్మణస్వామి గారు రాజమండ్రిలో సరస్వతి పవర్‌ప్రెస్‌ను నెలకొల్పారు. సరస్వతీ గ్రంథ మండలి, అద్దేపల్లి అండ్ కో నెలకొల్పి పుస్తక ప్రచురణకు పూనుకున్నారు. జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి గారి రచనలు, అనువాదాలు – ఆరీన్ మణేలా, దుర్గాదాసు, భిన్న హస్తం, కాలసర్పం, మేవాడు పతనం, నూర్జహాన్, శ్యామల, చంద్రగుప్త మొదలగునవి ప్రచురించారు.

తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి గారు సరస్వతి గ్రంథమండలి సంపాదకులుగా కొంతకాలం ఉన్నారు. శివశంకరశాస్త్రి గారు స్వయంగా నవలలు రచించారు. టి. శంకరశాస్త్రి పేరుతో రఘునాథరాజు, తేజసింగ్ అనేవి ప్రచురితమైనాయి. శాస్త్రి గారు బెంగాలీ నుండి అవక్షణీయ, కాంచనమాల, కపాలకుండలి, రాజపుత్ర, జీవన సంధ్య, మాధవీకంకణము, రమాసుందరి, నీరద, కుంకుమభరిణ, జీవనసంధ్య, మహారాష్ట్ర జీవన ప్రభాతము అనువదించారు.

భమిడిపాటి కామేశ్వరరావు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, పురిపండా అప్పలస్వామి మొదలగు వారి రచనలు – నవలలు, నాటకాలు, కథలు, చరిత్రలు, ప్రబంధాలు, పౌరాణికాలు, వైజ్ఞానికాలు, వైద్య గ్రంథాలు మొదలగునవి ప్రచురించారు.

అద్దేపల్లి లక్ష్మణస్వామి భవ్యభారతి, ఋతువిలాసము, కావ్యశ్రీ, కవితా విపంచి, ఏరువాక, ఖడ్గతిక్కన, రణతిక్కన, మధురభారతి, రణపాలీయము, శ్రీవాణి శతకము, శకుంతలా పరిణయము మొదలగునవి రచించి, ప్రచురించారు. వరదాచార్యులుగారి 'గాయత్రీ నీతిగీతావళి'ని సంస్కృతంలోకి అనువదించారు.

అద్దేపల్లి లక్ష్మణస్వామి వారి మరణానంతరం 1950 లో వారి వారసులు కథాసరిత్సాగరంను సంస్కృతం నుండి తెనిగింపచేసి లక్ష్మణస్వామి గారికి అంకిత మిచ్చారు. ఆరు భాగాలలో కొంత శంకరశాస్త్రి గారి కుమారులు కృత్తివాస తీర్థులు అనువదించారు. ●



# హితకారిణీ గ్రంథమాల

ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణ గారు విశాఖపట్నంలో జన్మించారు. చారిత్రక నాటకాల రచనలో నూతన చైతన్యం తెచ్చిన రచయిత. 1913లో విశాఖపట్నంలో 'హితకారిణీ గ్రంథమాల' అనే ప్రచురణ సంస్థ స్థాపించారు. యజ్ఞనారాయణ సంపాదకులు–

సుబోధకంగా ఉండే శైలిలో నాటకాలు, నవలలు, కథాసంపుటాలు ప్రచురించడం ఆశయంగా ఏర్పడిన సంస్థ. గ్రంథమాల మీద వచ్చే లాభం ఆర్యమతాభివృద్ధికి, బీద విద్యార్థుల సహాయార్థం ఖర్చు చేయడానికి ఏర్పడిన సంస్థగా సంపాదకులు ప్రకటించారు. సంవత్సరానికి మూడు పుస్తకాలకు తక్కువ కాకుండా ప్రచురించేవారు.

యజ్ఞనారాయణ గారు స్వరాజ్య ఉద్యమంలో ప్రభావితులై నాటకాల ద్వారా తన భావాలను ప్రచారం చేయడానికి పూనుకున్నారు. దేశభక్తి ప్రబోధానికి అనుగుణమైన చారిత్రక కథలను గ్రహించి నాటకాలుగా తీర్చిదిద్దారు. రసపుత్ర విజయం, అపూర్వ నాగరకత–భారతమాత దేశభక్తి స్ఫోరకంగా ఉన్నాయి. నాందిలో భారతమాత వందనం, 'రాజపుత్ర తేజః పుంజం'లో ఆంధ్రమాత ప్రశస్తి చేశారు. విశాఖపట్నంలో వీరి ఆధ్వర్యంలో ఏర్పడిన హితకారిణి సమాజం వారు వీరి నాటకాలను ప్రదర్శించేవారు.

రసపుత్ర విజయము, అపూర్వ నాగరకత - మూడు భాగాలు, భారతమాత, రాజపుత్రతేజః పుంజం (రాణాప్రతాపసింహుడు), శ్రీకృష్ణ దాననము, చిత్రకథలు మొదలగునవి రచించి, ప్రచురించారు. ●



# కాలచక్రం ప్రచురణలు

వెలగల వీర్రెడ్డి గారు పశ్చిమగోదావరి జిల్లా పెనుమంట్ర దగ్గర సత్తా రామేశ్వరం గ్రామంలో 1912లో జన్మించారు. సత్తా రామేశ్వరం తిరునాళ్ళలో రామలింగేశ్వర స్వామి ఉత్సవ విగ్రహంతోపాటు గాంధీగారి ఫొటోకూడా రథం మీద ఉంచి ఊరేగించిన ఘనత గల ఊరు. పాలవెంకన్నగారి ప్రోత్సాహంతో 'సెట్టి బలిజ' పత్రిక ప్రారంభించారు. 1935లో మేనమామ వీరారెడ్డి గారితో కలసి 'కాలచక్రం' అనే మాసపత్రికను ప్రారంభించి, నిర్వహించారు. దానికోసం 1936లో ప్రింటింగ్ ప్రెస్ నెలకొల్పారు. ఈ ప్రెస్‌లో రెడ్డిప్రభ, విశ్వమిత్ర, విప్రకుల దర్పణము, రహస్య పత్రికలైన వీరభారతి, స్వతంత్రభారత్ మొదలగు పది పత్రికలు మరియు విశ్వసాహిత్య మాల ప్రచురణలు కొన్ని ఈ ప్రెస్‌లోనే ముద్రితమయ్యేవి. ఆర్థిక ఇబ్బందుల కారణంగా 1939లో ప్రెస్‌ను మార్టేరుకు మార్చారు. 1940లో కాలచక్రం పత్రిక ఆపివేయవలసి వచ్చింది. స్వాతంత్ర్యోద్యమకాలంలో ఇంటి మీద, ప్రెస్ మీద పోలీసులు దాడులు చేశారు.

వీర్రెడ్డి గారు 1963లో మహీధర జగన్మోహనరావు గారి ప్రోత్సహ సహకారాలతో 'కాలచక్రం ప్రచురణలు' ప్రారంభించారు. చిలకమర్తి లక్ష్మీనరసింహం, వసంత వెంకటరావు, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, మహీధర జగన్మోహనరావు, మహీధర నళినీ మోహనరావు గార్లు రచించిన మరియు అనువదించిన పుస్తకాలు, పాపులర్ సైన్స్ పుస్తకాలు ప్రచురించారు. 1970 వరకు దాదాపు ముప్పై గ్రంథాలు వెలువరించారు. ●



# ఆధునిక గ్రంథమాల

కొమ్మూరి వెంకట్రామయ్య గారు తెనాలిలో వార్త దినపత్రిక కొంతకాలం నడిపి, తరువాత 'ఆధునిక గ్రంథమాల' అనే ప్రచురణ సంస్థను స్థాపించారు. వెంకట్రామయ్య గారు ప్రచురణ, మార్కెటింగ్ బాధ్యతలు చూచేవారు. వీరి కుమారుడు కొమ్మూరి సాంబశివరావు రచయిత. మూడు ఏడులు (777), మూడు తొమ్మిదులు (999) అంకెల పేర్లతో నవలలు వ్రాయమని తండ్రి అడిగేవారు. సాంబశివరావుకి అంతగా నచ్చేది కాదు. మార్కెట్ తెలిసిన వెంట్రామయ్యకు అంకెలపేర్లకు మంచి గిరాకీ ఉందని తెలుసు.

కొమ్మూరి సాంబశివరావు 1926 అక్టోబరు 26న గుంటూరుజిల్లా తెనాలిలో జన్మించారు. గుడిపాటి వెంకటాచలం స్వయాన పెదనాన్న. కొడవటిగంటి కుటుంబరావు వీరి బావమరిది. వీరి సోదరి ఉషారాణి భాటియా.

కొమ్మూరి వందకు పైగా క్రైంథిల్లర్లు, డిటెక్టివ్‌లు, సాంఘిక నవలలు, కథలు రచించి, ప్రచురించారు. ఈయనకి డిటెక్టివ్ రచయితగా ముద్రపడింది. ఈయన యుగంధర్ పాత్రను డిటెక్టివ్‌గా సృష్టించారు. ●



# గోదా గ్రంథమాల

కృష్ణాజిల్లా ముసునూరులో శ్రీమాన్ కె.టి.ఎల్. నరసింహాచార్యులు గారు 1957లో 'గోదా గ్రంథమాల'ను స్థాపించారు. బాలసాహితి, భక్తిసాహితి, యువసాహితి అనే శీర్షికల క్రింద దాదాపు ఏభై గ్రంథాలు ప్రచురించారు.

బాలసాహితి శీర్షికలో విరించిగారి లోకమాన్యుడు; దశిక సూర్యప్రకాశరావు గారి జమునా లాలస దంపతులు; మధురాంతకం దొరస్వామి గారి దేశోద్ధారకుడు; నరసింహాచార్యులు గారు రచించిన లోకమాత, మహర్షి, వివేకానందుడు, అమరజ్యోతి మొదలగునవి ప్రచురించారు.

భక్తిసాహితిలో నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు గారి పరకాల విలాసము, బిడాల మోక్షము; తి.న.చ.సం. జనగ్నాథ తిరువెంకటాచార్యులు గారి రామానుజ శతకము, నరసింహాచార్యులు గారి రచనలు వకుళభూషణ నాయకి, ద్వాదశ సూరి చరిత్ర మొదలగునవి ప్రచురించారు.

యువసాహితిలో నవకథావిపంచి, మధురాంతకం రాజారాం కథలు, సూర్యదేవర సంజీవదేవ్‌గారి సమీక్షా రేఖలు, కాకాని నరసింహారావు గారి ఆంధ్రభోజుడు మొదలగునవి ప్రచురించారు. ●



## శృంగార కావ్య గ్రంథమండలి

'శృంగార కావ్య గ్రంథమండలి' ప్రచురణ సంస్థకు మల్లాది రామకృష్ణశాస్త్రి గారు 'పేట్రన్ సెయింట్'. వారి ఆదేశాల మేరకు గ్రంథాలను సేకరించి ప్రచురణకర్త ప్రచురించేవాడు. 'హంస వింశతి' శాస్త్రి గారి అభిరుచి వల్లనే మంచి ముద్రణకు నోచుకుంది. కొన్ని తాటాకు పుస్తకాలను ఓపికగా పరిశీలింపజేసి మంచి పాఠాలను వారు నిర్ణయించేవారు.

మల్లాది రామకృష్ణశాస్త్రి గారు ఒకనాడు కొన్ని తాటాకు పుస్తకాలు తెరచి చల్లని సాయంకాలం పాఠాలు పోలుస్తూ, కాఫీకో - సిగరెట్టుకో వెళ్ళారు. ఇప్పుడే వచ్చేస్తాం కదా అని తెరచిన పుస్తకాలను డాబామీద అలాగే ఉంచారు. వెళ్ళినచోట ఏ మిత్రుడో పట్టుకున్నాడు. అతని తర్వాత వాన పట్టుకుంది. మరునాడు.... మించిపోయింది. కొన్ని తాటాకు పుస్తకాలు దురదృష్టవశాత్తు అక్షరాలా వానలో కొట్టుకుపోయాయి. ఈ సంగతి చెప్తున్నప్పుడు అంత వానా శాస్త్రి గారి కళ్ళలోంచి కురిసింది అన్నారు రావూరి సత్యనారాయణరావు గారు.

క్రీడాభిరామం, ముద్దుపళని రాధికాస్వాంతనం వెంపటి నాగభూషణం గారి పీఠికలతో వెలువడినాయి. ●



## దేశీయ నాటక గ్రంథమాల

చక్రావధానుల మాణిక్యశర్మ గారు పశ్చిమగోదావరి జిల్లా నరసాపురంలో జన్మించారు. తల్లి నరసమాంబ, తండ్రి నరసింహుడు.

శర్మగారు నాటకకర్త. 'దేశీయ నాటక గ్రంథమాల'ను స్థాపించి, చాలా నాటకాలు ప్రచురించారు. ఎక్కువగా చారిత్రక, పౌరాణిక విషయాలను తీసుకుని రచించారు.

వీరి నాటకాల పేర్లు చాలావరకు సంగీతానుబంధంగా ఉన్నాయి. ఆ రోజుల్లో నాటకాలలో పాటలకు, పద్యాలకు ఆదరణ పెరగడం వల్ల పాటలు, పద్యాలు ఎక్కువగా రచించి నాటకం పేరుకు ముందు 'సంగీత' అని చేర్చేవారు. శర్మ గారి నాటకాలన్నీ ప్రదర్శనానుగుణంగా ఉండి బహుళ ప్రచారం పొందాయి.

చంద్రకాంత, అనసూయ, చిత్రనళినీయము, నవరత్న చింతామణి, పద్మవ్యూహం, భూలోకరంభ, మహారాష్ట్ర విజయము, లంకాదహనం, లవకుశ, సంగీత గులేబకావళి, సంగీత జయంత జయపాల, సంగీత ప్రహ్లాద, సంగీత రావణ నాటకము, సంగీత విష్ణులీలలు, సంగీత శశిరేఖ, సంగీత శ్రీకృష్ణ రాయబారము, సంగీత శ్రీకృష్ణలీలలు, సంగీత సత్యవిజయము, సంగీత సారంగధర, సంగీత సావిత్రి, సంగీత స్త్రీ సాహసం, సంపూర్ణ మహాభారతం, సంపూర్ణ రామాయణం మొదలగునవి రచించి, ప్రచురించారు.



# ఆంధ్ర భాషాభి వర్ధనీ సంఘం

**కృ**ష్ణాజిల్లా మచిలీపట్నంలో 'ఆంధ్ర భాషాభి వర్ధనీ సంఘం' అనే సాహితీ సంస్థ స్థాపించబడింది. వేమవరపు రామదాసు పంతులు గారు కార్యదర్శి. పదివేల రూపాయల మూలధనంతో ప్రారంభమై 1911-12 నాటికి షుమారు పదిహేను గ్రంథాలు ప్రచురించిన సంస్థ.

భాషాభివృద్ధి సర్వతోముఖమైన దేశాభివృద్ధికి తోడ్పడుతుందనే ఉద్దేశంతో అవతరించిన సంస్థ. సనాతన, ఆధునిక, ఇతిహాసాలు, ప్రకృతిశాస్త్రాలు, అన్యదేశ దార్శినిక గ్రంథాలు, మహాపురుషుల జీవిత చరిత్రలు, గణిత - రాజనీతి - అర్థశాస్త్రాలు మొదలగునవి తెలుగుతో లేని లోపం తీర్చడానికి ఈ సంస్థ పూనుకున్నది.

ఉన్నవ లక్ష్మీనారాయణ గారి రచన 'అక్బరు చరిత్ర' 1908లో ప్రచురించబడింది. ప్రభావతి, భారత ధర్మ దర్శనము, విద్యాసాగరుని చరిత్ర, రాజారామమోహనరాయ చరిత్ర, స్వాతంత్ర్య దర్శనము, మహారాష్ట్ర చరిత్ర మొదలగునవి ప్రచురించారు. ●



# కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు

కాళహస్తి తమ్మారావు గారు 1875 ప్రాంతంలో రాజమహేంద్రవరం (రాజమండ్రి)లో 'కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు'ను, 1882లో 'సంస్కృతాంధ్ర బుక్ డిపో'ను స్థాపించారు. పుస్తక ప్రచురణ ద్వారా జాతీయోద్యమంలో తమ వంతు పాత్రను నిర్వహించారు. బ్రిటీషు ప్రభుత్వం నిషేధాన్ని ధిక్కరించి యువకులలో సాహిత్య పిపాసను రెచ్చగొట్టే అనేక రాజకీయ విప్లవ సాహిత్యాన్ని సాహసవంతంగా వెలువరించారు. 1930లో జైలు జీవితం కూడా అనుభవించారు. తమ్మారావు గారి కుమారులు - లచ్చయ్య, సూర్యప్రకాశం, పాపయ్యలింగం, వెంకట రమణలు రంగంలో నిలచి తండ్రి అడుగుజాడలలో ఇతోధికోత్సాహంతో ప్రచురణోద్యమాన్ని కొనసాగించారు.

బాలాంత్రపు వెంకటరావు గారి ప్రథమ రచన 'స్త్రీల వ్రతకథలు' మూడు భాగాలు వీరే ప్రచురించారు. స్త్రీల కోసం, పెద్దల కోసమే కాక పిల్లల కోసం 'బాలసాహిత్య నికేతన్' అనే ప్రత్యేక విభాగాన్ని నడిపి బొమ్మల రామాయణం, బొమ్మల భారతం, బొమ్మల భాగవతం మొదలైన బాలసాహిత్యం వెలువరించారు. ●



# అభినవాంధ్ర గ్రంథమాల

శ్రీపాద కామేశ్వరరావు గారు 1877లో విజయనగరంలో జన్మించారు. తల్లి నరసమ్మ, తండ్రి ఉమామహేశ్వరరావు. భారతదేశంలోని ఇతర భాషలలోని మంచి నాటకాలను అనువదించి తెలుగువారికి అందజేశారు.

కామేశ్వరరావు గారు 1927లో రాజమహేంద్రవరం (రాజమండ్రి)లో 'అభినవాంధ్ర గ్రంథమాల'ను స్థాపించారు. చంద్రగుప్త, సోహ్రాబు - రుస్తుం, భారతమణి, సీత, లీలావతి సులోచనములు, రాణాప్రతాపసింహ, శివాజీ శీలము, బిల్వమంగళ, చిత్తవృత్తి, శ్రీ మాధవాచార్య విద్యారణ్య మొదలగు నాటకాలు; కొత్తల్లుడు, గడుసు గంగయ్య, పిసినిగొట్టు మొదలైన ప్రహసనాలు; సాహిత్య మీమాంస; నాటక విమర్శ మొదలైన విమర్శనాత్మక గ్రంథాలను రచించి, ప్రకటించారు.

కామేశ్వరరావు గారు 1943 మార్చి 3న మరణించారు. మరణానంతరం ఈ గ్రంథమాల ఆగిపోయినది. ●



## శ్రీరామ నరసింహ గ్రంథ రత్నమాల

గంధం శ్రీరామమూర్తి, ఇర్రింకి నరసింహమూర్తి గారలు కలసి 'శ్రీరామ నరసింహమూర్తి కవులు' పేరుతో జంట కవిత్వం చెప్పారు. శతావధానులు, బహుగ్రంథ కర్తలు. గద్వాల ప్రభువైన కృష్ణరాయ భూపాలుని సంస్థానాస్థాన కవులు. 'శ్రీరామ నరసింహ గ్రంథ రత్నమాల' అనే ప్రచురణ సంస్థను నెలకొల్పి, నిర్వహించారు.

వీరు రచించిన శ్రీమదాంధ్ర భాగవతం అయిదు సంపుటాలలో ప్రచురితమైంది. అనేక రచనలు సంస్కృతగ్రంథాలకు అనువాదాలు. వీరి చాటువులు, శతావధాన పద్యాలు చాలా ప్రసిద్ధి పొందాయి.

మణిరత్నమాల, తేటగీత భగవద్గీత, మహాభారత యుద్ధము, తీర్థయాత్రా ప్రదర్శిని, పుష్పబాణ విలాసము, యదార్థ రామాయణము, ప్రేమగీతమ్, ప్రథమ సహస్రము, బాపూజీ సూక్తి రత్నావళి, మహాత్మాగాంధీ, ఆశ్రిత పారిజాత శతకము మొదలగునవి రచించి, ప్రచురించారు. ●



## శ్రీనివాస ముద్రాశాల

వాసా సూర్యనారాయణ శాస్త్రి 1882లో విశాఖజిల్లా చీపురుపల్లి తాలూకా పోతాయవలస గ్రామంలో జన్మించారు. తల్లి వెంకమ్మ, తండ్రి వెంకటరామయ్య. పర్లాకిమిడిలోని ఉన్నత పాఠశాలలో తెలుగు పండితులుగా పనిచేశారు. ఇంగ్లీషు స్వయంగా నేర్చుకున్నారు. కవి పండితుల జీవితచరిత్రలు గ్రంథస్థం చేశారు.

రాజమండ్రిలో 'శ్రీనివాస ముద్రాక్షరశాల' నెలకొల్పి అనేక గ్రంథాలు అచ్చు వేశారు. శ్రీనివాస విభూతి, కపాలేశ్వర విభూతి వంటి గ్రంథాలను తెలుగులోనూ, సంస్కృతంలోనూ కూడా రచించి, ప్రచురించారు.

తాతా సుబ్బరాయశాస్త్రి జీవితచరిత్ర, చరఖా వ్రతం, కాశీనాథుని నాగేశ్వరరాయ చరిత్ర, కోదండ రామశతకం, ముకుందమాల, లోకమాన్య బాలగంగాధరతిలక్ చరిత్ర, శ్రీశైల మల్లికార్జునస్వామి సుప్రభాతము మొదలగునవి రచించి, ప్రచురించారు.

సూర్యనారాయణశాస్త్రి గారు 1961 డిసెంబరు 3న మరణించారు. ●



# మానవసేవా గ్రంథమాల

కందుల శ్రీమన్నారాయణ గారు 1911 లో రాజమహేంద్రవరం (రాజమండ్రి)లో 'మానవ సేవ' సచిత్ర మాసపత్రికను నెలకొల్పారు. నాళం కృష్ణారావు గారు సంపాదకులు.

ఇది సాహిత్య పత్రిక. కవితలు, గద్య పద్య రచనలు, గ్రంథ విమర్శలు, సమకాలీన నవలలపై విమర్శలు, వ్యాసాలు మొదలైనవి దీనిలో ప్రచురించేవారు.

తల్లాప్రగడ సూర్యనారాయణరావు గారి 'హేలావతి', కవికొండల వెంకటరావు గారి 'అనాథాభ్యుదయము' దీనిలో మొదట వెలువడ్డాయి. ఈ పత్రికలో ప్రచురించిన కొన్నింటిని 'మానవసేవా గ్రంథమాల' తరఫున పుస్తక రూపంలో వెలువరించారు. ఈ పత్రికను మొదట కొన్నాళ్లు చిలకమర్తి లక్ష్మీ నరసింహం గారి మనోరమ ముద్రణాలయంలో అచ్చు వేసేవారు. ●



# ఆంధ్ర భాషా సంరక్షక సమాజము

1914 జులైలో కాకినాడలో 'ఆంధ్ర భాషా సంరక్షక సమాజము' అనే సాహితీ సంస్థ స్థాపించబడింది. స్థాపకులు పురాణపండ మల్లయ్యశాస్త్రి, కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి. గ్రాంథిక భాషా వాద ప్రచారానికి స్థాపించబడిన సంస్థ. గ్రాంథిక భాషా వాదాన్ని బలపరిచే రచనలు చేయడం, ప్రచురించడం ఈ సమాజం ధ్యేయం. వీరు తమ

ఉద్దేశాన్ని వివరిస్తూ 'ఆంధ్ర భాషా సంరక్షక సమాజోద్దేశములు' అనే పేరుతో 1914లో చిన్న గ్రంథం ప్రచురించారు. బుర్రా శేషగిరిరావు గారి 'విమర్శాదర్శ' మనే చిన్న పుస్తకం మీద విమర్శాదర్శ విమర్శా దర్శనము' అనే మూడు సంపుటాల గ్రంథాన్ని 1915లో ఈ సంస్థ ద్వారా ప్రచురించడం జరిగింది. ●



## నవీనవాణీ గ్రంథమండలి

కృష్ణాజిల్లా ఉయ్యూరుకు సమీపాన గల కలవపాముల గ్రామంలో 1914లో 'సత్య సుబ్రహ్మణ్యేశ్వర కవులు' స్థాపించారు.

గద్య పద్యాత్మక గ్రంథాలు, నవీనశైలిలో కూర్చి ప్రచురించడం ఆశయంగా ఏర్పడిన సంస్థ. సంవత్సరానికి ఆరు గ్రంథాలు ప్రచురించాలని సంకల్పం.

హరి సత్యశాస్త్రి, జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారలు కలసి 'సత్య సుబ్రహ్మణ్యేశ్వరులు' పేరుతో జంటకవులై రచనలు చేశారు. రామాయణ సంగ్రహము రచించారు.

నవీనవాణి, గణపతి, భారతి, వరంగల్ సంపూర్ణ శతావధానము, నళిని, దశమ గ్రహము మొదలగునవి ఈ సంస్థ తొలి ప్రచురణలు. ●



## కవితా సమితి

1926 మే 6న విశాఖపట్నంలో శ్రీశ్రీ, పురిపాండా అప్పలస్వామి, వడ్డాది సీతారామాంజనేయ కవి కలసి 'కవితా సమితి' స్థాపించారు. 'కవిగారు' అని పిలవబడే మారేపల్లి రామచంద్రశాస్త్రి గారు దీనికి శాశ్వత అధ్యక్షులు. మొదటి సమావేశం 1926 నవంబరు 20న మారేపల్లి రామచంద్రశాస్త్రి కవి గారి ధర్మాశ్రమములో జరిగింది. షుమారు 45 మంది సభ్యులున్నారు. ఎందరో యువకవులకు ప్రోత్సాహమిచ్చిన సంస్థ. శ్రీశ్రీ రచించిన 'ప్రభవ' కావ్యంతో మొదలుపెట్టి దాదాపు నలభై పుస్తకాలు

ప్రచురించడం జరిగింది. ఈ సంస్థ ప్రచురించిన వార్షిక సంచికలు విలువైనవి. గంటి శ్రీరామచంద్రమూర్తి, స్థానాపతి రుక్మిణమ్మ. ఆరుద్ర మొదలగువారు ఈ కవితా సమితిని నిర్వహించారు. 1933లో మల్లంపల్లి సోమశేఖర శర్మ గారి అధ్యక్షతన ఆంధ్ర కవుల ఛాయాచిత్ర ప్రదర్శన ఏర్పాటు చేసిన సంస్థ. ●



# పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు కమిటీ

1930లో పశ్చిమ కష్ణాజిల్లా కాంగ్రెసు కమిటీ తరపున దిగవల్లి వెంకట శివరావు గారు రాజకీయ ప్రచార పుస్తకములను పేరుతో సత్యాగ్రహ చరిత్ర, నిర్భాగ్య భారతము, దరిద్ర నారాయణీయము, సత్యాగ్రహబోధిని, విదేశ వస్త్ర బహిష్కరణ, బ్రిటీషు వస్తు బహిష్కరణ, పాంచజన్యము అను జాతీయగీతముల సంపుటి, బార్డోలీ సత్యాగ్రహ విజయము అను చిన్న పుస్తకములు రచించగా, కాంగ్రెసు కమిటీ వారు ప్రచురించారు. వీటితోపాటు చెరుకుపల్లి వెంకటప్పయ్య గారు రచించి ఉప్పు సత్యాగ్రహము, త్రాగుడు మానుట అను చిన్న పుస్తకములను కూడా ఈ కమిటీ ప్రచురించినది.

ఈ పది పుస్తకములను పశ్చిమగోదావరి జిల్లా కాంగ్రెసు కమిటీ వారును, తూర్పు గోదావరి జిల్లా కాంగ్రెసు కమిటీవారు పునర్ముద్రణలు చేశారు. ●



# అనువాద గ్రంథమండలి

విశాఖ మండలం తలవరంలోఎర్రాపాత్రుని కూర్మినాయుడు గారు 'అనువాద గ్రంథమండలి'ని స్థాపించారు. ప్రధాన పోషకులు గేదెల శ్రీరాములు నాయుడు గారు.

ఇతర భాషలలోని ఉత్తమ రచనలను తెలుగు పాఠకులకు పరిచయం చేయటం, విభిన్న సాహిత్య ధోరణులతో తెలుగు భాషకు పరిపుష్టం చేయడం ఈ మండలి ఆశయాలు. వాటి మేరకు గ్రంథ మండలి వారు తెలుగు పాఠకులకు పరభాషా వాఙ్మయ పరిజ్ఞానం కలుగ జేశారు. హిందీ, బెంగాలీ రచనలను ఎక్కువగా తెలుగులోకి

అనువదించారు. మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రి గారు అనువదించిన 'యమున' 1933లో అనువాద గ్రంథమండలి ద్వారానే ప్రకటితమైంది. ఎన్నో గ్రంథాల ముద్రణకు ఈ సంస్థ సహాయం చేసింది. ●



# ఆంధ్ర సారస్వత సంఘము

1911 లో విజయనగరంలో 'ఆంధ్ర సారస్వత సంఘము' అనే సాహితీసంస్థ ఏర్పడింది. గిడుగు వెంకట రామమూర్తి పంతులు, సెట్టి లక్ష్మీనరసింహం, కిళాంబి రామానుజాచార్యులు, బుర్రా శేషగిరిరావు మొదలైనవారు కలసి దీనిని స్థాపించారు.

గ్రాంథిక వ్యావహారిక భాషావాదాలలో శిష్ట వ్యావహారిక భాషను ఆమోదిస్తూ, దానిని ప్రచారం చేయడానికి ఏర్పడిన సంస్థ. విద్యావంతుల వాడుకలో ఉన్న భాషలోనే పఠన పాఠనాదులు జరగాలన్నది వీరి ఆశయం.

ఈ సంస్థకు వ్యతిరేకంగా గ్రాంథికవాదులు 1911లో మద్రాసులో ఆంధ్ర భాషా మహాసంఘము స్థాపించారు. ఇది తరువాత కాకినాడలో ఆంధ్ర సాహిత్య పరిషత్తుగా నెలకొల్పారు.

1914 జులైలో 'ఆంధ్ర భాషా సంరక్షక సమాజం' కాకినాడలో ఏర్పాటు చేశారు.



# శ్రీ కోదండరామ గ్రంథాలయం

సోంపల్లి కృష్ణమూర్తి 1907 మార్చి 5న అనంతపురం జిల్లా కొక్కల్లు గ్రామంలో జన్మించారు. తల్లి మంగాంబ, తండ్రి నంజపార్యుడు. కృష్ణమూర్తి గారి కలంపేరు 'సంపత్'. కదిరిలో నివసించారు.

విద్వత్కవి, శతావధాని. బాల్యంలోనే కవిత్వం చెప్పారు. శ్రీ కోదండరామ గ్రంథాలయం స్థాపించి, గ్రంథ ప్రచురణ చేశారు. వీరి కవిత్వం సాంప్రదాయరీతిలో ఉంటుంది.

భక్తరక్షామణి శతకము, సుపథము, వాసవీ లీలాసాభి రూపకము, మల్లికార్జున వైవవినుతి, రామాస్త్రము, పుష్పవిలాసము, కవితానంద వాల్మీకి రామాయణం – రెండు సంపుటాలు, సతీతిలక, శంకర విజయము మొదలగునవి రచించి, ప్రచురించారు.

కృష్ణమూర్తి గారు 1969లో మరణించారు. ●



## కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్

కొండపల్లి వీరవెంకయ్య గారు రాజమండ్రిలో కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్ మరియు శ్రీ సత్యనారాయణ బుక్ డిపోలను నెలకొల్పారు. సుప్రసిద్ధ రచయితల గ్రంథాలు ప్రాచుర్యం పొంది, ద్వితీయ ముద్రణ పొందినపుడో, ఆ తరువాత కాలంలోనో కాపీరైట్ కొని ప్రచురించేవారు. ఆ విధంగా గురజాడ అప్పారావు గారి కన్యాశుల్కం, ఆంధ్రప్రచారిణీ గ్రంథమండలి వారి ప్రచురణలు, చిలకమర్తి లక్ష్మీ నరసింహం గారి రచనలు, భమిడిపాటి కామేశ్వరరావు గారి రచనలు, మునిమాణిక్యం నరసింహారావు గారి రచనలు, గుర్రం జాషువా గారి ఖండకావ్యాలు, మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి గారి ఖండకావ్యాలు, వేగుచుక్క గ్రంథమండలి వారి ప్రచురణలను కొని, ప్రచురించారు. ●



## రామానుజాచార్య విద్యా సమితి

కిళాంబి రంగాచార్యులు గారు 1895 జనవరి 22న విజయనగరంలో జన్మించారు. 1939లో 'రామానుజాచార్య విద్యాసమితి'ని విజయనగరంలో స్థాపించారు. ఆధునిక కవిత్వాన్ని ప్రోత్సహించిన సంస్థ. గురజాడ వేంకట అప్పారావు గారు రవీంద్రకవిని గురించిన వ్యాసాన్ని 'ఇద్దరు రాజులు' అనే శీర్షికతో ఈ సంస్థ

ప్రచురించింది. ముత్యాలసరములు, సుభద్ర, మాటామంతీ, కొండుభట్టీయము మొదలైన గురజాడ రచనలు ఈ సంస్థ ద్వారానే ప్రచురించారు.

రంగాచార్యులు గారు పురాతన సాంఘిక పరిస్థితులు, జాతక కథలు రెండు సంపుటాలు, బుద్ధఘోషుని జీవిత చరిత్ర, నాగపంచమి కథ, నాగార్జున చరిత్రము, ధమ్మపదము, బృహస్పతి అర్థశాస్త్రం మొదలగునవి రచించి, ప్రచురించారు. ●



# సారస్వత మండలి

1943 ప్రాంతంలో గుంటూరుజిల్లా తెనాలి తాలూకా సంగం జాగర్లమూడిలో 'సారస్వత మండలి' అనే సాహితీ సంస్థ స్థాపించబడింది. జంపాల శ్యామసుందర ప్రసాద్ ఈ సంస్థకు సభాపతిగా ఉండేవారు. ఏటుకూరి వెంకట నరసయ్య ఉపాధ్యక్షులుగా, కొత్త సూర్యనారాయణ కార్యదర్శిగా ఉండేవారు.

తెలుగుజాతి చైతన్యానికి దోహదం చేసే రచనలు ప్రచురించడం ఈ మండలి ధ్యేయం.

ఏటుకూరి వారి క్షేత్రలక్ష్మి, మగువమాంచాల, సిద్ధాశ్రమం వంటి కావ్యాలను; కొత్త జగ్గయ్యచౌదరి గారి పన్నా, కళానిధి వంటి కావ్యాలను ప్రచురించారు. ●



# ఆంధ్రకేసరి గ్రంథమాల

బూర్గుల రంగనాథరావు 1917లో హైదరాబాదులో జన్మించారు. తండ్రి రామకృష్ణారావు. భావకవి. సాధనసమితి సభ్యులు. ఆంధ్ర సారస్వత పరిషత్ స్థాపకులలో ముఖ్యులు. ఆంధ్రకేసరి సంఘస్థాపకులలో ఒకరు. ఆంధ్రకేసరి గ్రంథమాల, ఆంధ్ర కేసరి మాసపత్రికలను స్థాపించి, సాహిత్యసేవ చేశారు. రంగనాథరావు గారి వ్యాసాలు

చాలా పత్రికలలో ప్రచురణ అయ్యాయి. లయాత్మకంగా, వాడుకభాషలో గేయాలు రచించారు. ప్రమోదం, ఆ యాది, వాహ్యాళి మొదలగునవి రచించారు.

ఆంధ్రకేసరి పత్రిక సంపాదకులు గుండవరము హనుమంతరావు గారు. ●



# శ్రీ గౌరీ దండక శతక వాఙ్మయ మండలి

కామవరపు సూర్యనారాయణ కవి 1906 మార్చి 15న తూర్పు గోదావరి జిల్లా ఆలమూరు గ్రామంలో జన్మించారు. తల్లి అన్నపూర్ణమ్మ, తండ్రి కామశాస్త్రి. భక్తికవి.

శ్రీ దండక రామాయణము, దశావతార దండకము, వాసవీ కన్యకా పరమేశ్వరీ దండకము, మల్లేశ్వర దండకము, శ్రీ గోదావరీ దండకం మొదలైన దండకాలను పాతికకు పైగా రచించారు.

అల్లవరంలో 'శ్రీ గౌరీ దండక శతక వాఙ్మయ మండలి' ని స్థాపించి దండకాలు, శతకాలు రచించి, ఇతరులచేత రాయించి ప్రచురించారు. అన్నీ భక్తి వేదాంత ప్రాతిపదికంగా ఉండేవి. ●



# ప్రజా సాహిత్య పరిషత్తు ప్రచురణలు

కోగంటి రాధాకృష్ణమూర్తి గారు తెనాలిలో నలందా ప్రెస్ నెలకొల్పారు. 'సమీక్ష అనే మాసపత్రిక నెలకొల్పారు. మూర్తి గారు పత్రిక ద్వారా రాడికల్ హ్యూమనిస్టు భావాలను ప్రచారం చేసేవారు. 'ప్రజా సాహిత్య పరిషత్తు' అనే ప్రచురణ సంస్థను స్థాపించారు. ఉత్తమస్థాయికి చెందిన చాలా పుస్తకాలను ప్రచురించారు.

కొంతకాలానికి సమీక్ష, ప్రజాసాహిత్య పరిషత్తు ప్రచురణలు ఆగిపోయాయి. నలందా పబ్లికేషన్స్ అనే నూతన సంస్థ వెలువడింది. 1వ తరగతి నుండి 5వ

తరగతి వరకు పాఠ్యపుస్తకాలు ప్రచురించారు. కృష్ణా, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, విశాఖ, శ్రీకాకుళం, విజయనగరం జిల్లాలు తిరిగి జిల్లా బోర్డులనూ, మునిసిపల్ స్కూళ్లలోను ఈ పాఠ్యపుస్తకాలను పెట్టించారు. ●



# ఆర్య విజ్ఞాన గ్రంథమాల

కోట వెంకటాచలం 1885 ఏప్రియల్ 21న కృష్ణాజిల్లా నూజివీడు తాలూకా మధునాపురంలో జన్మించారు. తల్లి అన్నపూర్ణమ్మ, తండ్రి చల్లా సుబ్బారాయుడు. దత్తత తల్లి లక్ష్మీదేవమ్మ, తండ్రి కోట నిత్యానందం.

వెంకటాచలం గారు బెజావాడ (విజయవాడ)లో 'ఆర్య విజ్ఞాన గ్రంథమాల'ను నెలకొల్పారు. ఆంధ్రుల పుట్టుపూర్వోత్తరాలు, అశోకుని కాలము, భారతీయ శకములు, బ్రహ్మాండ సృష్టి విజ్ఞానం, అభాసక్రైస్తవం, అద్వైతబోధిని, నిర్విచార జీవనము, మానవసృష్టి విజ్ఞానం, ధ్రువనివాస ఖండము, కలిశకవిజ్ఞానం మూడు భాగాలు మొదలైన అమూల్య పరిశోధనాత్మక గ్రంథాలు రచించి, ప్రచురించారు.

ఈ గ్రంథాలను తెలుగు సాహితీపరులు ఎంతగానో ఆదరించారు. ●



# వాఙ్మయ వినోదినీ గ్రంథమాల

దోమా వెంకటస్వామి గుప్తా గారు 1899లో కర్నూలులో జన్మించారు. తల్లి కోటాంబిక, తండ్రి గోవిందాచార్యులు.

1931లో గుప్తా గారు చెన్నపురి (మద్రాసు)లో 'వాఙ్మయ వినోదినీ గ్రంథమాల' ను స్థాపించారు. బ్రహ్మేశ్వరపురాణము, విమలానందం, దీనకల్పద్రుమము, మహాత్మాగాంధీ శతకం, లోకమాన్య తిలక్ శతకం, చంద్రిక, సంసారిపాట్లు,

ఘుంఘుమారుతము, కన్యకాపురాణము, శ్రీ పరకాల విలాసము, మూకపంచశతి, కామేశ్వరీ శతకం, యాజ్ఞవల్క్య చరిత్ర, సిరియాళు చరిత్రము, వీరరాఘవ శతకము, చంద్రకళానిదర్శనము, శ్రీ సాయి గురుచరిత్రము, చంద్రకళా సుదర్శనము, దూతంగదము మొదలగునవి రచించి, ప్రచురించారు.

దోమా వెంకటస్వామి గుప్తా గారు 1962 ఫిబ్రవరి 13న మరణించారు. ●



## శారదా పీఠ గ్రంథమాల

పిలల్లమర్రి వెంకట హనుమంతరావు గారు 1918 డిసెంబరు 31న గుంటూరు జిల్లా బ్రాహ్మణకోడూరులో జన్మించారు. తల్లి పుణ్యవతి, తండ్రి సుబ్రహ్మణ్యం.

హనుమంతరావు గారు గుంటూరులో 'శారదా పీఠ గ్రంథమాల'ను స్థాపించారు. సాహిత్య సమాలోచనము, మాధురీ మహిమ, సాహిత్య సమీక్ష, శారదా విలాసము, ఇష్టాగోష్టి, ధూపదీపాలు, ఆంధ్ర సాహిత్య చరిత్ర, నవలా సర్వస్వము, సాహిత్య సంపద, మహోదయము, రాగరేఖలు, మధుకణములు, కావ్యాలోకనము, శారదాస్తుతి, వత్సల, ఆంధ్రాభ్యుదయమ, దీపకళిక, కాపుపాటలు, అమూల్య ప్రతిబింబము, వెలుగునీడలు, పంచవటి పర్యాలోచనములు మొదలగునవి రచించి, ప్రచురించారు. ●



## ప్రగతి ప్రచురణలు

నిడమర్తి అశ్వనీ కుమారదత్తు, నిడమర్తి ఉమారాజేశ్వరరావు గారలు పశ్చిమ గోదావరి జిల్లా నిడమర్రులో 1939లో 'ప్రగతి ప్రచురణలు' స్థాపించారు. సోదరుల రచనలు, కొండేపూడి శ్రీనివాసరావు అనువాదాలు ప్రచురించారు.

కమ్యూనిస్టు సూత్రాలు, చైనా ఎర్రసైన్యం, ఫ్రెడరిక్ ఏంగిల్స్ జీవితం ఉపదేశాలు, సోవియట్ రష్యా-చైనా రాజ్యాంగాలు, వింత మనస్తత్వం, రక్తవాహిని, సంసార సుఖం, ఆడజన్మ, బారికేడ్స్ ఇన్ బెర్లిన్ కు తెలుగు అనువాదం ప్రచురించారు.

'ప్రోలెటేరియన్ సిరీస్' పేరుతో జర్మన్ నవల 'అన్నా' ప్రచురించారు. ●



# కృషి ప్రచారిణీ గ్రంథమాల

నల్గొండ మండలం సూర్యాపేటలో కొందరు దేశసేవాపరాయణులైన పెద్దలు కలసి 1923లో 'కృషి ప్రచారిణీ' గ్రంథమాలను స్థాపించారు పువ్వాడ వెంకటప్పయ్య ఆధ్వర్యంలో.

చిల్లర శ్రీనివాసరావు గారి శ్రీధర విజయం, మాడపాటి హనుమంతరావు గారి క్షాత్రకాలపు హింద్వార్యులు, జంథ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారి జర్మనీ యుద్ధము, ఊటుకూరి సత్యనారాయణరావు గారి శశికళ, వనం నరసింహారావు గారి పద్మినీబాయి, దర్శి చెంచయ్య గారి వ్యవసాయశాస్త్ర చరిత్ర మొదలగునవి ప్రచురించారు. ●



# అవ్వారి నారాయణ గ్రంథమాల

అనంతపురం జిల్లా బుక్కరాయ సముద్రం వాస్తవ్యులైన అవ్వారి నారాయణ గారు 'అవ్వారి నారాయణ గ్రంథమాల' అనే ప్రచురణ సంస్థను స్థాపించారు. రాప్తాటి ఓబిరెడ్డి గారి రాప్తాటి నిర్వచన రామాయణము, గుంటి సుబ్రహ్మణ్యశర్మ గారి జ్ఞానానంద శతకం, కుంటిమద్ది శేషశర్మ గారి ముకుంద విలాసం, తలమర్ల కళానిధి గారి గేయ సుమమాల, కలచవీడు శేషాచార్యులుగారి మేఘసందేశం, గడియారం వెంకట శేషశాస్త్రి గారి వాల్మీకీయం, మరియు అనంతపురం మండలం తెలుగు రచయితలు మొదలగునవి ప్రచురించారు. ●



# ప్రాక్ ప్రతీచీ గ్రంథమాల

కొమరాజు హనుమంతరావు గారు 1885లో జన్మించారు. రాజమహేంద్రవరం (రాజమండ్రి)లో 'ప్రాక్ ప్రతీచీ గ్రంథమాల'ను స్థాపించారు. ధర్మపుత్రుడు, ఆత్మ స్వాతంత్ర్యము, పరవిద్యలేవి, స్వీయజీవిత సమీక్ష మొదలగునవి రచించి, ప్రచురించారు.

సర్వేపల్లి రాధాకృష్ణ రచించిన హిందూజీవన పథం, ఎం.వి.ఎన్. సుబ్బారావు గారు రచించిన పాశ్చాత్య భావ ప్రపంచం మొదలగునవి ప్రచురించారు. ●



# శ్రీ భారతీ లీలా సదన ముద్రాక్షరశాల

రాజా బొమ్మరాజు బహద్దరు చిత్తూరుజిల్లా కార్వేటినగరంలో జన్మించారు. తండ్రి రాజా కుమార వేంకట పెరుమాళ్లు రాజబహద్దరు. కార్వేటినగర జమీందారులు. సాహిత్య పోషకులు. బొమ్మరాజు బహద్దరు 1885లో జమీకి వచ్చారు. పద్మావతీ పరిణయం అనే చంపూ ప్రబంధానికి కృతిపతి. 'శ్రీ భారతీ లీలా సదన ముద్రాక్షర శాల'ను నెలకొల్పి అనేక సంస్కృత గ్రంథాలను ప్రచురించారు. ●



# మనోరంజనీ ముద్రాక్షరశాల

మనోరంజనీ ముద్రాక్షరశాలను 1910 ప్రాంతంలో గద్దం వెంకన్న గారు కాకినాడలో స్థాపించారు. 'మనోరంజనీ' మాసపత్రికను నడిపారు. సంపాదకులు కాళ్ళకూరి నారాయణరావు గారు.

ప్రచురణరంగంలో దిగి రాజభక్తి, దేశభక్తి ప్రేరేపించే రచనలు ప్రచురించడం, దేశీయులకు చరిత్రజ్ఞానం కలిగించడం ఈ సంస్థ ఆశయం. ఢిల్లీ సామ్రాజ్యం తొలి ప్రచురణ. ●



# సుబోధినీ గ్రంథమాల

1914 ప్రాంతంలో 'సుబోధినీ గ్రంథమాల' అనే ప్రచురణ సంస్థ నెల్లూరులో స్థాపించబడినది. రెండు నెలలకు ఒక పుస్తకం వందపేజీలకు పైగా ఉండేటట్లు సంవత్సరానికి ఆరు పుస్తకాలు ప్రచురించడం ఈ సంస్థ లక్ష్యం.

పంచమ జార్జి చక్రవర్తి, రామతీర్థస్వామి, శంకరాచార్యులు, నివేదిత, మంజుమతి, హిందూదేశ పాలనము ఈ సంస్థ తొలి ప్రచురణలు. ●



# ఆంధ్ర కవితా విమర్శన గ్రంథమాలిక

1914లో మద్రాసులోని ప్రెసిడెన్సీ కళాశాల విద్యార్థులు - బసవరాజు అప్పారావు, సీతారామమూర్తి, వింజమూరి రంగాచార్యులు, కురుగంటి సీతారామయ్య ప్రభృతులు 'వింజమూరి మండలి'గా ఏర్పడి సాహిత్య సేవ చేశారు.

వీరే 'ఆంధ్ర కవితా విమర్శన గ్రంథమాలిక' ను స్థాపించి, కొన్ని గ్రంథాలను ప్రచురించారు. విజమూరి వారి 'పింగళి సూరనార్యుడు', కురుగంటి వారి 'అలంకార తత్త్వవిచారము' ఈ మండలి తరపున ముద్రితమైనాయి. ●



# ఆంధ్ర గ్రంథ రత్నమాల

1915 ప్రాంతంలో బరంపురంలో 'ఆంధ్ర గ్రంథ రత్నమాల' అనే ప్రచురణ సంస్థ స్థాపించబడింది. దీనికి కార్యదర్శి ఎన్. భాగీరథ. చందాదారులకు తక్కువ ధరలకు విక్రయించాలని వీరి ఉద్దేశం. సంవత్సర చందా రెండు రూపాయలు. సంవత్సరానికి మూడు గ్రంథాలు ప్రచురించేవారు. సమకాలిక సమాజానికి అవసరమయ్యే నవలలు మాత్రమే ప్రచురించాలని ఈ సంస్థ ఆశయం. భోగరాజు గారి నవలలు ఎక్కువగా వీరు ప్రచురించే వారు. కృష్ణకుమారి, లతాంగి మొదలగునవి వీరి తొలి ప్రచురణలు. ●



## ఆంధ్ర గీర్వాణ సాహిత్య పరిషత్తు

1923లో సాహిత్య రచన, విమర్శ ప్రధాన ఆశయాలుగా విజయనగరంలో 'ఆంధ్ర గీర్వాణ సాహిత్య సమ్మేళనం' అనే సంస్థ ఏర్పడింది. ఇది తరువాత 'ఆంధ్ర గీర్వాణ సాహిత్య పరిషత్తు'గా మారింది. కొల్లూరి ధర్మారావు, ఈయుణ్ణి వీరరాఘవాచార్యులు, నిడదవోలు వెంకటరావు, కిళాంబి రంగాచార్యులు, విశ్వనాథ కవిరాజు, వెంకట కాళిదాస కవులు ఈ సంస్థ నిర్వాహకులు. ●



## భవానీ గ్రంథమాల

కడపజిల్లా జమ్మలమడుగు నివాసి కలవటాల జయ రామారావు శానిటరీ ఇన్‌స్పెక్టరుగా పనిచేశారు. ఈయన 1925లో 'భవానీ గ్రంథమాల'ను స్థాపించి, తాను రచించిన నవలలూ, నాటకాలు ప్రచురించారు. సువర్ణకేసరీ కృష్ణసేన, కలియుగ దర్పణం, రేనాటి వీరుడు (ఉయ్యాలవాడ నరసింహారెడ్డి చరిత్ర) మొదలగు నవలలు; గండికోట వినాశము, గోలకొండ పతనము, తుకారాం మరికొన్ని నాటకాలు రచించి, ప్రచురించారు. జయరామారావు గారికి అవుకు సంస్థాన వారసులు వీరరాఘవరాజు గారు ఆర్థిక సహాయం అందజేశారు. ●



## ఆంధ్ర రాష్ట్ర రైతు కాంగ్రెస్

విజయవాడలో 1934 ఏప్రియల్ 22న 'ఆంధ్ర రాష్ట్ర రైతు కాంగ్రెసు' స్థాపించబడింది. ఎన్.జి. రంగా (రంగనాయకులు) సంపాదకత్వంలో ప్రతి సంవత్సరం రైతు కూలీలను ప్రబోధించే గేయ సంకలనాలను ప్రచురణ సాగించిన ప్రచురణ సంస్థ. 1949 నాటికి 12 సంపుటాలు వెలువడినవి. పన్నెండవ సంపుటం గొర్రెపాటి వెంకటసుబ్బయ్య గారి సంపాదకత్వాన వెలువడినది. ●



# అతివాద గ్రంథమండలి

అన్నాప్రెగడ కామేశ్వరరావు గారు గుంటూరులో 'అతివాద గ్రంథమండలి'ని నెలకొల్పారు. విలువ-ఖరీదు-లాభం, సోవియట్ రాజ్యాంగ చట్టం మొదలైన కొన్ని మార్క్సిస్టు గ్రంథాలను ప్రచురించారు.

పొన్నలూరి రాధాకృష్ణమూర్తి గారు రచించిన 'అల్లూరి సీతారామరాజు' జీవిత చరిత్రను 1937లో సత్తెనపల్లిలోని శ్రీ కృష్ణాప్రెస్‌లో ముద్రించి ప్రచురించారు. బ్రిటీషు ప్రభుత్వం నిషేధించిన పుస్తకాలలో ఇది ఒకటి. ●



# నవ్యకళా పరిషత్తు

1940 ప్రాంతంలో గుంటూరుజిల్లా నరసరావుపేటలో 'నవ్య కళా పరిషత్తు' అనే సాహితీసంస్థ స్థాపించబడింది. నవ్యసాహిత్యాభివృద్ధికి కృషి చేసిన సంస్థ. దీనిలో అభ్యుదయ రచయితలు దేశిరాజు కృష్ణశర్మ, అనిసెట్టి సుబ్బారావు, బెల్లంకొండ రామదాసు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం సభ్యులుగా ఉండేవారు. 'నయాగరా' అనే పుస్తకాన్ని ఈ సంస్థ ప్రచురించింది. ●



# జాతీయ జ్ఞాన మందిర్

మాగంటి బాపినీడు గారు (1895–1969) రాజకీయ రంగంలో, సాహిత్య రంగంలో దిట్ట. 1942లో 'జాతీయ జ్ఞానమందిర్' అనే ప్రచురణాలయం నెలకొల్పి, ఆంధ్ర సర్వస్వమనే సంగ్రహ విజ్ఞాన కోశాన్ని రచించి, ప్రచురించారు. 'తెలుగుతల్లి' అనే బాలల విజ్ఞాన సర్వస్వం కూడా రచించి, ప్రచురించారు. ●



# స్వాతంత్ర్య కుసుమమాల

కృష్ణాజిల్లా మచిలీపట్నంలో కాకర్లమూడి సుబ్బారావునాయుడు, కాశీనాథుని పూర్ణ మల్లికార్జునుడు, బయ్యా సూర్యనారాయణ, అవటపల్లి హనుమంతరావు, అగ్నిహోత్రం విజయసారథి సంపాదకమండలిగా ఏర్పడి 1948లో 'స్వాతంత్ర్య కుసుమ మాల'ను స్థాపించారు. ఆధ్ర సారస్వత సేవ, ఆంధ్ర రచయితల సేవ లక్ష్యంగా విశేష కృషి చేశారు. అనేక ఉద్గ్రంథాలను వెలువరించారు. 'గాంధీ భారతం' బాగా ప్రసిద్ధి వాటిలో. ●



# సంస్కృతీ నికేతనం

1948 లో 'సంస్కృతీ నికేతనం' హైదరాబాదులో స్థాపించబడింది. పర్సా వెంకటేశ్వరరావు గారు కార్యదర్శి. ఈ సంస్థకు దేవులపల్లి రామానుజరావు, వేమరాజు భానుమూర్తి గారలు సహాయ కార్యదర్శులు. వైజ్ఞానిక గ్రంథాలను వంద వరకూ ప్రచురించాలని అనుకున్నారు. గిబ్బన్ రాసిన 'వాట్ ఈజ్ ఎలక్ట్రిసిటీ' అనే పుస్తకం ఆధారంగా వసంతరావు వెంకటరావు 'ఎలక్ట్రాన్ ఆత్మకథ' అనే గ్రంథం వ్రాయగా ప్రచురించారు. ●



# అరుణశ్రీ గ్రంథమాల

1953లో మడిపడగ బలరామాచార్యులు గారు సికింద్రాబాదులో 'అరుణశ్రీ గ్రంథమాల'ను స్థాపించారు.

జలపాతం, అజంతా సుందరి, పోణంకి శ్రీరామ అప్పారావు గారి విశ్వభారతి; కె.వి. రామకోటిశాస్త్రి గారి ఆనందచేతన, మురయాగారి సిల్కుచీర, బలరామాచార్యులు గారు రచించిన మురళీరవం మొదలైనవి ప్రకటించారు. ●



# తరుణ సాహితి

తూర్పుగోదావరి జిల్లా ఆలమూరు గ్రామంలో 1954 ఆగస్టు 15న పోలాప్రగడ సత్యనారాయణమూర్తి, పురాణపండ ఉషశ్రీ, చామర్తి కనకయ్య (కనక్ ప్రవాసి) కలసి 'తరుణ సాహితి' సంస్థను ప్రారంభించారు. దాదాపు ఇరవై గ్రంథాల వరకు ప్రచురించారు. విశ్వనాథ సత్యనారాయణ గారిపై 'విశ్వశ్రీ' అనే ప్రత్యేక సంచికను వెలువరించారు. ●



# ఆంధ్ర ప్రబోధిని గ్రంథ నిలయం

కృష్ణాజిల్లా మండవల్లిలో 'ఆంధ్ర ప్రబోధిని గ్రంథ నిలయం' అనే ప్రచురణ సంస్థ స్థాపించబడింది. దీనిని గురజ సంస్థానాధీశుల కోవకు చెందిన కమదన జమీందారులు నెలకొల్పారు. వెంకట హనుమంత జగన్నాథరావు, వెంకట రామారావు, శోభనాద్రిరావు గారలు దీనికి పోషకులు. ఈ సంస్థ అనేక ఆధునిక గ్రంథాలను ప్రచురించింది. ●



# కాకతీయ గ్రంథమాల

తూము వరదరాజులు గారు ఓరుగల్లు (వరంగల్) లో 'కాకతీయ గ్రంథమాల'ను స్థాపించారు. చరిత్ర పరిశోధకులు, ప్రసిద్ధ కవులు శేషాద్రి రమణ కవుల సంపాదకత్వంలో కొన్ని గ్రంథాలు ప్రచురించారు.

ఆంధ్ర మంత్రుల చరిత్ర, విక్రమోర్వశీయము, వసుంధర, ఆంధ్రపద నిధానము, దాసబోధ మొదలగునవి ప్రచురించారు. ●



## దాసభారతీ ప్రచురణలు

శ్రీమతి కళ్యా శ్యామలాదేవి గుంటూరులో 'దాస భారతీ ప్రచురణలు'ను స్థాపించారు. మేలుబంతి, కచ్ఛపీశ్రుతులు, వ్యాసపీఠం, నా యెఱుక, తర్లివిన్కి సంస్కృత శతకద్వయము, పంచశతి, నూఱుగంటి, బాటసారి, దశవిధరాగ నవతికుసుమ మంజరి, నవరస తరంగిణి సారంగధర, జగజ్జ్యోతి, మహాకవి శ్రీ ఆదిభట్ల నారాయణదాసు చరిత్రము, MONARCH OF RHYTHM, THE LIGHTS OF THE WORLDS. మొదలగునవి ప్రచురించారు. ●



## భారత గ్రంథమాల

గుంటూరులో చతుర్వేదుల పార్థసారథి గారు 1968లో 'భారత గ్రంథమాల'ను స్థాపించారు. ఆంధ్ర మహాభారతం చిన్న చిన్న భాగాలుగా అందరికీ అందుబాటులో ఉండేట్లు ప్రచురించడం వీరి ఆశయం.

కరపత్రస్వామిగారి రాసలీలా రహస్యము (సి. హెచ్. వీరభద్రరావు గారి అనువాదం), కవి పరిచయములు, గీతామృతసారం, జ్యోతిషశాకుంతలము, జాతీయ కవులు, ఆంగ్లకవులు, పోతనామాత్యుడు, ప్రవరుడూ అన్నపూర్ణ, కవోష్ణ బాష్పరా కమనీయహాసం మొదలగునవి ప్రచురించారు. ●



## జార్జి ది ఫిఫ్త్ గ్రంథమాల

1915 లో గుమ్మలూరి నరసింహశర్మ 'జార్జి ద ఫిఫ్త్ గ్రంథమాల' అనే సాహిత్య సంస్థ స్థాపించారు. సమకాలిక కవి పండితుల రచనలను వీరు ప్రచురించారు. మండపాక పార్వతీశశాస్త్రి గారి సుజనమోదిని, సావిత్రీ సత్యవంతము ఈ సంస్థ ద్వారా ప్రచురితమైనవి. ఈ సంస్థ 1922 వరకు మాత్రమే నడిచింది. ●



# మారుతీరామ అండ్ కో

1920 లో కృష్ణామండలం బెజవాడ (విజయవాడ)లో వడాలి నారాయణరావు గారు 'మారుతీరామ అండ్ కో' స్థాపించారు. అనేక విద్యావిషయక గ్రంథాలను ప్రచురించారు. ●



# ఆంధ్ర గ్రంథమాల

కాంచీపురంలో 1920లో అణ్ణంగరాచార్యస్వామి 'ఆంధ్ర గ్రంథమాల' స్థాపించారు. ఆంధ్రేతర ప్రాంతంలో తెలుగు గ్రంథాలు ప్రచురించిన సంస్థ. ఈ సంస్థ అనేక తెలుగు గ్రంథాలను అచ్చు వేశారు. ఒద్దిరాజు రాఘవ రంగారావు గారి రచనలు కొన్ని ఈ సంస్థ ప్రచురించింది. ●



# కార్మిక ప్రచురణలు

గుంటూరు జిల్లా తెనాలి తాలూకా తుమ్మల పొరుగు గ్రామం అనంతవరంలో 1933 లో ధూళిపాళ్ళ కోటయ్య గారు "కార్మిక ప్రచురణలు" ప్రారంభించారు. తుమ్మల వెంకట్రామయ్య గారి రచనలు కామ్రేడ్ డిమిట్రావ్ జీవితం, గోర్కీ 'మదర్'ను 'మాతృ హృదయం' అనే పేరుతో సంక్షిప్తానువాదం తొలి ప్రచురణలు. ●



# జాతీయ గ్రంథమాల

కాకినాడలో బాలాంత్రపు సత్యనారాయణ గారు 1935 లో 'జాతీయ గ్రంథమాల' ను స్థాపించారు. మొదటి ప్రచురణ అయ్యదేవర కాళేశ్వరరావు గారి రచన 'చైనా

జాతీయోద్యమము (1935 వరకు) రెండు భాగాలు. ఈ రెండు భాగాలు బాబూ రాజేంద్ర ప్రసాదు గారికి (కాంగ్రెసు స్వర్ణోత్సవ సభ-బెజవాడ నందు) అంకితమిచ్చారు.



## భాషా సేవక సమితి

తిరుమల రామచంద్ర, తిమ్మావజ్ఝల కోదండరామయ్యలు కలసి మద్రాసులో 1949 లో 'భాషా సేవక సమితి' స్థాపించారు. 1960 వరకు నడిచింది. వీరు 'పరిశోధన' అనే పత్రికను కూడా ప్రచురించారు. ●



## తెంకణ గ్రంథమాల

దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డి గారు నెల్లూరు మండలం ఉలవపాడులో జన్మించారు. 'తెంకణ గ్రంథమాల'ను స్థాపించి స్వీయ అమూల్య పరిశోధక రచనలు ప్రచురించారు. నన్నిచోడకవి చరిత్ర, కృష్ణగీత, తెంకణాదిత్యకవి మొదలగునవి రచించి, ప్రచురించారు. ●



## నమ్మాళ్వార్లు ప్రచురణలు

జమిలి నమ్మాళ్వార్ గారిది గుంటూరు. గుంటూరు పత్రిక, వాసవి పత్రికల సంపాదకులు. పదహారణాల ఆంధ్రులు. సంస్కృత, ఆంధ్ర, ఆంగ్లభాషలలో పండితులు. మద్రాసులో 'నమ్మాళ్వార్లు ప్రచురణలు' అనే సంస్థను స్థాపించారు. ●



# వైదిక ధర్మ గ్రంథ మండలి

మంత్రిప్రగడ వెంకటేశ్వరరావు గారు 1897 లో జన్మించారు. 'వైదిక ధర్మ గ్రంథ మండలి'ని స్థాపించారు. సంఘ సంస్కరణ కోసం, వైదిక ధర్మ ప్రచారం కోసం పలు గ్రంథాలు ప్రచురించారు.

మానవ కళ్యాణ దర్పణము, వైదిక ధర్మ బోధామృతము మొదలగునవి రచించి, ప్రచురించారు. ●



# వెలగలేటి గ్రంథమాల

వెలగలేటి నరసింహాచార్యులు గారు 1972 లో మానుకోటలో 'వెలగలేటి గ్రంథమాల' ను స్థాపించారు. విశిష్టాద్వైత సంప్రదాయానికి చెందిన గ్రంథాలను ప్రచురించడం వీరి ఉద్దేశం.

భక్తామృతమ్, గురుపరంపరాదికము మొదలగునవి ప్రచురించారు. ●



# శారదా గ్రంథమాల

బులుసు అప్పన్న శాస్త్రి గారు భట్నపల్లిలో 'శారదా గ్రంథమాల' స్థాపించి అనేక విలువైన, అలభ్యమైన, అముద్రిత గ్రంథాలను ముద్రించి తెలుగు పాఠకలోకానికి అందించారు. ●



# భారతీ గ్రంథమండలి

వావిలాల గోపాలకృష్ణయ్య గారు 'భారతీ గ్రంథ మండలి'ని స్థాపించి, దాని తరపున కొన్ని పుస్తకాలను ప్రచురించారు. ●



# నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

నేషనల్ బుక్‌ట్రస్ట్, ఇండియా, ఉత్తమ గ్రంథాల ప్రచురణ కోసం, పఠనాసక్తిని పెంపొందించడం కోసం 1957లో భారత ప్రభుత్వం కేంద్ర మానవ వనరుల అభివృద్ధి మంత్రిత్వశాఖ ఆధీనంలో స్థాపించబడిన స్వతంత్ర సంస్థ. ప్రస్తుతం నూతన భవనం న్యూఢిల్లీ వసంత్‌కుంజ్‌లోని నెహ్రూభవన్‌లో అధికారిక కార్యకలాపాలు నిర్వహిస్తోంది. నేషనల్ బుక్‌ట్రస్ట్ కార్యక్రమాలను స్థూలంగా చెప్పాలంటే 1. ప్రచురణ, 2. పఠనాసక్తిని ప్రోత్సహించడం, 3. భారతీయ గ్రంథాలను విదేశాలలో ప్రోత్సహించడం, వాటిని ప్రచారం చేయడం, 4. రచయితలకు, ప్రకాశకులకు ఆర్థిక సహాయం చేయడం, 5. బాలసాహిత్యాన్ని ప్రోత్సహించడం.

ఇంగ్లీషు, హిందీ, అస్సామీ, బెంగాలీ, గుజరాతీ, కన్నడ, మళయాళం, మరాఠీ, ఒరియా, పంజాబీ, తమిళం, తెలుగు, ఉర్దూ మొదలగు భాషలలోను; భారత రాజ్యాంగం ఎనిమిదో అనుబంధంలో కొత్తగా చేర్చబడ్డ కొంకణి, నేపాలీ, మణిపురీ కూడా ప్రచురిస్తున్నారు. ఆదివాసి భాషలైన ఆవో, గారో, ఖాసీ, మిసింగ్, మిజో భాషలలో కూడా ప్రయోగాత్మకంగా పుస్తక ప్రచురణను ప్రారంభించారు. ఇప్పటి వరకు 32 భాషలలో 17000 పైగా పుస్తకాలు ప్రచురించారు. దేశమంతటా పుస్తకమేళాలను, ప్రదర్శనలనూ ఏర్పాటు చేయడం ద్వారా గ్రంథాలను, గ్రంథ పఠనాభ్యాసాన్ని ప్రోత్సహిస్తున్నారు.

విదేశాలలో భారతీయ గ్రంథాల ప్రచారం కోసం ఫ్రాంక్‌ఫర్ట్, బొలానా, జింబాబ్వే, టోక్యో, కొలంబో, బాంకాక్, కౌలాలంపూర్, సింగపూర్, మనీలా, కరాచీ మొదలైన అంతర్జాతీయ పుస్తకమేళాల్లో పాల్గొనడమేకాక భారతీయ ప్రచురణకర్తలు ప్రచురించిన వాటిలో ఎంపిక చేసిన గ్రంథాలను ప్రదర్శిస్తున్నారు.

భారతదేశము – ప్రజలు, తరుణ భారతి గ్రంథమాల, లోకోపయోగ విజ్ఞానమాల (పాపులర్ సైన్స్), లోకోపయోగ సమాజ విజ్ఞానమాల (పాపులర్ సోషల్ సైన్స్), జానపద సాహిత్యం – సంస్కృతి, జాతీయ జీవిత చరిత్ర, స్వీయచరిత్ర, నెహ్రూ బాల పుస్తకాలయం, ఆసియా–పసిఫిక్ సహప్రచురణ కార్యక్రమము, సృజనాత్మక విద్య గ్రంథమాల, నవసాక్షర గ్రంథమాల, నిరంతర విద్య గ్రంథమాల, అంతర భారతీయ పుస్తకమాల, విశ్వసాహిత్యం, భారతీయ దయాస్పొర అధ్యయనం, ఆఫ్రో–ఆసియా దేశాల సహప్రచురణలు, బ్రెయిలి పుస్తకమాల, స్వర్ణజయంతి సంకలనాలు శీర్షికల ద్వారా పుస్తక ప్రచురణ కార్యక్రమం నిర్వహిస్తున్నారు.

నేషనల్ బుక్‌ట్రస్ట్ తెలుగులో నూతనంగా ప్రపంచీకరణ – అభివృద్ధి, ఆఖరి టికెట్ కొన్ని కథలు, భారతదేశ రైతాంగ స్థితిగతులు, నాగార్జునుడు, రాంమనోహర్ లోహియా, ముల్కరాజ్ ఆనంద్, జోతిరావ్ పూలే, నవోదయ, చిట్టిచీమ తప్పిపోయింది, మనసుపక్షి, మామిడిపండు పక్షులు, టిల్‌టిల్ సాహసం, అమెరికా ఆదివాసుల జానపద కథలు, డ్రాగన్ సునామి, చిన్నారి సూర్యుడు, సంధ్యారాగం : వజ్రపు ముక్కుపుడక, తపస్సు, నోనా మరియు వాన, అఖ్తన్ కన్ను మొదలగునవి ప్రచురించారు. నిరాలా సాహిత్య సాధన, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి ఉత్తమ కథలు, పి. యశోదారెడ్డ ఉత్తమ కథలు, కాబూలీవాలా, గిజుబాయి పూలగుత్తి (10 భాగాలు), గురువును మించిన శిష్యుడు, దోబు – రాజకుమారుడు, కల్లలపై మనిషి పోరు, భారతదేశ జానపద గాథలు, శక్తి, సమాచారహక్కు చట్టం, భారతదేశంలో ప్రజాస్వామ్యం, సెలవు, 1857 తిరుగుబాటు, రసాయన శాస్త్రం – అవగాహన, ఝాన్సీరాణీ లక్ష్మీబాయి మొదలగునవి ప్రచురించదలచారు.

నేషనల్ బుక్‌ట్రస్ట్ తెలుగులో ఇప్పటివరకు ప్రచురించిన పుస్తకాలు; **భారతదేశం-ప్రజలు** శీర్షికలో – ఉద్యాన పుష్పములు, మనము – మన ఆహారము, పెంపుడు జంతువులు, సామాన్యవృక్షాలు, సంగీత వాయిద్యాలు, దక్షిణ భారతంలో దేవాలయాలు, భారతీయ భోజన పదార్థాలు – ప్రక్రియలు, భారతీయ చిత్రకళ, భారతదేశ జాతీయ సంస్కృతి, పక్షులు, పూలచెట్లు, భారతదేశంలో ప్రభుత్వపాలన; **తరుణ భారతి గ్రంథమాల** శీర్షికలో – బాలల కోసం బుద్ధకథ, ప్రజాస్వామ్యం : 80 ప్రశ్నలు – జవాబులు, టోటోచాన్, మానవాధికారాలు : ఒక ఆధార గ్రంథము; **లోకోపయోగ విజ్ఞానమాల** శీర్షికలో – మీరు మీ ఆరోగ్యము, సాగరశాస్త్రము, మూర్ఛవ్యాధి, రోబోట్స్ – రొబొటిక్స్, కొన్ని సామాన్య వ్యాధులు; **లోకోపయోగ సమాజ విజ్ఞానమాల** శీర్షికలో– గౌరవప్రదమైన అభివృద్ధి, ఉపాధి గ్యారంటీ చట్టం – ఒక ప్రవేశిక, భారతదేశ విభజన, మతతత్వ సమస్య, ఆంధ్రప్రదేశ్‌లో విముక్తి జాతులు, ప్రపంచీకరణ – అభివృద్ధి, భారతదేశ రైతాంగ స్థితిగతులు; **జాతీయ జీవిత చరిత్ర** శీర్షికలో – శ్రీఅరవిందులు, అశుతోష్ ముఖర్జీ, హరినారాయణ ఆప్టే, హర్షుడు, రాణీలక్ష్మీబాయి, రామానుజాచార్య, టి. ప్రకాశం, సర్దార్ వల్లభాయ్ పటేల్, అహల్యాబాయి, చంద్రగుప్తమౌర్యుడు, మోతీలాల్ ఘోష్, ఎమ్.ఎన్.రాయ్, చైతన్య, డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్, దుర్గాబాయి దేశ్‌ముఖ్, రామలింగ, సి.వై. చింతామణి, సానేగురూజీ, అల్లూరి సీతారామరాజు, ముత్తుస్వామి దీక్షితార్, సత్యేంద్రనాథ్ బోస్, మీర్జా గాలిబ్, కబీరు, నేతాజీ సుభాష్‌చంద్రబోస్, గోపబంధుదాస్, స్వామ దయానంద, పురందరదాసు,

శ్రీనారాయణగురు, టిప్పు సుల్తాన్, సిస్టర్ నివేదిత, శివాజీ, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, ఇందిరాగాంధీ, కందుకూరి వీరేశలింగం, పి.సి. జోసి, నాగార్జునుడు, రాంమనోహర్ లోహియా, ముల్క్‌రాజ్ ఆనంద్, కామరాజ్ - ఒక అధ్యయనం, జోతిరావ్ పూలే; **నెహ్రూ బాల పుస్తకాలయం** శీర్షికన - స్వాతంత్ర్య గాథ (2 భాగాలు), ఒక నాటకం వేద్దాం, సరస వినోద కథలు, యుగ యుగాల కథలు, తపాలా బిళ్ళల కథ, వీరుల కథలు, భారతదేశంలో హాకి, అనగా అనగా (2 భాగాలు), స్వర్గయాత్ర ఇతర కథలు, రోహంతుడు - నందీయుడు, హిమాలయ శిఖరాలు, బాపు (2 భాగాలు), అమర సాహిత్యం, బంగారు పిచుక, సిద్ధం కండి, అద్భుతమైన పుస్తక ప్రపంచం, ఈద్‌గాహ్, పక్షుల లోకం, బడాపానీ, కాశ్మీరు, విదేశీయుల భారత దర్శనము, మోరా, నది మాట్లాడిన రోజు, మన సైన్యం, మన వాయుసేన, తిల్లి-లిల్లీ, యుక్తి-కుయుక్తి, అమ్మగారి బస్సు ప్రయాణం, మన వీధి ఆటలు, భారత యువవీరులు, జొరసాంకొ ఇల్లు, ప్రేమచంద్, అమరజ్యోతులు, మొక్కలు, విరిగిన రెక్క - కొన్ని ఆసియా కథలు, అడవిలో కొలను, చిన్నారి తరంగం, గౌతమబుద్ధుడు, అరణ్య వైభవం, ఊరేగింపు, ఎర్రగాలిపటం, రోదసి కానుక, మహాభారతం, భారతి, మేము భారతీయులం, మనియాకి బంగారం దొరికింది, పూలు-నేను, కాలుష్యం, ఈలోకం నాకు నచ్చింది, మత్స్య, ఏది తప్పు ? ఏది ఒప్పు ?, అది ఏ జంతువో చెప్పండి, భారతదేశపు పండగలు, తేయాకు కథ, రక్తం కథ, ఏనుగు - కుక్క, అడవిలో ఒక పిలుపు, బెలూను, ఇది రాజస్థాన్, ఇంద్రధనస్సు, నా మొదటి రైలు ప్రయాణం, ఇళ్లు, దీపావళి, అర్ధవలయాలు కనుక్కోండి, ఊళ్ళో బజారుకి వెళ్ళటం, మన చెట్టు, మన శరీరం, జంతుప్రపంచం, తీరికలేని చీమలు, తోక తెచ్చిన తంటా, ప్రపంచాన్ని మార్చివేసిన నూతన ఆవిష్కారాలు (2 భాగాలు), సోనాకథ, పిల్లిజాతి, తుమ్మెద-పువ్వు, అయోధ్యా రాజకుమారుడు, వృక్షజగత్తు, ఏనుగురూపా, మనదేశానికి స్వాతంత్ర్యం ఎలా వచ్చింది ?, మితా-గారడిజోళ్ళు, అనగనగా ఒక గ్రామంలో, ఇది నా కథ, ఎలుకలు కట్టిన ఇల్లు, వెర్రిబాగుల మామిడి, ఒక రోజు జూలో, బుల్లిక్యాబేజి, రంగుల పండుగ, హలో చందమామా!, తిండిపోతు దూడ - రోజి, మిడుతా ఎగిరిపో, చెప్పుకోండి నేనేం చేస్తున్నానో, ఒక కాకి కథ, మామిడిపండు కథ, అందరితోడు అందరి నేస్తం, వన్యమృగ సంరక్షకుని సాహసాలు, మహారాజా రంజీత్‌సింగ్, ఎవరెస్టు నా సాహస యాత్ర, వేసవి చెట్టు పోటీ, హ్యూయన్‌త్సాంగ్ భారతదేశ యాత్ర, తాన్‌సేన్, రస్టీ సాహసాలు, జలియన్ వాలాబాగ్, నీరు, మదర్ థెరిసా, జవహర్‌లాల్ నెహ్రూ, ఎడ్లబళ్ళు - ఉపగ్రహాలు, మన వార్తాపత్రికల కథ, మన పరిసరాలలోని పాములు,

చెట్టు అనగా ఏమిటి ? గారడిగాడు, సూర్యకాంతం పువ్వులు – సీతాకోక చిలుకలు, స్వామి–మిత్రులు, ఎతోవా పోరాటం గెలిచాడు, మోహినీ భస్మాసుర, నీట దాగిన అద్భుతప్రపంచం, గౌముఖయాత్ర, అడవిలో ధారలు, పాము బెడద, పదమూడు ఉత్తమ కథలు, ప్రకంపనాలు – మంటలు, www.కారడవి.కామ్, ఇల్లు అద్దెకు ఇవ్వబడును, నా జీవితం, సీతాకోక చిలుక కథ, అమ్మమ్మ అల్లిక, ఉయ్యాలపై మామా మూ, సూర్యుడు – చంద్రుడు, పిల్లసింహం గర్జించటం నేర్చుకొంది, చిత్రగీవం, నేపాలీ మండూకం సాహసాలు, సూర్యకన్యలు, శాశ్వత మిత్రులు, సముద్రతీర గ్రామం, పప్పు కష్టాలు, ప్రేమబంధం, తోకలు, బిర్జు కష్టాలు, గాలి చిరునామా ఎక్కడ, చక్రాల కథ, అద్భుతమైన సెలవులు, తెలివైన రైతు – నలుగురు దొంగలు, మృగరాజు – ముళ్లపందిరి, చున్మున్‌కు స్వేచ్ఛ, ఆనందీ ఇంద్రధనుస్సు, ముత్తు కలలు, నెమలి పింఛంపైన కళ్లు, మంత్రం–తంత్రం, మంగూ బొంగరం, చిట్టెలుకమ్మ బేగంగులాబో– ఆమె ఎర్రబెలూను, ప్రేమచంద్ బాలసాహిత్యం : పదమూడు కథలు, గాయపడిన కాకి కథ, వానకోసం ఎదురుచూపులు, అద్భుత సాహసం, ప్రాణస్నేహితులు, హరితవనం స్నేహితులు, తుమ్మచెట్టు దయ్యం, నవోదయం, చిట్టిచీమ తప్పిపోయింది, మనసుపక్షి, మామిడిపండు పక్షులు, టిల్‌టిల్ సాహసం, చిన్నారి సూర్యుడు, డ్రాగన్ సుమాని, తపస్సు, నోనా మరియు వాన, అమెరికా ఆదివాసుల జానపద కథలు, రంగురంగుల జండాల ప్రపంచం, అడవిలో ఆనందం, చంద్రుడు లెక్క మరిచిపోయాడు, అఖ్తన్ కన్ను, తెనాలి రామకృష్ణుని చమత్కార కథలు, నాకొక జిరాఫీ కావాలి, చెట్లతో కలసి ఎదుగుతూ... డోలుడప్పు కథ, ఘనదా సాహసాలు, ఎందుకు ?, రావణుడ, రింటూ – అతని దిక్సూచి.

**సృజనాత్మక విద్య గ్రంథమాలలో**–చౌకలో అమూల్యమైన బోధనోపకరణాలు, సృజనాత్మక జీవితం కోసం విద్య; **ఆసియా/పసిఫిక్ సహస్ర ప్రచురణ కార్యక్రమంలో**– చెప్పుకోండి నేనేం చేస్తున్నానో ?, చెట్లు, ఆఖరి టికెట్ మరికొన్ని కథలు; **నవసాక్షర గ్రంథమాలలో**-సవాసేరు గోధుమలు, ఇంధనం కొరత, ఇదా ధర్మం, అతను ఇచ్చిన మాట, ప్రేమ సారాంశం, మన కాళ్ళమీదనే గొడ్డలి, బైజూమామయ్య, మన శరీరం, సత్యాన్వేషణ, తాగుబోతు నెంబర్ వన్, పహిల్వాన్ గారి డోలు, బాపూ కబుర్లు, మహిళ చదువుకున్నట్లయితే ?, ఈ బాధ్యత ఎవరిది ? భూతం వచ్చింది, నా గోమాత, మహావీరులు, ఎముకలు విరిగినప్పుడు..., మార్పు మా హక్కు, పిచ్చికుక్క, మైనా కథలు, పాడి పరిశ్రమ, నేత్ర సంరక్షణ, చెప్పుల తయారీ, సోన్‌కొండ రహస్యం, రంగి, పట్టుపురుగుల పెంపకం, చేపల పెంపకం, సైకిల్ రిపేరు, తెలివైన అమ్మాయి,

గొర్రెల పెంపకం, పూల మొక్కల పెంపకం, ఆకుకూరలు–ఆదాయం, మేకల పెంపకం, కోళ్ళ పెంపకం, తోటల పెంపకం, ఇలా ఎందుకు ? మిత్రమా చేయూతనివ్వు, మీరా సాహసం, ఇద్దరు దొంగలు, వదిన సర్పంచి అయింది, మన బతుకులు మారాలి, లక్ష్మి, గ్రామీణ ఉపాధి గ్యారంటీ చట్టం, బఖ్త్ ఖాన్; **విశ్వ సాహిత్యంలో** – మధు క్షీరాలు; **నిరంతర విద్య గ్రంథమాలలో** – స్వాతంత్ర్యోద్యమ గేయాలు, మన ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలు, వైతరణి, మదర్ థెరిస్సా, రాజా రామ్మోహనరాయ్, సమతా సమర్థకుడు అంబేద్కర్, నీటి నిర్వహణ.

**అంతర భారతీయ పుస్తకమాలలో** – అగ్నిధార, సముద్రం–నీటిచుక్క, గంగమ్మ–గంగామాతా, హిందీ ఏకాంకికలు, జీవితం ఒక నాటకరంగం, పంజాబు కథలు, సమిష్టి కుటుంబం, పోతుమ్మ మేక–చిన్ననాటి చెలి, తెలుగు కథానికలు, అద్దం, అనాది అనంతం, భారతి వచన రచనలు, స్మృతిరేఖలు, స్వీయచరిత్ర సంగ్రహము: కందుకూరి వీరేశలింము, చిక్కవీర రాజేంద్ర, కొన్ని సమయాలలో కొందరు మనుషులు, దర్బారు రంగం, కథాభారతి: తమిళ కథలు, మనిషి రూపాలు, గృహభంగం, మెట్టుకు పైమెట్టు, రాలిపోయిన చందమామ, ఇటీవలి తమిళ కథలు, జంట నగరాలు, సగం వెన్నెల రాత్రి, గడచిన కాలం, ఐవాన్ గజల్, సమకాలీన హిందీ కథానికలు, బిల్లేసుర బకరిహ, గాంధారి, బెంగాలీ కథానికలు, గంగమ్మతల్లి, ఇది మన జీవితం, గుజరాతీ ఏకాంకిలు, ఆకాశం సొంతం, ఫణీశ్వర్‌నాథ్ కథలు, కథాభారతి : గుజరాతీ కథలు, చైతన్యదేహళి, చెదపురుగు, జాగరీ, సమకాలీన కొంకణీ కథానికలు, మహాశ్వేతాదేవి ఉత్తమ కథలు, విషకన్య, సంధ్యవేళలో, కథాభారతి : కన్నడ కథానికలు, గంగాతీరపు పక్షి రెక్కలు, సంధ్యారాగం : వజ్రపు ముక్కుపుడక, నెల్లూరి కేశవస్వామి ఉత్తమ కథలు, కె. సభా ఉత్తమ కథలు, రాజ్‌కమల్ చౌదరి ఉత్తమ కథలు. **ఆఫ్రో–ఆసియా దేశాల ప్రచురణలులో** చైనా; **వివిధ పుస్తకాలు** శీర్షికలో – స్వాతంత్ర్య సమరం, హిందూ మతం అంటే ఏమిటి ? రాణీ లక్ష్మీబాయి, మహాత్మాగాంధీ మనసు, ద్వీపాంతర వాసపు చారిత్రక దస్తావేజు, గురునానక్ వాణి, నేను నాస్తికుడిని ఎందుకయ్యాను, సామాజిక మార్పు కోసం విద్య : ఎం.వి.ఎఫ్. మరియు బాలకార్మికులు మొదలగునవి ప్రచురించారు. ●



# సాహిత్య అకాదమీ

ఇరవై నాలుగు భారతీయ భాషల్లోనూ పుస్తకాలు ప్రచురించే ఏకైక, బహుదొడ్డ భారతీయ ప్రచురణా సంస్థ సాహిత్య అకాదెమీ. 1954లో స్థాపించబడి, 60 ఏళ్ళుగా నిరంతర సాహిత్యసేవ కొనసాగిస్తున్నది. అత్యుత్తమ సాహిత్యం నెలకొల్పటమే ధ్యేయంగా పెట్టుకుని, తీవ్రంగా కృషి చేస్తూ, మంచి సాహిత్యాన్ని గుర్తిస్తూ, ఒక భాషలోని ఉత్తమ సాహిత్యాన్ని మరొక భారతీయ భాషకు అనువదింపచేయటం ద్వారా విభిన్న భాషల, సమాజాల మధ్య గాఢమైన సాంస్కృతిక అనుబంధాలను పెంపొందిస్తూ ముందుకు సాగుతున్నది సాహిత్య అకాదెమీ.

భారతీయ సాహిత్య సేవలో 60 ఏళ్ళు తన నిరంతర సాహిత్య యజ్ఞంలో నాలుగు వేలకు పైగా పుస్తకాలను అకాదమీ ప్రచురించింది. భారతీయ సాహిత్య నిర్మాతలు శీర్షికలో సాహితీమూర్తుల జీవితచరిత్రలూ, అకాదెమీ పురస్కారం పొందిన గొప్ప గ్రంథం అనువాదాలు, భారతీయ, విశ్వభాషల్లోని ఉత్తమ గ్రంథాల (క్లాసిక్) అనువాదాలు, విశ్వకవి రవీంద్రనాథ ఠాగూర్ గురించి వారు రచించిన గ్రంథాల సంపుటాలు, విభిన్న సాహిత్య ప్రక్రియలలో – నవలలు, కథలు, నాటకాలు, విమర్శ గ్రంథాలు, సదస్సులలో ప్రముఖ విద్వాంసుల ప్రసంగపత్రాలు, ఆరుభాగాల భారతీయ సాహిత్య విశ్వకోశం, భారతీయ రచయితల హూ ఈజ్ హూ, సంస్కృత పండితుల, అనువాదకుల కోశం, భారతీయ సాహిత్య గ్రంథ సూచికలు, బాలసాహిత్యం, విభిన్న భాషల – వాఙ్మయాల చరిత్రలు, సాహిత్య మీమాంసలు, శ్రేష్ఠ భారతీయ రచయితల సమగ్ర సాహిత్య సంపుటాలు, ప్రాచీన, మధ్యకాల, ఆధునిక భారతీయ సాహిత్య సంపదలు పొందుపరచబడిన పది భాగాల సమగ్ర సంగ్రహం మొదలైన చరిత్ర కలదు అకాదమీకి. 2000 సంవత్సరం నుండి జానపద గిరిజనుల భాషలలోని మౌఖిక సాహిత్యాన్ని గ్రంథస్థం చేసే ప్రయత్నంలో కొత్త శీర్షిక ప్రారంభించారు.

నవలలు శీర్షికలో – ఆ గదికి ఒక కిటికీ ఉండేది, ఆరడుగుల నేల, అబలా జీవితము, అమృత సంతానం, అమృతం విషం, ఆరోగ్య నికేతనము, ఆ దీర్ఘమౌనం, అర్ధనారీశ్వరుడు, బాణభట్టుని స్వీయచరిత్రం, భవిష్యత్తు బహుపరాక్, బినోదిని, ఛాయారేఖలు, చెవులు, చిదంబర రహస్యం, దాటు, గెంజిగాథ. గోరా, జనవాహిని, కలకత్తాకి దగ్గరలో, కలసిన జీవితాలు, కథగా మారిన అమ్మాయి, కొండమీద మంట, మాలపల్లి, మరల సేద్యానికి, మా తాతయ్యకొక ఏనుగుండేది, మట్టిమనుషులు, మట్టి దీపం, మీరిబాల, నగర మథనం, నారు నీరు, నీలిచంద్రుడు, పార్థివస్వప్నం, ప్రభాతవదనం, పర్వ, రెండుశేర్లు, రొయ్యలు, శాంబుడు, సమాజపు కోరల్లో, సమయం

కాని సమయం, సంస్కార, శాస్తి, శాంతల, ఆగిపోని బంధం, తిరుగుబాటు, ఉచల్యా, ఉమ్రాన్‌ఖాన్ అదా, వనవాసి, విముక్తి, విషాద కామరూప, యయాతి, యోగాయోగాలు, వక్రరేఖ, విచారణ కమీషన్ మొదలగునవి.

కథలు/కథాసంపుటాలు శీర్షికలో – ఆంధ్ర కథా మంజూష, ఆంగ్లములో సమకాలీన భారతీయ కథానిక, బంగారు కథలు, భారతీయ సాహిత్యం: సమకాలీన కథానికలు, బీహార్ జానపదగాథలు, ఇరవై మూడు హిందీ కథలు, కాకులు ద్వీపాతర వాసం, కన్నడ కథానికలు, కన్నడ కథానికల సంకలం, మరాఠి కథాసంగ్రహము, మాస్తి చిన్నకథలు, మట్టిబొమ్మలు, మొదటి రాత్రి వస్తుంది, ఒక తరం తెలుగు కథ, పున్నమిరాత్రి ఇతర కథానికలు, రవీంద్ర కథావళి, తమిళ చిన్న కథలు, తమిళదేశపు జానపద కథలు, తమిళ కథామంజరి, తెలుగుకథ, తమిళ సాహిత్య కథలు, ఉత్తర కర్నాటక జానపద కథలు, వెయ్యినొక్క రాత్రులు, అద్భుత గ్రంఘాథ మరికొన్నికథలు, మధుపురం బహదూరు, నాన్నగారి స్నేహితుడు మొదలగునవి.

నాటక శీర్షికలో – యాంటిగని, దీన్నేనా సభ్య అంటారు ? ఏకాంక సంగ్రహం, ఫాస్ట్ (మొదటి భాగం), గదా యుద్ధము, గలీలియో, హామ్‌లెట్, కన్యాశుల్కం, మ్యాక్బత్, మదర్ కరెజ్, నాటికలు, ఒథెల్లో, రవీంద్రుని నాటకాలు – 1, రవీంద్రుని నాటకాలు –2, సిరి సంపెంగె మొదలగునవి.

కావ్యం శీర్షికలో – భారతి వారి మధురకవితా సంహిత, ఏకోత్తరసతి, కబీరు వచనావళి, కావ్యమాల, తెలుగు కావ్యమాల, విరిగిన విగ్రహం, యకృత్తు, బాంధవ్యం, మలిపూత మొదలగునవి.

భారతీయ సాహిత్య నిర్మాతలు శీర్షికలో – అబ్బూరి రామకృష్ణారావు, అక్కమహాదేవి, అమృతలాల్‌నగర్, అన్నమాచార్యులు, అణ్ణాభావూ సాఠే, ఆరుద్ర, ఎ.ఆర్. రాజరాజవర్మ, బాబా సాహెబ్ అంబేడ్కర్, బి.ఎం. శ్రీకంఠయ్య, బాణభట్టు, బంకించంద్ర చటర్జీ, బసవేశ్వరుడు, భారతేందు హరిశ్చంద్ర, భారతి, భవభూతి, బుద్ధదేవబోసు, చందుమీనన్, చక్రపాణి, చిలకమర్తి లక్ష్మీనరసింహం, సి.ఆర్. రెడ్డి, దాశరథి, దత్తకవి, దేవులపల్లి కృష్ణశాస్త్రి, ధర్మవరం రామకృష్ణమాచార్యులు, దువ్వూరి రామిరెడ్డి, ఫకీర్ మోహన్ సేనాపతి, గాలిబ్, గిడుగు వెంకటరామమూర్తి, గోరాశాస్త్రి, గురజాడ, గుడిపాటి వెంకటాచలం, హరినారాయణ ఆప్టే, ఇల్లిందల సరస్వతీదేవి, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, జయశంకర ప్రసాద్, జయదేవుడు, జీబనానంద దాస్, జ్ఞానదేవుడు, కబీరు, కల్హానుడు, కంబ మహాకవి, కనుపర్తి వరలక్ష్మమ్మ, కాళోజీ

నారాయణరావు, కాశీనాథుని నాగేశ్వరరావు, కాజినజురుల్ ఇస్లాం,కేశవసుతే, కోలాచలం శ్రీనివాసరావు, కుమారన్ ఆశన్, లక్ష్మీనాథ బెజ్‌బారువా, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, మహాకవి శ్రీశ్రీ, మహాకవి ఉళ్లూర్, మహర్షి దేవేంద్రనాథ ఠాగూర్, మాణిక్ బంధోపాధ్యాయ, మాణిక్క వాచకరే, మీరాబాయ్, నామదేవుడు, నమ్మాళ్వారు, నానాలాల్, నాయని సుబ్బారావు, నార్ల, నజీర్ అక్బర్‌బాది, నిరాల, ఏంజె మంగేష్‌రావు, పానుగంటి లక్ష్మీనరసింహారావు, పరవస్తు చిన్నయసూరి, పింగళి-కాటూరి, పోతన, పొట్టెక్కాట్, ప్రేమచంద్, రాచకొండ విశ్వనాథశాస్త్రి, రాహుల్ సాంకృత్యాయన్, రాజారామ్మోహనరాయ్, రాంగేయ రాఘవన్, రారా, సరళాదాస, సరోజినీ నాయుడు, శ్యాంసుందర్‌దాస్, శ్రీ అరబిందో, శ్రీకాంతవర్మ, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, సర్వజ్ఞ, తారాశంకర్ బంధోపాధ్యాయ, తిరుమల రామచంద్ర, తుమ్మల సీతారామమూర్తి, తిరువళ్లువర్, తోరుదత్, తుకారాం, ఉ.వి. స్వామినాథ అయ్యర్, ఉన్నవ లక్ష్మీనారాయణ, వల్లత్తోల్, వాల్మీకి, వేదం వెంకటరాయశాస్త్రి, వీరేశలింగం, వేటూరి ప్రభాకరశాస్త్రి, వేలూరి శివరామశాస్త్రి, విద్యపతి, విశ్వనాథ సత్యనారాయణ, యశ్‌పాల్ మొదలగునవి.

సాహిత్య చరిత్రలు శీర్షికలో - అస్సామి సాహిత్య చరిత్రము, కన్నడ సాహత్య చరిత్రము, మలయాళ వాఙ్మయ చరిత్రము, సింధి సాహిత్య చరిత్రము, తమిళ వాఙ్మయ చరిత్రము, వంగ సాహిత్య చరిత్రము మొదలగునవి.

ఆదర్శరాజ్యం, ఆత్మకథ, బాలసాహిత్యం, భగవాన్ బుద్ధ, భారతి : సమకాలీన భావములు, భాసుడు, బుద్ధచరితము, కన్‌ఫ్యూషియన్ సుభాషితములు, గుడ్‌బై వామన్, ఇరవయ్యో శతాబ్దంలో తెలుగు రచయిత్రులు, జవహర్‌లాల్ నెహ్రూ జీవితచరిత్ర, జీవనలీల, కన్నడ వ్యాస సంకలనం, మానవులందరూ సోదరులు, నా చరిత్ర, రాజనీతి, రవీంద్రకథ, రవీంద్ర వ్యాసావళి - 2 భాగాలు, సమకాలిక భారతీయ సాహిత్యం, శరత్‌చంద్ర చటర్జీ; వ్యక్తి, రచయిత, సార్థవాహులు, స్వామి వివేకానందా, తో-తి-చింగ్, తెలుగు - కన్నడ డిక్షనరి, తలపుల దుమారం, వచనాలు, వడ్డారాధన, వక్రోక్తి జీవితము, వెయ్యినొక్కరాత్రులు, విశ్వకవి, యుగాంతం, నా జీవితపు వెండి బంగారుపుటలు, మలయాళ జానపద గేయాలు, దేశదిమ్మరి ప్రవక్త శరత్‌బాబు, తెలుగునాట మహిళల ఉద్యమాలు : విమర్శనాత్మక అంచనా మొదలగునవి కూడా ప్రచురించారు. ●



# ద్రావిడ విశ్వవిద్యాలయ ప్రచురణలు

1997వ సంవత్సరంలో 17వ చట్టం ప్రకారం చిత్తూరుజిల్లాలోని కుప్పంలో ద్రావిడ విశ్వవిద్యాలయం ఏర్పడింది. ఈ విశ్వవిద్యాలయం స్థాపనకోసం విశేషంగా కృషి చేసిన ఆచార్య వి.ఐ. సుబ్రహ్మణ్యం, కాశీపాండ్యన్ లాంటి మేధావులను స్మరించుకుంటూ ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చిన చేయూత అపారమైంది.

విశ్వవిద్యాలయం ప్రారంభంలో ఐదు విభాగాలు ఉండేవి. ప్రస్తుతం ఇరవై విభాగాలకు పైగా విస్తరించింది. కుప్పం పరిసర ప్రాంతాల్లో విద్యనభ్యసిస్తున్న వారి అవసరాలను తీరుస్తూనే విశ్వవిద్యాలయ స్థాపనోద్దేశాన్ని నిలబెట్టుకుంటూ ఉన్నత ఆశయాలతో కృషి సాగిస్తున్నది. అందులో భాగంగా తెలుగు, కన్నడం, మలయాళం, తమిళం, తుళు వంటి ఐదు ప్రధాన ద్రావిడ భాషా విభాగాలను నెలకొల్పి, ఆ విభాగానికి అనువాద అధ్యయనాన్ని అదనపు విలువగా చేర్చి విద్యార్థులను సలక్షణంగా రూపుదిద్దుతోంది. ఈ విశ్వవిద్యాలయంలోని ప్రతి విభాగం అనువాదాన్ని ప్రత్యేకంగా కలిగి ఉన్నది.

విశ్వవిద్యాలయాల కార్యకలాపాలను మూడు అంగాలుగా విభజించవచ్చు. అవి పరిశోధనాంగం, బోధనాంగం, ప్రసారాంగం. వీటిలో అతి ముఖ్యమైంది, అత్యంత అవసరమైంది ప్రచురణ - ప్రచారోపన్యాసాల అంగం. దీన్నే 'ప్రసారాంగ' అని పిలువవచ్చు. మైసూరు విశ్వవిద్యాలయానికి ఉపకులపతిగా పనిచేసిన డా॥ కె.వి. పుట్టప్ప మొదటిసారిగా ప్రసారాంగ అనే పదాన్ని ప్రయోగించి, విశ్వవిద్యాలయం మూడు అంగాలతో పనిచేస్తుందని వివరించారు. ఈ ప్రసారాంగ విశ్వవిద్యాలయానికి జీవనాడి, స్పందిస్తున్న హృదయం, నూతన ఆవిష్కరణల ప్రతిరూపం.

ప్రజల్లో జ్ఞానప్రసారం చేయటం ద్రావిడ సోదర భాషల అభివృద్ధికి, ద్రావిడభాషల సాహిత్యం, చరిత్ర, సాంస్కృతిక విషయాలు ప్రచారం చేయాలనే సంకల్పంతో ద్రావిడ విశ్వవిద్యాలయంలో ప్రసారాంగా స్థాపించబడింది. ద్రావిడ భాషలు ఇప్పటికి ఇరవై ఏడుగా గుర్తించబడ్డాయి. ప్రస్తుతం తెలుగు, తమిళం, మలయాళం, కన్నడ, తుళు భాషల్లో కథలు, నవలలు, కావ్యాలు, జీవితచరిత్రలు, సాంఘిక శాస్త్రం, చరిత్రలు, కవుల జీవనశైలి, శాస్త్రవేత్తల కృషిని తెలియజేయాలనే సంకల్పంతో ద్రావిడ సోదర భాషల్లో పరస్పరం అనువాదం కావించబడుతున్నాయి.

2005లో ఏర్పడిన ప్రచురణల కేంద్రానికి మొదటి డైరెక్టర్‌గా ప్రముఖ కవి వేగుంట మోహనప్రసాద్ నియమితులయ్యారు. ఈయన అనువాద ముద్రణలో కృషి చేశారు. ప్రసారాంగ ఇన్‌చార్జ్ డైరెక్టర్‌గా ఆచార్య రాజేంద్రప్రసాద్, డా॥ బి. తిరుపతిరావు కొంతకాలం పనిచేశారు. 2009లో ఈ శాఖకు శాశ్వత ప్రాతిపదికన సంచాలకులు ఆచార్య డి.వి. శ్రవణ్ కుమార్‌గారు నియమితులయ్యారు. ఉపసంచాలకులు ఒకరు, సహాయ సంచాలకులు నలుగురు, ఎడిటోరియల్ అసిస్టెంట్స్ ముగ్గురు, అసిస్టెంట్ ఎడిటర్స్ ఇద్దరు నియమించబడి పుస్తకముద్రణను ఉద్యమతుల్యంగా చేపట్టడం జరుగుతోంది. విశ్వవిద్యాలయంలోనే ఈ కేంద్రం దేదీప్యమానంగా వెలుగొందుతోంది. ఈ విశ్వవిద్యాలయం ప్రచురించిన గ్రంథాలు ప్రముఖ విక్రయ కేంద్రాలలో దొరుకుతున్నాయి.

ఏ భాషను గూర్చి అయినా తెలుసుకోవాలంటే ఆ భాషలోని పదజాలం తెలిసుండాలి. దీనికోసం ద్రావిడ విశ్వవిద్యాలయం నడుం బిగించింది. తెలుగుభాషపై పట్టుకసం వజ్రకోశం పేర తెలుగు నిఘంటువును ప్రచురించింది. అంతేకాదు నాలుగు రాష్ట్రాల కూడలి కావడంవల్ల వివిధ దక్షిణభాషా పదాల అర్థాలు తెలుసుకోవాలనే ఉద్దేశంతో తమిళ, మలయాళ, కన్నడ, తుళు, తెలుగు, ఆంగ్లం మొత్తం ఆరుభాషల్లో ఒక పదాన్ని ఏమని పలుకుతారో తెలుసుకోవడానికి బహుళభాషా నిఘంటువును ముద్రించింది.

విశ్వవిద్యాలయ ప్రచురణలు వివిధ గ్రంథాలయాలలో ఆధార గ్రంథాలుగా వాడుకలో ఉన్నాయి. విశ్వవిద్యాలయంలో నిర్వహించు వివిధ సదస్సు ప్రతాలను ప్రచురించడం, సదస్సులు జరుగు సమయంలో గ్రంథాలను జనంలోకి తీసుకెళ్ళడం జరుగుతుంది. 2011 నాటికి వివిధ భాషలలో ముద్రించిన గ్రంథాల వివరాలు : ఆంగ్లం - 81, తెలుగు - 61, కన్నడం - 27, తుళు - 11, తమిళం - 21, మలయాళం-9 ప్రచురించింది. 30 గ్రంథాలు ప్రచురించడానికి సిద్ధంగా ఉన్నాయి.

**విశ్వవిద్యాలయం ప్రచురించిన తెలుగు గ్రంథములు :**

తిరుక్కురళ్ ఆఫ్ తిరువళ్ళువరే, వేమన కవితాతత్త్వం, ద్రావిడ సాహిత్య సేతువు: ఆచార్య చల్లా, తెలుగు దేశ్య వ్యుత్పత్తి నిఘంటువు, పారిజాతాపహరణం - నంది తిమ్మన, శాహాజి పదసాహిత్యం, కార్వేటినగర సారంగపాణి పదములు, నీతిచంద్రిక, అనువాదం, గీతగోవిందం, ప్రాచీన కన్నడ వ్యాకరణాలు, జాలారి సిరిమల్లెలు,

హైదరాబాద్ కర్ణాటకలో స్వాతంత్ర్యోద్యమం, మూడు ముచ్చట్లు, ఎ బైలింగ్వల్ డిక్షనరీ ఆఫ్ ప్రిపోజిషన్స్, కర్ణాటక ఆంధ్ర సాహిత్య చరిత్ర, తెలుగన్నడ కథలు, రాయప్రోలు సుబ్బారావు, గుంటూరు శేషేంద్రశర్మ, గుర్రం జాషువ, ద్రావిడ ఉద్యమం కథ, యర్రర్యాగడి, నైలు నుంచి కృష్ణ దాకా, జ్యోతిష్య పదకోశం, విశ్వగురు (శ్రీ నారాయణ గురు జీవిత చరిత్ర), కైవారం నారాయణ తాత, భాష-సంస్కృతి-సమాజదర్శనం, ఆది జాంబవ మహాపురాణం, ప్రతాప్ ముదిలియార్ చరిత్ర, కామన్ మ్యాన్స్ మల్టీ లింగ్వల్ డిక్షనరి, అప్పకవీయ గురుబాలదీపిక, మానవీయ శాస్త్రాల పరిభాష, భారతదేశంలో ఆంగ్లేయులు, బాలవ్యాకరణం ఇతర ద్రావిడ భాషా వ్యాకరణాలు, పరిశోధన పద్ధతులు, ఆధునిక భాషాబోధన - చిన్నయసూరి, శ్రీ ధర్మరాజుల దేవస్థానం, హిందూ ధర్మశాస్త్ర సంగ్రహం, తులనాత్మక దాక్షిణాత్య సాహిత్య వ్యాసాలు, విశ్వనాథ సత్యనారాయణ, అనువాద కళ, అక్షరంలో అంతరిక్షం, రాజశేఖర కవితాస్మృతి, హోగెనకల్ జలపాతాలు ప్రకృతి అందాల పర్యాటక కేంద్రం, జానపద విజ్ఞానాధ్యయనం, ద్రావిడ శాస్త్రవేత్తలు, ద్రావిడ యోగులు, తెలుగుభాషా అధ్యయనంలో లంబాడీ విద్యార్థుల సమస్యలు-పరిష్కారాలు, చైనా బజార్ నుండి అబీద్ సర్కిల్ వరకు, పురావస్తు శాస్త్రం-పద్ధతులు, తెలుగు గిరిజనమాలిక - చెంచు, 1947 నాటి పరిటాల రిపబ్లిక్ పాలన, తెలుగు గిరిజనమాలిక - లంబాడి, అమ్మ, హంపీ హరిహరుడు, తెలుగు కథాసాహిత్యం గిరిజన జీవితం, వజ్రకోశం, కరదీపిక, ఆయుర్వేదం, హోమియోపతి, దక్షిణ భారతీయ జానపద విజ్ఞానకోశం, భారతీయ గ్రంథ పరిష్కరణ ప్రవేశిక, సనాతన ధర్మ వైశిష్ట్యము, శత వసంతాల శ్రీశ్రీ, వ్యాసరాజీయం, సాహిత్యం - సామాజిక అవసరం, ప్రచురణకళ - నిర్వహణ నైపుణ్యం, వ్యాసభారతి, ద్రావిడ కవిత, ఆధునిక సమాజంలో గిరిజనభాష - సంస్కృతులు, కథానుశీలన, దాక్షిణాత్య వాగ్గేయకారులు దేవీకృతుల ప్రాశస్త్యం, నల్గొండ జిల్లా వెట్టిచాకిరి చరిత్ర, కడపజిల్లా యోగులు - వీరబ్రహ్మేంద్రస్వామి ప్రభావం మొదలగునవి ద్రావిడ విశ్వవిద్యాలయం ప్రచురించి తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసింది. ●



# జయంతి పబ్లికేషన్స్

ముప్వల పెరుమాళ్లు 1924 ఆగస్టు 9న ప్రకాశం జిల్లా దర్శి తాలూకా గంగదేవిపల్లి గ్రామంలో జన్మించారు. తల్లి సుబ్బమ్మ, తండ్రి సుబ్బరాయమ్య. నాలుగవ తరగతి వరకు చదువు సాగింది. పుస్తకాలు చదవడం అలవాటు. గోర్కీ 'అమ్మ', గోరా గారి 'నాస్తికత్వం' పుస్తకాలు జీవితాన్ని ఒ మలుపు తిప్పాయి. వామపక్ష భావాలవైపు ఆకర్షితులయ్యారు. 14వ ఏట ఇంటి నుండి బయటికి వచ్చారు. గుంటూరులో జ్యూట్‌మిల్లు వర్కర్లు, టుబాకో వర్కర్లు, హమాలీ వర్కర్స్ యూనియన్‌లు కమ్యూనిస్టు పార్టీకి అనుబంధంగా ఉండేవి. పెరుమాళ్లుగారు హోటల్ వర్కర్స్ యూనియన్‌లో క్రియాశీలక కార్యకర్తగా పనిచేశారు. కమ్యూనిస్టుపార్టీ నిర్బంధానికి గురైనప్పుడు, కొంతకాలం అజ్ఞాతంలో గడిపారు. నిర్బంధం తరువాత 1952లో పుస్తకాలమీద మోజుతో విజయవాడలో 'నవశక్తి బుక్‌షాపు' నెలకొల్పారు. అప్పట్లో విజయవాడలో పబ్లిషర్స్ ఉన్నారు కాని, బుక్‌సెల్లర్స్ ఉండేవారు కాదు. ఒక్క విశాలాంధ్ర బుక్ హౌస్ మాత్రం షాపు ఉండేది విజయవాడ 2వ టౌన్‌లో. 'నేటి చైనా–భారత మేధావులు' ప్రచురించి, ప్రచురణకర్తగా మారారు. 1955లో 'జయంతి పబ్లికేషన్స్'ను నెలకొల్పారు. పుస్తకం పాఠకుడికి అందుబాటు ధరల్లో ఉండాలి. మంచి సాహిత్యం పాఠకుడికి అందజేసి, సాహిత్యసేవ చేయలని ఆకాంక్ష. రష్యాను, చైనాను, కమ్యూనిస్టు పార్టీని విమర్శించే పుస్తకాలు ప్రచురించకూడదు. అమ్మకూడదు అనేవారు.

ప్రపంచ రచయితలు టాల్‌స్టాయ్, ఆల్బర్ట్ మొరావో, పెరల్ ఎస్ బెక్, పుష్కిన్, గొగోల్, స్టాలిన్ రచనల అనువాదాలు ప్రచురించారు. విశ్వకవి రవీంద్రనాథ ఠాగూర్, బంకించంద్ర ఛటర్జీ, ప్రేమచంద్, శరత్ మొదలైన భారతీయ రచయిత రచనలను అనువదింపజేసి, ప్రచురించారు. రాహుల్ సాంకృత్యాయన్ జీవితచరిత్రను మొట్టమొదట తెలుగులో ప్రచురించింది పెరుమాళ్లుగారే!

గురజాడ అప్పారావు, కాళ్ళకూరి నారాయణరావు, ఉన్నవ లక్ష్మీనారాయణ, అడివి బాపిరాజు, నోరి నరసింహశాస్త్రి మొదలైన వారి రచనలు – నవలలు, కథలు, నాటకాలు, నాటికలు, ఏకపాత్రలు, నాటకరంగానికి సంబంధించిన రచనలు, జీవిత చరిత్రలు, గేయాలు, బాలసాహిత్యం మొదలైనవి దాదాపు 700 లకు పైగా ప్రచురించారు.

పెరుమాళ్లుగారు 1979లో రష్యా పర్యటించారు. ఢిల్లీలో 1995లో ఆల్ ఇండియా పబ్లిషర్స్ ఫెడరేషన్‌వారు విశిష్ట తెలుగు ప్రచురణకర్తగా సన్మానించారు. 2011 నుండి పెద్దకుమారుడు మువ్వల సుబ్బరామయ్య సంస్థను నిర్వహిస్తున్నారు. 2015కి సంస్థను స్థాపించి 60 సాహిత్య వసంతాలు.

మువ్వల పెరుమాళ్లుగారు 2014 జనవరి 21న తొంభైవ ఏట మరణించారు.

**రవీంద్ర కవీంద్రుని రచనలు** – గీతాంజలి, రాజర్షి, చతురంగ, జల్‌జలా, రాణీఘాట్, నా జన్మభూమి, నా జీవితస్మృతులు, పంచభూతాలు, అతడు, చివరిమాట, శేషకవిత, గోరా, చోఖేర్‌బాలి, కుముదిని, ఇంటా-బయటా, పడవమునక, చారులత, సాధన, అక్కాచెల్లెలు, లేబరేటరీ, కిరణ్మయి, చిరకుమార సభ, రవీంద్ర కథావళి, ఉత్తమ యిల్లాలు. ముక్తధార, నటీర్‌పూజ, తరణి, మాలిని, కాబూలీవాలా, మూడు నాటికలు, పోస్టాఫీస్, అరూపరత్నం, చంద్రవంక, రవీంద్ర నాటకావళి, నదీతీరం, ఆకలిరాళ్లు, చండాలిక, సన్యాసి, చిత్ర, ప్రేమకానుక, రవికిరణాలు, ఆదర్శ ప్రేమ, నందిని, పసిపాపల దరహాసం మొదలగునవి.

**బంకించంద్ర చటర్జీ రచనలు** – ఆనందమఠం, మాతంగిని, సీతారామ్, ఇందిర, రజని, కృష్ణకాంత్, విషవృక్షం, కపాలకుండల, దుర్గేశనందిని, రాజసింహ, మృణాలిని మొదలగునవి. **శరత్ రచనలు** – బడదీదీ, విజయ, పరిణీత, దేవదాసు, చంద్రనాథ్, విజాజ్‌బహ, నయావిధాన్, పల్లీసమాజ్, మఝిలీదీదీ మొదలగునవి. **ప్రేమచంద్ రచనలు** – నిర్మల, కర్మభూమి, మనోరమ, సేవాసదన్ మొదలగునవి.

ఉన్నవ లక్ష్మీనారాయణ మాలపల్లి, అడివి బాపిరాజు రచనలు – నారాయణరావు, గోనగన్నారెడ్డి, హిమబిందు, కోనంగి, తుపాను, అడివి శాంతిశ్రీ, రాగమాలిక, శైలబాల, అంజలి, అంశుమతి, నరుడు, జాజిమల్లి, శశికళ మొదలగునవి; నోరి నరసింహ శాస్త్రి రచనలు – రుద్రమదేవి, మల్లారెడ్డి, ధూర్జటి, నారాయణభట్టు, కవిద్వయం, కవిసార్వభౌముడు మొదలగునవి.

వాల్మీకి రామాయణం, మహాభారతం, మహాభాగవతం, భగవద్గీత, మనుస్మృతి, కౌటిల్యుని అర్థశాస్త్రం, మనుచరిత్ర, వసుచరిత్ర, కుమారసంభవం, రఘువంశం, మొల్ల రామాయణం, కాదంబరి, పల్నాటి వీరచరిత్ర, హరవిలాసం, విజయవిలాసం, ప్రభావతీ ప్రద్యుమ్నం, కళాపూర్ణోదయం, పాండురంగ మాహాత్మ్యము, ఆముక్తమాల్యద,

కాశీఖండం, నాగానందం, భీమఖండం, విక్రమోర్వశీయం, జైమిని భారతం, శృంగార నైషధం, శృంగార శాకుంతలం, కిరాతార్జునీయం, పారిజాతాపహరణం, మృచ్ఛకటిక, ఉత్తరహరివంశం, ఉత్తర రామచరిత, విక్రమార్క చరిత్ర, వేణీసంహారం, దశకుమార చరిత్ర, మాలతీమాధవం, మాళవికాగ్ని మిత్రం, మేఘసందేశం, రత్నావళి, స్వప్న వాసవదత్త మొదలగునవి వచనంలో ప్రచురించారు.

అమ్మ, యుద్ధం-శాంతి, కొడుకులు - కూతుళ్ళు, జాతుల సమస్య, సామ్యవాద ఆర్థిక సమస్యలు, రెండవ ప్రపంచ యుద్ధంలో స్టాలిన్ పాత్ర, స్టాలిన్ జీవితచరిత్ర, వీర తెలంగాణా విప్లవపోరాటం - గుణపాఠాలు, ఎర్రజెండాలు, ఆదర్శకుటుంబాలు, కేరళ జాతీయ సమస్య, తెలుగు సంస్కృతి-మార్క్సిజం ప్రభావం మొదలైన పాపులర్ పుస్తకాలు - ప్రచురించారు.

తెన్నేటి హేమలత, కావిలిపాటి విజయలక్ష్మి, డి. కామేశ్వరి, సి. ఆనందారామం, పోల్కంపల్లి శాంతాదేవి, పోల్కంపల్లి రాజ్యలక్ష్మి, యార్లగడ్డ సరోజినీదేవి, శ్రీమతి శ్రీదేవి, యామినీ సరస్వతి, సింగరాజు లింగమూర్తి, డాక్టర్ రాధ, సి.కె. లక్ష్మి, ఎస్. ఝాన్సీరాణి, అట్లూరి హజరా, పి. సత్యవతి, వాసిరెడ్డి కాశీరత్నం, లల్లాదేవి మొదలైన రచయితల రచనలు 200 లకు పైగా వెలువరించారు.

**నాటకాలు** - కన్యాశుల్కం, వరవిక్రయం, చింతామణి, మధుసేవ, మాస్టర్జీ, ఇదేనా జీవితం, కిలాడి, చిరిగిన జీవితాలు, గ్రామాయణం, వీరపాండ్య కట్టబ్రహ్మన, వీరపాండ్య కట్టబొమ్మన, వీరకాపయ, నాగమనాయకుడు, కాంతా కనకం, వైకుంఠ భవనం, పాపం పది రకాలు, శ్రీమంతులు, అభిమాని, అపరాధి మొదలైనవి. **నాటికలు** - అనుబంధం, ఆత్మహత్య, రాగసరాలు, నీడలో నిజం, తెలుగు డిటెక్టివ్, నేరస్తు డెవరు? జీవితాలు, నిజస్వరూపాలు, పాపం పండింది, భయం బ్రతుకు, లోభి, సమిధ, జలిత జ్వాల, అప్పుపత్రం, తెరలో కురుక్షేత్రం, ప్రేమసాగర మథనం, వారసత్వం, ఆపదమొక్కులు, ఎవరినీ నమ్మకు, అల్లూరి సీతారామరాజు, భగత్‌సింగ్, వీర పాండ్య కట్టబ్రహ్మన, శశికళ, పిచ్చిరాజు ఇంటర్వ్యూ, నాటకం రేవనగా, ఇల్లు అమ్మకం, ఏమి జీవితాలు ? మాతృదేవోభవ, పెళ్ళి ఇంటర్వ్యూ, డామిట్ కథ అడ్డం తిరిగింది, భీమా ఏజెంట్ భీమారావు, కోటివిద్యులు, ప్రెసిడెండ్ పెంయ్య, ప్రొడ్యూసర్లొ స్తున్నారు జాగ్రత్త, అసలుకు మోసం, సి.ఐ.డి. రాజు, అల్లుళొస్తున్నారు జాగ్రత్త, శవం లేచిపోయింది, కొత్త టోపీ, ఏప్రిల్ ఫూల్, లాటరీ టికెట్, గాంధీ మళ్ళీ పుడితే,

కోతలరాయుడు, ఎత్తుకు పైఎత్తు, ఉత్తమ విద్యార్థి, ప్రేమపక్షులు, సినిమా జీవులు, స్వర్గంలో త్రిమూర్తులు, నారద భూలోకయాత్ర, నరకంలో లంచం, భలేదొంగ, డ్రామారిహార్సల్, పిచ్చి ప్లీడరు, పెళ్ళిగండం, గుండెలు తీసిన బంటు, పెళ్ళిచూపులు, నిలువుదోపిడి, ఎం.ఎల్.ఏ. ఏడుకొండలు, తుగ్లక్‌మంత్రి, డాక్టర్ ఎ.బి.సి.డి., అమెరికా కుక్క, ప్రజారాజ్యం మొదలగునవి. నాటకరంగానికి సంబంధించినవి - ఆంధ్ర నాటక దర్శిని, అభినయం, ఆంధ్ర నాటక సమీక్ష, నటన, నాట్యశాల, ఆంధ్ర నాటక కవులు, నటశిక్షణ, నాటక పోటీలు, ప్రాచీన పాశ్చాత్య నాటకరంగ చరిత్ర మొదలగునవి.

చీకటిగదులు, దేశంకోసం, నేనూ-నాదేశం, కవిరాజ దర్శనం, రవీంద్ర దర్శనం, క్షేత్రయ్య పదాలు, వేమన భావన, బంగారిమామపాటలు, జానపద గేయాలు, దేశభక్తి గేయాలు, చలం శ్మశాన సాహిత్యం, యుగకర్త వీరేశలింగంపై నీలాపనిందలు!, వైజ్ఞానిక గాథాశతి, ఇంటింటా విజ్ఞాన సర్వస్వం, విశ్వమా! నీ వయసెంత ? మెదడూ-మనసు, మంచి ఉపన్యాసకుడంటే ఎవరు, ఎక్కడకీ ప్రస్థానం, ప్రపంచ రాజ్యాల సంగ్రహ చరిత్ర, నరబలి, సత్యకామజాబాలి, రకరకాల వంటలు, రకరకాల పిండివంటలు, హోమియో వైద్యం, సూక్తులు - హితోక్తులు, భారత స్వాతంత్ర్య పోరాటచరిత్ర, గదర్‌వీరులు, చిట్టగాంగ్ విప్లవవీరులు, జీవిత చరిత్రలు - గాంధీజీ, నెహ్రూ, భగత్‌సింగ్, చంద్రశేఖర ఆజాద్, సుభాష్ చంద్రబోసు, రాహుల్ సాంకృత్యాయన్, వివేకానంద, రాజారామమోహనరాయ్, జిడ్డు కృష్ణమూర్తి, అల్లూరి సీతారామరాజు, బుద్ధుడు, స్టాలిన్ మొదలగునవి ప్రచురించారు. బాలసాహిత్యం రెండువందల రకాలు ప్రచురించారు.

ముప్పల సుబ్బరామయ్య రచనలు - ప్రాచీనకవులు, ప్రాచీన సాహిత్య దర్శనం, వేదవాఙ్మయం, అరువది నాలుగు కళలు, తెలుగు సాహిత్యంలో హాస్యోక్తులు, సాహిత్య మరమరాలు, గీతాంజలి, దేశభక్తి గేయాలు, తెలుగు ప్రచురణరంగం, సాహిత్య డైరీ మొదలగునవి ప్రచురించారు. పెరుమాళ్ళు గారి అనుభవాలు - జ్ఞాపకాలు కూడా ప్రచురితమైనది. ●



**(మొదటి భాగం సమాప్తం)**

# ముప్పల సుబ్బరామయ్య
## ఇతర రచనలు

| | |
|---|---|
| ప్రాచీన కవులు | 90/- |
| ప్రాచీనసాహిత్య దర్శనం | 100/- |
| సాహిత్య మరమరాలు | 125/- |
| వేదవాఙ్మయం | 75/- |
| తెలుగు సాహిత్యంలో హాస్యోక్తులు | 70/- |
| అరువది నాలుగు కళలు | 30/- |
| సాహిత్య డైరీ | 100/- |
| తెలుగుసాహితీవేత్తల చరిత్ర - 1 | 125/- |
| ఠాగూర్ గీతాంజలి అనువాదం | 50/- |
| దేశభక్తిగేయాలు | 45/- |
| తెలుగు సాహితీవేత్తల చరిత్ర - 2 | త్వరలో |
| సాహిత్య తోరణాలు | త్వరలో |

